వేంకటరాయశర్మ, కోన

హిందూదేశరాజ్యాంగచరిత్రము

ఏలూరు, 1927

Record no. 793

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

వేంకటరాయశర్మ, కోన.
హిందూదేశరాజ్యాంగచరిత్రము / కోన వేంకటరాయశర్మగారిచే రచియింపంబడినది.- 1. కూర్పు.- ఏలూరు : కోన వేంకటరాయశర్మ, 1927.
5, 110, 4 p. :port. ;21 cm.
Record no. 793

Vēṅkaṭarāyaśarma, Kōna.
Hindūdēśarājyāṅgacaritramu / Kōna Vēṅkaṭarāyaśarmagāricē raciyimpambaḍinadi.- 1. kūrpu.- Ēlūru : Kōna Vēṅkaṭarāyaśarma, 1927.
5, 110, 4 p. :port. ;21 cm.
Record no. 793

35 mm microfilm
Image placement: IA IIA IB IIB Date filming began:

శ్రీ

ప్రాచీన

# హిందూదేశ రాజ్యాంగ చరిత్రము.

OF THE ... No. ... 10 APR 1928

ఇది

సాహిత్య విశారద

బ్రహ్మశ్రీ కోన వేంకటరాయ శర్మగారిచే

రచియింపఁబడి ప్రకటింపఁబడినది.

---

బ్రహ్మశ్రీ

శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు

బహద్దరు జమీందారువారికి

కృతి యీయఁబడెను.

547 / 11793

---

మొదటికూర్పు 1000 ప్రతులు.

1927.

సర్వస్వామ్య సంకలితము] [దీని వెల రు 0-12-0 లు.

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాల,
ఏలూరు.

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి.

# కృతి సమర్పణము.

—:0:—




క. శ్రీరమ్యునకుఁ జిత్రమ
న్దారున కేలూరు పట్టణ నివాసునకుఁ
ధీర జన కుముద సముదయ
తారేశున కంచిత హారితస గోత్రునకుఁ.

క. ఆర్వేల వంశ నీరధి
పర్వేందునకున్ నిరస్త బంధుర కవితా
ధూర్వహునకుఁ నిరంతర
గర్విత విమతోరు సర్ప ఖగరాజునకుఁ.

క. అప్రతిహత ధీనిధికిఁ
విప్రారాధన సమాప్త విశ్రుతికిఁ శాం
త ప్రకృతికి రాజా మం
త్రి ప్రెగడ భుజం[illegible]రాయ ధీరాగ్రణికిఁ.

మ. వివరం బొప్పఁగ నే రచిం[illegible] లసద్విఖ్యాత ప్రాచీన హైం
దవ రాజ్యాంగ చరిత్ర నా[illegible] మోదంబిచ్చు నీ సత్కృతిం
గవులా నౌనని మెచ్చ[illegible] బొగడంగా నే సమర్పించితిన్
దివిజాధీశుఁడు చక్రి [illegible]తన్ దీర్ఘాయురారోగ్యముల్.

— గ్రంథకర్త.

# ఒక మనవి.

సాధుమతులారా!

స్వయం సాహాయ్యమున స్వతంత్ర జీవన మొనర్చుచుఁ దమ వ్యవహారములఁ దాము దిద్దుకొనుచు ధర్మ నిర్ణయములను జేయుచు నాదర్శప్రాయముగ నుండిన మనపూర్వుల ప్రతిభను దక్షతను బాలనా సౌష్ఠవమును దెలిసికొన వలసిన యావసర మెంతేనిఁ గలదు కావున నేనీ గ్రంథమును వ్రాసి తమ యెదుట నుంచితిని.

'ఆపరితోషాద్విదుషాం నసాధుమన్యే ప్రయోగ విజ్ఞాన' మ్మను నట్లు లెవరికేని దమ తప్పు తమకుఁ దెలియదు కావున 'గచ్ఛతః స్ఖలనం క్వాపి భవత్యేవ ప్రమాదతః' అను రీతి నచ్చటచ్చట లొసఁగు లుండుట సహజము. ప్రాజ్ఞులగు వారిందుఁగల లోపముల నావిష్కరించినఁ గృతజ్ఞుఁడను.

నా పరోక్షమునఁ బత్తు ప్రతులను దిద్ది సాహాయ్యమొనర్చిన లక్కవరాస్థాన విద్వాంసులగు బ్రహ్మశ్రీ కొత్తపల్లి సుందరరామయ్య గారికిఁ గృతజ్ఞతా పూర్వక వందనము లర్పించుచున్నాను. నాకీ గ్రంథ రచనమునఁ దోడ్పడిన గ్రంథములకును తత్కర్తలకును గృతజ్ఞుఁడను.

పెదచెఱుకూరు,
విభవ చైత్ర శు 3 లు
శనివారము.

ఇట్లు,
విన్నవించు విధేయుఁడు,
కోన వేంకటరాయశర్మ.

# విషయసూచిక.



# అభిప్రాయములు.

ఆంధ్ర పరిశోధక విశ్వకళా పరిషదధ్యక్షులును, విజయనగర మహారాజావారి కళాశాలయం దాంగ్లభాషాధ్యాపకులును, నగు బ్రహ్మశ్రీ బుర్రా శేషగిరిరావు పంతులుగా రిట్లనుగ్రహించిరి.

మిత్రులకు నమస్కృతులు.

మీరు పంపిన "ప్రాచీన హైందవ రాజ్యాంగ చరిత్ర" ను కృతజ్ఞతా పూర్వకముగ నందికొని చదివితిని. మీగ్రంథ మాంధ్రమున నమూల్యమైనదని చెప్పక తప్పదు. ఇట్టి గ్రంథము ప్రచురింపించి శ్రీ భుజంగరావు రాజావారు ఆంధ్రలోకమునకును, ముఖ్యముగా ఆంధ్ర యూనివర్సిటీ వారికిని మార్గదర్శులైనారు. ఆంధ్రమున నున్నత విద్యాబోధక సాధనములలో మీగ్రంథ మొకటి కాగలదు. కాని మన దుర్భాగ్యదశ యేమనగా మీవంటివారి కింగ్లీషులో డిగ్రీలుండిన గాని గవర్నమెంటువా రేర్పరచిన యూనివర్సిటీలో స్థానముండదు. ఇట్టి దుర్భాగ్యదశ తొలగించి దేశీయమైన విద్యాసంస్థను వృద్ధి పరచుటలో శ్రీ రాజావారీ విధముననే తోడ్పడి కీర్తి నొందుదురుగాక!

చిత్తగించవలెను.

విజయనగరము,
1—3—1928.

బుర్రా శేషగిరిరావు,
ఎం. ఏ; పి. హెచ్. డి.



# నాకీ గ్రంథ రచనమున దోడ్పడిన గ్రంథములు.

—:0:—

| | |
|---|---|
| అర్థశాస్త్రము. | చాణక్యుడు. |
| నీతివాక్యామృతము. | సోమదేవసూరి. |
| హర్షచరిత్ర. | |
| శ్రీమద్రామాయణము. | |
| మహాభారతము. | |
| మనుస్మృతి. | |
| గౌతమ ధర్మసూత్రములు. | |
| బృహస్పతి సూత్రములు. | |
| ఆపస్తంబ సూత్రములు. | |
| విష్ణుపురాణము. | |
| వాయుపురాణము. | |
| మత్స్యపురాణము. | |
| శుక్రనీతిసారము. | పురాణపంత మల్లయ్యశాస్త్రిగారు. |
| మృచ్ఛకటిక. | |
| ముద్రారాక్షసము. | |
| ఋగ్వేదము. | |
| కామందకి. | |
| ఆంధ్రుల చరిత్ర. | చిలుకూరి వీరభద్రరావుగారు. |
| గణితసార సంగ్రహము. | మహావీరాచార్యుడు. |
| శుక్రనీతి. | |
| మహామ్మదీయ మహాయుగము. | కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు. |
| కాదంబరి. | |
| అగ్నిపురాణము. | |
| మానసార. | |



| | |
|---|---|
| వీరమిత్రోదయము. | |
| బృహత్సంహిత | వరాహమిహిరుడు. |
| ఆంధ్రవాల్మీకి రామాయణము. | వావిలికొలను సుబ్బారావుగారు. |
| వృక్షాయుర్వేదము. | |
| బోధిసత్వ వేదాంతకల్పలత. | క్షేమేంద్రుడు. |
| రఘువంశము. | కాళిదాసు. |
| ఐతరేయ బ్రాహ్మణము. | |
| రాజతరంగిణి | కల్హణ పండితుడు. |
| శతపథ బ్రాహ్మణము. | |
| శివాజీచరిత్ర. | కొ. వేం. లక్ష్మణరావుగారు. |
| శాకుంతలము. | కాళిదాసు. |
| మనుచరిత్ర. | అల్లసాని పెద్దనామాత్యుడు. |
| బోధాయన సూత్రములు. | |
| యాజ్ఞవల్క్యస్మృతి. | |
| పరాశరస్మృతి. | |
| పూర్వమీమాంస. | |
| విజ్ఞాన సర్వస్వము. | |
| జైమిని సూత్రములు. | |
| దేవీభాగవతము. | |
| ఛాందోగ్యోపనిషత్తు. | |
| బృహదారణ్యకోపనిషత్తు. | |
| మహావంశము. | |
| వసిష్ఠ సూత్రములు. | |
| భగవద్గీత. | |
| అథర్వణ వేదము. | |

———

## ఇవిగాక కొన్ని శాసనములు.

| | |
|---|---|
| Ancient India. | R. C. Dutt. |
| " | Rapson. |
| Hitory of Indian Sculpture and painting. | Havel. |
| ఫర్‌గాటన్ ఎంపయర్ (విస్మృత సామ్రాజ్యము.) | సూయల్. |
| Buddhist India. | రైసుడేవిడ్సు Rhys Davids. |
| Early History of India<br>Life of Asoka. | V. A. Smith. |
| Ancient India. | కిన్రిండలు. |
| A History of Indian Architecture. | Fergusson. |
| Vedic India | Macdonell. |
| Life of Hieun Thsang. | Beal. |
| Travels of Fa-Hian. | Legge. |
| Buddhistic Records. | |
| The Journal of the Royal Asiatic Society. | |
| ప్రాచీనశాసనములు. | రాధాకుముదముఖర్జీ. |
| ప్రాచీన భారతీయుల రసాయనిక సిద్ధాంతములు. | బ్రజేంద్రనాథ సీలు. |
| ఆర్థికశాస్త్ర వ్యాసములు. | మహాదేవగోవిందరనడే. |
| Republic. | ప్లేటో. |
| హిందూప్రభుత్వసంప్రదాయము. | అబుల్ ఫజల్. |
| Epigraphia Zeylanica. | |
| Buddhist Cave Temples. | Burgess. |
| స్వప్నవాసవదత్త. | |
| ప్రతిమానాటకము (భాసుడు.) | |

కృతిభర్త.



శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు
బహద్దరు జమీందారుగారు
ఏలూరు.



కృతికర్త.



సాహిత్య విశారద కోన వేంకటరాయ శర్మగారు.






# ప్రాచీన
# హిందూదేశ రాజ్యాంగచరిత్ర.

---

## గ్రామనిర్మాణము.

ప్రాచీన భారతవర్షమున గ్రామనిర్మాణము మహోత్కృష్టమైన సంస్థ. హైందవ సామ్రాజ్యమంతయు గ్రామసంస్థలపయి నాధారపడియుండెను. ఆర్యులకు ముందు దినములలో భారతవర్షమున నేర్పడియున్న గ్రామపరిపాలన విధానమును గూర్చి మన కేమియుం దెలియదు. కోలారియను వారలవలన వచ్చిన ద్రావిడులు గ్రామ ప్రభుత్వములం జేయుచు వారి పూర్వులవలన నెలకొల్పంబడిన గ్రామ సంఘములను మంచి స్థితియందుంచిరి. గ్రామ సంఘములు కోలారియనుల యేలుబడిలో కన్న కేంద్రప్రభుత్వముపయి నెక్కువ ఆధారపడి యుండెను. ద్రావిడులు ప్రతి గ్రామమునను ప్రతిరాష్ట్రమునను నధివసించిరి. ద్రావిడుల ప్రభుత్వమున రాజకీయ కార్యస్థానము లన్నియుం గోలారియనులవలె నెన్నికొనుటకు బదులు ప్రభుత్వ నియోజితులచే గ్రామములందలి గొప్ప పదవులన్నియుం బూర్తిచేయఁబడెడివి. ప్రతి గ్రామమునందును ప్రజాసేవ నిమిత్తము భూములను ప్రత్యేకించి ద్రావిడు లుపయోగించెడివారు. రైతుల కోర్కె ననుసరించి ఈ భూములను వ్యవసాయము చేయుటకు రాష్ట్రీయ బొక్కసములలోను ప్రభుత్వమువారి బొక్కసములలోను ధాన్యము నిలువ చేయఁబడుచుండెను. ప్రథమమునఁ బన్నులు చెల్లించుకాలమున నీవిధాన మాచరణయందుండెను. ద్రావిడులున్న గ్రామములలోని స్త్రీలును బురుషులును ప్రభుత్వనిర్వహణమునకయి భాగములవెంబడి విరాళముల నిచ్చుచుండిరి. కాని కోలారియను లుండిన గ్రామములలో మాత్ర మీవిధాన మాచరణమందుండలేదు. "ఆ గ్రామములలో ద్రావిడులవలెం గోలారియనులు తయారయి యుండలేదు. భారతవర్షమునకు ద్రావిడులు వచ్చుటకుం బూర్వము చాల కాలమునుండియుం గ్రామశిక్షణమునను నణంకువ యందును నారితేరి యుండుటవలన వీరివలెం గోలారియనులు తయారయి యుండలేదు" అని రాయల్ ఏషియాటిక్ సొసైటి పత్రికయందు F. J. హివిట్సు అను నతఁడు వ్రాసిన వ్యాసమువలనం దెలియుచున్నది.

వేదకాలమున గ్రామములోని సామాన్య వ్యవహారములు గ్రామసంస్థలే నిర్వహించుచుండెను. 'నమో మాత్రే పృథివ్యై॥ ఉపసర్పమాతరం భూమిమేతామురువ్యచసం, పృథివీం సుశేవాం॥ యే గ్రామా యదరణ్యం యాః సభా అధిభూమ్యాం।

యేసంగ్రామాః సమితయస్తేషు చారువదేమత్॥' ఓ మాతృభూమీ! నీకు నమస్కారము. నేను గ్రామమునను అతివిస్తీర్ణమును నగు జన్మభూమిలోఁజేరి గ్రామములను సభలలోను, రణరంగములందును, సమితులయందును, ఎందున్నను నిన్ను గూర్చి యెల్లప్పుడు మంచినే వచింతును. 'ధర్మాయసభాచరం; నమః సభాభ్యాం సభాపతిభ్యశ్చవో నమః' ధర్మముకొఱకు సభ్యులు మోగ్రిల నిలుతురు. అట్టి సభాపతులకును సభలకును నమస్కారములు. 'శ్రీణిరాజానా, విదథేపురూణి పరివిశ్వాని భూషథః సదాంసి; రాజానావనభిద్రుహోధ్రువే సదస్యుత్తమే। సహస్రస్థూణ ఆసాతే'॥ ధర్మసభ రాజసభ విద్యాసభ యను మూఁడు గొప్ప సదస్సులను రాజులు వారి రాకవలన సమ్మానింతురు. అనూయా విరహితులై రాజులు సహస్ర స్తంభములు గల సభాగృహములలోఁ గొలువుఁదీరుదురు. 'సమానోమన్త్రః, సమితిఃసమానీ, సమానం వ్రతం, సహచిత్తమేషాం'॥ మంత్రము సమానము, సమితి సమానము, వ్రతము సమానము, వారి యాప్సితములు సమానములు. అర్హత గలవాఁడు సమాన సభను సభ్యుఁడగుటను వైదిక యుగమున నేవిధమైన ఆతంకములు లేవు. ఆ కాలమునఁ బ్రభువు ప్రజారంజకుఁడయి సమితులయొక్కయు సేనలయొక్కయుఁ గోశములయొక్కయు ననుమతిఁబొంది వర్తించుటవలన నందఱిచే గౌరవింపఁబడుచుండెను. అట్టి ప్రభువు, 'సభ్యాః సభాం మేపాహియేచ, సభ్యాం సభాసదః' ఓ యీశ్వరా! నా సభను నా సభ్యులను గాపాడుఁడని ప్రార్థించుచుండువాఁడు. 'సభాచమా సమితిశ్చావతాం, ప్రజాపతేర్దుహితరౌ సంవిదానే, యేనాసంగచ్ఛా ఉపమాస శిక్షాచారువదాని పితరః సంగతేషు' నా సభలు నా సమితులు నన్ను రక్షించుఁగాక! ప్రజాసంరక్షణమున కవి కుమార్తెల వంటివి. అవి నాకు జ్ఞానమిచ్చును. అందుఁ బ్రతివాఁడును నాకు యోజనము చెప్పుఁగాక! ఓ తండ్రులారా! సభలయందుఁ దియ్యని మాటలనే పలుకుదును.' చూచినారా! అచ్చట సభ్యులను బ్రభువు తండ్రులారా! యని సంబోధించినాఁడు. అత్తవారింటికిఁ గాపురమునకుఁ బోయి సొంతకాపురము చేయుచున్న కుమార్తెలవలెఁ బ్రభునిర్బంధము లేని స్వాతంత్ర్యులగుటవలన ఋషి వారిని దుహితలతోఁ బోల్చినాఁడు. వారు స్వతంత్రులగుటవలనఁ బ్రభువునకు వివేకముఁ గూర్ప శక్తిమంతులగుదురు. నేఁటి కాలమునఁ గొన్ని పురపాలక సంఘములందలి సభ్యులను 'సిటీఫాదర్స్' అని పిలుచునట్లుగా వైదిక యుగమునందును సభ్యులను దండ్రులని వాడుచుండిరి. వారి కేవిధమగు ప్రభుత్వాదరణ యుండెనో యీ శబ్దమే చెప్పుచున్నది. అట్టి సభ్యులనుండి విజ్ఞానమును వర్చస్సును బ్రభువులు సేకరించి వారితోఁ బాలనా చక్రమును నడుపుచుండిరి.

ప్రొఫెసరు మాక్డొనలు అను నతఁడు పూర్వపు దినములలో న్యాయ వ్యవహారములకు గ్రామము లొక్కటిగ నేర్పడి యుండలేదనియు గ్రామసంస్థ రాజకీయ సంస్థగ నుండెననియుఁ జెప్పుచున్నాఁడు. (Vedic Index, 1. P. 246) కేంద్ర ప్రభుత్వమునకును—స్థానిక (గ్రామ) ప్రభుత్వమునకును, జాలిచాలని భేదముండెను. స్థానిక వ్యవహారములను నిర్వహించుటకయి ప్రత్యేక నిర్మాణ మవసరమని కనిపెట్టఁబడి



నది. రాజ్యములు విస్తరిల్లిన కొలఁది కేంద్ర ప్రభుత్వమునకును—స్థానిక ప్రభుత్వమునకును గల ప్రతిభ రానురాను గుర్తింపఁబడినది. గ్రామములు సంపూర్ణ ప్రజాస్వామ్యములని తెలియుచున్నది. కేంద్ర ప్రభుత్వమునుండి గ్రామములు విడివడినవి. గ్రామణి యనఁగా గ్రామాధికారి. గ్రామములోని యితరోద్యోగులు గ్రామసంఘమున నియమింపఁబడుచుండిరి. ఋగ్వేదమున 'గ్రామణీ' యను పదము గ్రామనాయకుని పరముగ నుపయోగింపఁబడినది. గ్రామాధికారులు సంఘమునకు బాధ్యులయి యుండిరి. గ్రామాధికారి ప్రభుత్వ నియోజితుఁడు కాఁడు. పూర్వపు దినములలో గ్రామసంఘమే యీ నియామకము చేయుచుండెను. "ఈ నియామకము గ్రామసంఘమువలన స్థిరపఱుపఁబడి గాని లేక వంశ పరంపరగఁగాని యుండు"నని ప్రొఫెసరు వైద్యదేవుడు అను నతఁడు చెప్పుచున్నాఁడు. (బౌద్ధ హిందూదేశము, పుట ౧౪౫) క్రమక్రమముగ గ్రామాధికారులు ప్రభుత్వాధీనమున నుండసాగిరి. "కొన్ని సమయములందీ యుద్యోగము పారంపర్యముగను గొన్ని సమయములందన్ని కొలఁది మాలమునను నియామకము మాలమునను నుండెను గాని వ్యక్తమగు నియమ మేమియు లే"దని ప్రొఫెసరు మాక్డొనల్ అనునతఁడు చెప్పుచున్నాఁడు. (Vedic India, I P. 247) మనువు కాలమున గ్రామోద్యోగులు ప్రభుత్వ సేవకులగనైరి. స్థానిక ప్రభుత్వ విధానము కేంద్ర ప్రభుత్వమునకు వశము యయ్యెను.

'గ్రామస్యాధిపతిం కుర్యాద్దశగ్రామపతిం తథా।
వింశతీశం, శతేశంచ సహస్రపతిమేవచ॥
గ్రామేదోషాన్ సముత్పన్నాన్ గ్రామికశ్శనకైః స్వయం।
శంసేద్గ్రామ దశేశాయ దశేశో వింశతీశనే॥
వింశతీశస్తు తత్సర్వం శతేశాయ నివేదయేత్।
శంసేద్గ్రామ శతేశస్తు సహస్రపతయే స్వయం।

మను ౭ (౧౧౫, ౧౧౬, ౧౧౭.)

అనఁగా గ్రామమున కొక యధికారియుఁ, బది గ్రామముల కొకరును, ఇరువది గ్రామముల కొకరును, నూరు గ్రామముల కొకరును, వేయి గ్రామముల కొకరును నుందురు. ఆయా గ్రామాధిపతులు తమ గ్రామములలో జరిగెడు వివాదము లన్నిటిని విచారణ చేయవచ్చును గాని దోషానిర్ణయము బట్టి పది నూరు గ్రామముల యధికారి యొద్దకుఁగాని వేయి గ్రామముల యధికారి యొద్దకుఁగాని నేరములను శిక్షకుఁ బంపుచుందురు. న్యాయాధిపతులు గ్రామాధిపతులు నేరము జరిగిన ప్రదేశమునకుఁ బోయి స్థలవిచారణ మొనర్చి తీర్పు చెప్పవలయునని మనువు నియమించుచున్నాఁడు. ప్రతి గ్రామమునను గ్రామాధికారి యుండునుగాని యట్లే పది గ్రామములకును నూరు గ్రామములకును వేయి గ్రామములకును గ్రామాధికారు లుండవలయు

ననియు రాష్ట్రములకు దేశాధ్యక్షు లుండవలయుననియు విష్ణుస్మృతి యను గ్రంథమునఁ గలదు. "నూరు గ్రామముల స్వతంత్రాధికారము గలవాఁడు సామంతుఁడనియు, శత గ్రామాధి పాలనమునఁ బ్రభువుచే నియుక్తుఁడయినవాఁడు కూడ సామంతుఁడనియుఁ, బది గ్రామముల సంరక్షించుటకయి నియమింపఁబడినవాఁడు నాయకుఁడనియు, నయుత గ్రామంబుల కధికారియగువాఁ డాశాపాలుఁడనియు స్వరాట్టనియు నెన్నఁబడు"నని శుక్రనీతి సారము ప్రథమాధ్యాయమునఁ జెప్పఁబడియున్నది.

మౌర్య చక్రవర్తుల పాలనమునఁ గేంద్ర ప్రభుత్వ విధానము హెచ్చు స్థాయి నుండెను. చాణక్యుని యభిప్రాయము ననుసరించి గ్రామములు మూఁడు రకములుగ విభజింపఁబడినవి. "రెండు మైళ్ళ విస్తీర్ణము కలిగి వేయి వెండికర్షము లాదాయముగాఁ గల ప్రదేశమును గ్రామమనియు, నర్ధక్రోశము విస్తీర్ణముండి యైదువందల వెండి కర్షము లాదాయము గాఁగల ప్రదేశమును బల్లెయనియు, నాలుగు ఫర్లాంగుల విస్తీర్ణమును ఇన్నూటయేఁబది వెండికర్షము లాదాయము గాఁగల ప్రదేశమును గుంభమనియుఁ, బిలుతు"రని శుక్రనీతియందున్నది. బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగా రాంధ్రీకరించిన శుక్రనీతి సారమునందుఁ "గ్రోశమాత్ర పరిమితంబై నాలుగువేలు రూప్యంబులు రాజభాగ మొసంగునది గ్రామంబనియు, గ్రామార్ధంబు పల్లియనియుఁ బల్ల్యర్ధంబు కుంభమనియు వ్యవహరింతురని వ్రాయఁబడియున్నది. (తొమ్మిదవ పుట) దీనిని బట్టి వెండికర్షమనఁగా వరహా యని యర్థమగుచున్నది. మహావీరాచార్యుఁడను సుప్రసిద్ధ గణిత శాస్త్రజ్ఞుఁడు తన గణితసార సంగ్రహమున 'సువర్ణ పరిభాష' నిట్లు తెలిపియున్నాఁడు.

'చతుర్భిర్గండకైర్గుంజా
గుంజాః పంచపణోచ్యతే
ధరణం ధరణేకర్షః
పలం కర్ష చతుష్టయమ్.' అని వివరించినాఁడు.

నాలుగు గండకము లొక గుంజ (గురివెందగింజ) యనియు నైదుగుంజ లొక పణమనియు నెనిమిది పణము లొక ధరణమనియు రెండు ధరణము లొక కర్షమనియు నాలుగు కర్షము లొక పలమనియు నర్థము. కర్షము నాలుగు రూపాయలయినప్పుడు ధరణము రెండు రూపాయలగును. పణమనఁగా నాలుగు అణాలు. ఎనిమిది పణములకు రెండు రూపాయలు. పావలాలో నైదవవంతు పరిమాణము గలది గుంజ (గురివెందగింజ) ఇట్లే యూహించుకొనవచ్చును.

ప్రతి గ్రామమునను నొక గ్రామాధికారి కలఁడు. అతనిని 'గ్రామాధిప' 'గ్రామిక, గ్రామకూట' యని పిలుతురు. అతఁడు గ్రామముయొక్క సరిహద్దులను నిర్ణయించుటయు, గ్రామ కంఠస్థలములను భాగములవైచుటయు ఆయకట్టులోఁ జేర్పఁ



బడిన భూములను సాగుచేయఁబడిన భూములనియు—సాగుకాని భూములనియు విభజించుటయుఁ బూలతోఁటలు, కూరగాయలతోఁటలు, మైదానములు, వ్యాయామ ప్రదేశములు, యాత్రాస్థలములు, స్మశానభూములు, పచ్చిక బీళ్ళు, ధర్మగృహములు, శాసనసభాశాలలు, కాపురపు టిండ్లు, దేవాలయములు, వ్యవసాయకార్యములు—ఇవి యన్నియును అడంగలునందు జేర్చికొనుటయు, శీలములు, ధర్మములు, గ్రామములోని రమిపక్ష పన్నులు, గ్రామములోనున్న ఇండ్లను విడఁదీసి పన్ను చెల్లించు గృహములనియు,—లేనిగృహములనియు, నిర్ణయించి ప్రతివాఁడును జెల్లించు సుంకములు, భూముల ధరలు ఉదహరించుటయు, వర్ణముల ననుసరించి కాపురము చేయువారి సంఖ్యను నిర్ధారణ చేసియు, వివిధాక్రమణలు, వర్తకము, వ్యవసాయము, కళలు, చేతిపనులు, పశువులు మేయు బీడు, కార్మికవృత్తి, నౌకరీవృత్తి—వీటితోఁ బాటు నడవడియుఁ బ్రతివాని యాయవ్యయములును గల పుస్తకముంచి పనులఁ జేయవలయు''నని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౨ అధ్యాయము 35) మౌర్య చక్రవర్తుల కేంద్రీకరణ పరిపాలనమున గ్రామసభ తన యధికారములోఁ జాలభాగము పోఁగొట్టుకొనియెను. ఈ సభమూలమునఁ గొన్ని స్థానిక విషయములు పరిష్కారమగుచుండెను. ఈ సభనే గ్రామవృద్ధుల సంస్థ యని యందురు. ఈ సంస్థయందు నిర్ణీత సంఖ్యగల సభ్యులు లేరు. కొన్ని స్మృతులయందు వ్యవహారాధ్యాయ మొకఁడుండెను. అందుఁ బదునెనిమిది వివాద పదములలో సంవిద్వ్యతిక్రమ మొక్కటి. రాజకృత సంవిత్తు, సమూహకృత సంవిత్తు, అని సంవిత్తులు రెండు విధములు. రాజుచేత నేర్పఱుపఁబడిన రాజకృత సముదాయమువారు కొన్ని నియమిత వ్యాపారములను జరుపవలయును. దానినే రాజకృతసంవిత్తు అనియెదరు. స్వధర్మ నిర్వహణమును ఈ సముదాయము వారికి రాజశాసనము నిరూపించినప్పటికిని మతవిషయములతోఁగూడఁ గొన్ని సమయములందు లౌకిక రాజకీయములందు జోక్యము కలిగించుకొనుచుండిరి. 'నిత్యం నైమిత్తికం కామ్యం శాంతికం పౌష్టికం తథా । పౌరాణాం కర్మ కుర్యుస్తే సందిగ్ధే నిర్ణయం తథా'॥ యని బృహస్పతి నిర్వచించినాఁడు. అనఁగాఁ బ్రజను నిత్యనైమిత్తిక కామ్య కర్మల ననుష్ఠించుపట్లఁ దోడ్పడుటయు, దైవిక విపత్తులు తొలఁగిపోవు నిమిత్తమును శాంతిని బుష్టిని ఇచ్చు నిమిత్తమును సాధనములగు కర్మలఁ జేయించుటయు, సందిగ్ధములుగ నున్న మత విషయములలో దృఢాభిప్రాయమును దెలుపుటయు, రాజకృత సంవిత్తువారి విధ్యుక్తధర్మము. వారి యుద్యోగసమయమున వారికి నిర్ణయమైన నియమము ననుసరించియు, రాజుకోర్కె ననుసరించియు, నితర వ్యవహారములను గూడ యోజింపవలసిన వారగుచుండిరి. అవి యేవి యనఁగాఁ బసుల బీడులను—నీటి కాలువలను గాపాడుటయు, దేవాలయాది పవిత్ర స్థలముల పయి శ్రద్ధ వహించుటయు, వారు రాజుచేత నియమింపఁబడిన వారగుటవలన వారి నియామకమునందేమి, యుద్వాసనమునందేమి ప్రజల కెట్టి పలుకుబడియు లేకుండెను. సకల కళా విశారదులగు బ్రాహ్మణులను సభ్యులుగ నియమించి మతవిషయక కార్యములను—లౌకిక వ్యాపారములకును

నెట్టి సంబంధము లేకుండఁ జూచుట రాజునకు ధర్మమయ్యెను. యాజ్ఞవల్క్యుఁడును బృహస్పతియు సమూహకృత సంవిత్తు నియమధర్మములను జక్కఁగా నభివర్ణించి యున్నారు. ‘గ్రామశ్రేణీ గణానాంచ సంకేతః సమయక్రియా। బాధాకాలేతుసాకార్యా ధర్మకార్యే తథైవచ। బాధచోర భయేబాధాః సర్వసాధారణాః స్మృతాః॥ తత్రోపశమనం కార్యం సర్వం నైకేనకేనచిత్। సభాప్రపాదేవగృహ తటాకారామ సంస్కృతిః। తథానాథ దరిద్రాణాం సంస్కారో యజనక్రియా। కులాయన నిరోధశ్చ కార్యమస్మాభిరంశతః। యత్త్వైతల్లిఖితం పత్రే ధర్మ్యాసా సమయక్రియా॥’ అనఁగా సంఘమునకు సమముగ విపత్తు ఘటించినప్పుడు పట్టణవాసులు, గ్రామవాసులు, వర్తక సంఘములు, బ్రాహ్మణులు, మతభిక్షులు, కర్మకరులు మొదలగు నన్ని తెగలవారును నైకకంఠ్యముగ నొకే భావముతోఁ దమ లౌకిక పారమార్థిక వ్యవహారములు యథాక్రమముగ నడచుటకును, వ్యాపారమును వృత్తులను జెడకుండుటకును ధర్మము సమయానుకూలముగ నడచుటకు నంగీకారసుపత్రము వ్రాసికొని తన్నిబంధనలకు బద్ధులయి యుండవలయును. ఆ యంగీకార పత్రము నీతిబద్ధముగను శాస్త్రబద్ధముగను నున్నది. ఇంకను జలిపందిరులను సభాభవనములను వాపీకూప తటాకారామములను దేవాలయములను బరిరక్షించుటయు మరమ్మతు చేయించుటయు దీనులను దారిద్ర్య వివశులను అనాథలను ప్రేత సంస్కార మొనర్చుటయుఁ గర్మాభిరతులకు ద్రవ్యసాహాయ్య మొనర్చుటయు క్షామసమయములందుఁ బ్రజల కన్నప్రదానము చేయుటయు వీరి ధర్మములు. ఈ విధమగు నంగీకార పత్రమును వ్రాసికొనిన పిదపఁ దన్నిబంధన లనుష్ఠానమునఁ బెట్టుటకయి కార్యచింతకు లేర్పడుచుండిరి. ‘ద్వౌత్రయః పంచవా కార్యాః సమూహహితవాదినః। కర్తవ్యం వచనం తేషాం గ్రామశ్రేణీగణాధిభిః॥’’ అప్పటి గ్రామముల యొక్కయుఁ బట్టణముల యొక్కయు విస్తీర్ణమును జనసంఖ్యయు నాలోచించితిమేని యీ సభ్య నియమము (ఇరువురు మొదలు అయిదుగురు వఱకు) బాగుగనే యున్నదని తెలియును. పెద్ద పట్టణములలోఁ బ్రజానియుక్తులగువారు గాక రాజుచే నియమింపఁబడినవారును గొందఱుండుటవలన సభ్యుల సంఖ్య బాగుగ నుండెను. కార్యచింతకులు వక్రమార్గమున నడిచిరేని వారికిఁ బ్రజలే యపరాధమును విధించియుఁ బదచ్యుతుల నొనర్చియు నూరినుండి వెడల నంపియు శిక్షించుచుండిరి. ఈ సభ్యులు గావించిన తీర్మానమును బ్రభువునకుఁ దెలుప నతఁడా తీర్మానమును విధిగ నంగీకరించుచుండెను. కాత్యాయనుఁడు ‘సాహసీభేదకారీచ గణద్రవ్య వినాశకః। ఉచ్ఛేద్యాః సర్వ ఏవైతే ముఖ్యాస్త్వేవ నృపేభృగుః’ అని చెప్పినాఁడు. అనఁగా ముఖ్యులలో (Commissioners) నొకఁడు సంఘద్రవ్య మపహరించినను లేక నష్టము కలిగించినను అంతఃకలహములఁ బుట్టించినను గొప్ప నేర మొనర్చినను నతనిఁ దొలఁగించి రాజున కెఱిఁగింపవలయును. ‘పూగశ్రేణీ గణాధ్యక్షాః పురదుర్గ నివాసినః। వాగ్ధిగ్దండ పరిత్యాగం ప్రకుర్యుః పాపకారిణాం॥ తైఃకృతం యచ్ఛ్వధర్మేణ నిగ్రహానుగ్రహం నృణాం। తద్రాజ్ఞా అనుమంతవ్యం నిసృష్టార్థాహితే స్మృతాః॥’ అని బృహస్పతి చెప్పినాఁడు.



అనఁగాఁ బట్టణములందును దుర్గములందును వసించుచు వ్యాపార వృత్తియందున్న ముఖ్యులు (కమీషనర్లు)ను, అదే వృత్తియందున్న శ్రేణులును, బ్రాహ్మణాది ఇతరులను దూషించియు బహిష్కరించియుఁ బాఱఁదోలియు శిక్షింపవలయును. ప్రజలకనఁబడిన నిగ్రహానుగ్రహములు నీతికిని మతమునకును భంగకరముగ లేనప్పుడు ప్రభువు వాని నంగీకరింపవలయును. ఈ గ్రామవృద్ధులు పరిపాలనా విషయములను జూచుటయే గాక కొద్దిపాటి సివిల్ క్రిమినల్ వివాదములను గూడఁ బరిష్కరించుచుండిరనియు వీరి పరిష్కారము న్యాయస్థానము ధార్మికచింతగల న్యాయాధిపతి యెట్లు పరిష్కారము చేయునో యా విధముగనే యుండుననియు నివిగాక దేవాదాయ ధర్మాదాయములకు క్షామనివారణ ప్రయత్నములకు బీదసాదల అక్కఱలను — మొదలగు ప్రజాస్వామ్యమును బరిశీలించుచుండిరనియు నర్థశాస్త్రమున వ్రాయఁబడియున్నది. (పుస్తకము ౨, అధ్యాయము ౧.) గ్రామసభలు ధనదోష (సివిల్ క్రిమినల్) వివాదములను బరిష్కరించుచుండెనని వ్రాసియుంటిమి. ధనదోష చట్టము లెట్లున్నదియుఁ దెలిపికొందము. అప్పు దీసికొనువారు నూటికిఁ బదినైదువంతున వడ్డి యివ్వవలయును. ఆస్తిని దాకట్టు పెట్టుకొను నాచారము కలదు. సముద్రముపయిఁ బ్రయాణము చేయు వర్తకులకు ప్రత్యేకమగు వడ్డి యున్నది. త్రాగి మైమఱచి యున్నపుడు చేయఁబడినట్టియు మోసముచేసి పొందఁబడినట్టియు నియమములు (కంట్రాక్టులు) చెల్లనేరవు. హక్కు లేక చేసిన విక్రయములు మొదలగునవి చెల్లవు. ఆస్తి యున్నవానికిఁ గ్రయకుఁడు బంధువయిన యెడల నతని కాఱువందల పణములు (అనఁగా నూటయేఁబదిరూపాయలు) అపరాధము విధింపఁబడును. బంధువు కాకున్న దొంగవలెఁ బరిగణింపఁబడును. ఎవరైనను దన యాస్తిని దానధర్మములకయి దఖలు చేసిన యెడల ఆ యాస్తిని దాత యుద్దేశానుసారముగ వినియోగింపక అన్యాక్రాంత మొనర్పఁబడుచున్నదని తెలిసినప్పుడా దఖలును రద్దు చేసికొను నాచారముండెను. కూలివాఁడు చేయ నొప్పుకొన్న నియమ మతిక్రమించి పూర్తిగఁ బని చేయకున్నఁ గూలియుఁ బని లేకుండెను. నియమములకు భిన్నముగ వర్తించిన అపరాధములు మొదలగు శిక్షలు విధింపఁబడుచుండెను. విక్రయించినవాఁడు గాని కొనినవాఁడు గాని బేరము వదలుకొనినచోఁ బదిదినముల లోపుగ బేరము చేసిన వస్తువు నీయవచ్చును. పరువునష్టమునకు సామాన్యముగఁ బన్నెండు పణములు (మూఁడు రూపాయలు) అపరాధము విధించెడువారు. చర్మము కోసినట్టుల గాయపడునట్లుఁ గొట్టిన యెడల నూరు పణములు (ఇరువదియైదు రూప్యములు) లపరాధము విధించెడువారు. ఎముక విఱుగఁ గొట్టిన వానికి దేశము వెడలనంపువారు. ఏ విధముగానైన నష్టిఁ బొందించిన ఆ నష్టి యంతయు నేరస్థుఁ డిచ్చుకోవలయును. దొంగతనమే జరిగిన అపరాధముండెను. ఒకప్పుడు కొట్టువారు. ఆత్మరక్షణముకయి దౌర్జన్య ముపయోగింపవచ్చును. వ్యభిచారమునకు మరణశిక్షను గూడ విధించెడివారు. కాని సామాన్యముగ నపరాధమే విధించుచుండెను. మోసము చేసిన రజకులను నేతగాండ్రను శిక్షించువారు. ఫోర్జరీ చేయువారికిని మంత్రులకు లంచము

లిచ్చిన వారికిని స్త్రీహత్య చేసినవారికిని మరణశిక్ష విధించుచుండెను. ఈ విధముగ గ్రామములలోఁ బరిపాలనము జరుగుచుండెను. ఇట్టి పరిపాలన మొనర్చు గ్రామ సభలు విజయనగర మహాసామ్రాజ్యమునందలి తొమ్మిది రాష్ట్రములలోను నలువది యైదున్నవి. 'కురళు' అను తమిళ గ్రంథమును బరిశీలించిన యెడల రెండువేల సంవత్సరములకుఁ బూర్వము సైతమీ గ్రామపరిపాలనము మివ్రల యుచ్చస్థితి యందుండె నని తెలియుచున్నది. క్రీ. శ. ౯, ౧౦ శతాబ్దములలోఁ జోళుల పరిపాలనయందుఁ బ్రజా స్వామ్య మనుభవించుచున్న పురపాలక సంఘములు నూట యిరువది యున్నవని చరిత్ర లుద్ఘోషించుచున్నవి. భట్టిప్రోలు, ఉత్తర మల్లూరు శాసనములఁ బరిశీలించిన క్రీ. శ. ౧౫౬౦ సం||రము వఱకు స్థానిక ప్రభుత్వ మెంత యాదర్శ ప్రాయముగ నున్నది తెలియఁగలదు.

గ్రామ సభవారి తీర్మానము లైకకంఠ్యముగనుండెడివి. కాని యెప్పుడు భిన్నాభిప్రాయము కలుగునో యప్పుడా విషయము నధిక సంఖ్యాకుల యభిప్రాయము ననుసరించి నిర్ణయమగును. ఈ యధిక సంఖ్యాకులు గౌరవవంతులయిననే యట్లు నిర్ణయమగును. రెండు గ్రామముల సరిహద్దులను గూర్చిన వివాదములను బరిసర గ్రామములలోని పెద్దలవలన నిర్ణయమగుచుండెను. గ్రామాధికారి కార్య నిర్వాహకోద్యోగివలె గ్రామసభలకును నధ్యక్షత వహించును. గ్రామపరిపాలనకును — కేంద్రప్రభుత్వమునకును, నడుమ కీలు బొమ్మవలె గ్రామాధికారి యుండెను. వ్యభిచారులు దొంగలు మొదలగువారిని గ్రామమునుండి వెడలనంపు విశేషాధికారముగూడ గ్రామాధికారులు గలిగియుండిరి. సామాన్యముగ నితఁడు పారంపర్య ఉద్యోగిగ నుండెను. భూమి శిస్తు నుండియు నితర సుంకముల నుండియు గ్రామాధికారి ప్రతిఫల మనుభవించుచుండెను. లేక బాడుగ లేకుండ గ్రామకంఠ భూమిని స్వీయోపయోగ మొనర్చుకొనుచుండెను. ఇతఁడు తన యుద్యోగ నిర్వహణ సమయమునఁ గావించిన వ్యయమునకుఁ బ్రజలు కొంతవఱకు సాహాయ్య మొనర్చుచుండిరి. శుక్రనీతియందు గ్రామాధికారిగాక సాహసాధిపతి (పోలీసు సూపరింటెండెంటు), లేఖకుఁడు, భూమిమీఁది శిస్తును వసూలు చేయువాఁడు, టోలుగేట్లను వసూలు చేయువాఁడు, కావలివాఁడు, అను నైదుగురుండినటుల చెప్పఁబడియున్నది. "ప్రజల యాంతర రక్షణముకొఱకు గ్రామోద్యోగులు బాధ్యత వహించి యుండిరి. గ్రామములో నెచ్చటనేని దొంగతనములు జరిగిన యెడల గ్రామోద్యోగులు దొంగలను బట్టుకొనవలసి యుండురు. అట్లు పట్టుకొనక పోయిన యెడల దొంగిలింపఁబడిన యాస్తికి నష్టము కట్టి యిచ్చుచుండి"రని యాపస్తంబుఁడు చెప్పుచున్నాఁడు. గ్రామోద్యోగుల బుద్ధి వైభవమును బట్టి ప్రజోపయోగ కార్యములు జరిగి గ్రామాభివృద్ధికిఁ దగిన పరిమాణముల వైచి ప్రజలకుఁ దోడ్పడుచుండిరి. ఎవరీ విషయమున నాయకత్వము వహించి పని చేయుదురో అట్టివారు బిరుదములను బహుమతులను బొందుచుందురు. (అర్థశాస్త్రము, పుస్తకము 3, అధ్యాయము ౧౦.)



విశ్రాంతి గృహములను రిజర్వాయరులను గూడలి మార్గములను మరమ్మతు చేయుట యను విహారారామములను వేయుటయును,- ఈ మొదలగు పనులు ప్రజలే చేయుచుండిరని బౌద్ధ గ్రంథములలో వివరింపఁబడినవి. ప్రజలు తమ సాంసారిక వ్యవహారములకు సంబంధించినంతవఱకుఁ గేంద్ర ప్రభుత్వాధికారమునకు వశులు గాకుండిరి. కాని గ్రామము రాష్ట్రీయ ప్రభుత్వ విధానమున సంపూర్ణ శకలముగ మాత్ర ముండెను. గ్రామాధికారికి పైయుద్యోగి గోపుఁడు. ఇతని నాంగ్లమున సర్కిలు ఆఫీసరనియెదరు. ఇతని యధీనమునఁ జాల గ్రామము లుండును. సామాన్యముగ నయిదు గ్రామములు మొదలు పది గ్రామముల వఱకుండును. ఇతఁడు గ్రామాధికారి చేయు పనిని బరిశీలించుచుండును. చాణక్యుని మతాను సరణముగ నిట్టి గ్రామములు కొన్ని కలసి మండలముగ లేక భాగముగ నేర్పడునని తెలియుచున్నది. ఈ మండలము యొక్క విస్తీర్ణము రాష్ట్రములో నాలుగవ భాగముండును. దీనినే 'జనపద' యని యందురు. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౩౫) మండలాధిపతి యనఁగా స్థానికాధికారి. ఇతఁడు రాష్ట్రపాలకుని దిగువ యధికారి. ఇతఁడు కేంద్ర పరిపాలనకు లోఁబడియుండును. మంత్రులలో నొకని యధీనమునఁ (దాత్కాలికముగ) కేంద్ర ప్రభుత్వమునందలి స్థానిక పరిపాలనా విషయము లన్నియు నుండును. 'వారి గ్రామములోని యీ యుద్యోగుల వ్యవహారము లితర వ్యవహారములవలె మంత్రి వలనఁ బరిశీలింపఁబడు' నని మనువు చెప్పుచున్నాఁడు. చాణక్యుని యభిప్రాయము ననుసరించి 'సమాహర్త' యను నతఁడీశాఖకుఁ దాత్కాలికముగ నధికారము వహించుచుండెనని తెలియుచున్నది. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౩౫) ధర్మప్రతిష్ఠాపనల పోషణకయి భూములును నగలును ఇచ్చి ఆ భూముల ఫలసాయమును నగలపయిని వడ్డీయు గ్రామసంఘ వ్యవహారములకుఁ గాను వెచ్చించుచుండిరని తెలియుచున్నది. ఇంతియేగాక యిప్పటి పురపాలక సంఘములవలె వడ్డి నిచ్చు నిబంధనతో గ్రామసభలు ఋణములఁ దెచ్చి వ్యవహారముల నెఱవేర్చుటయుఁ గొద్దిపాటి తగాదాలను బరిష్కరించుటయు జరుగుచుండెను. గ్రామమున దొంగతనము జరిగి సొత్తు పోయినప్పుడు ఆ సొత్తు ఊరు దాటి వెడలినదని స్పష్టముగఁ దెలిసినప్పుడును గ్రామాధికారియుఁ గావలివాండ్రును బోయిన సొత్తు గాని యందుకుఁ దగిన విలువగాని అచ్చుకొనుచుండిరి. గ్రామాధికారియే దొంగలను శిక్షించుచుండెను. గ్రామసంఘములు ప్రభుత్వమువారికిఁ బన్నులఁ జెల్లింప నక్కఱలేకుండెను. స్త్రీలుఁగూడ గ్రామసంఘమున సభ్యత్వము వహించియుండిరి. న్యాయశాఖోపసంఘమున నొక స్త్రీ సభ్యురాలుగ నుండినట్లు చరిత్రలవలనఁ దెలియుచున్నది. సభ్యులుగ నుండువారు ౫ యకరములకు మించి భూమియు నిల్లును సొంత స్థలమును ముప్పదియైదు వత్సరములు మొదలు డెబ్బది వత్సరములు దాటని వయసును గలిగి మంత్రములను బ్రాహ్మణములను దెలిసియుండి వ్యవహార పరిజ్ఞానమును న్యాయైక దృష్టియుఁ గలిగి ధార్మిక చింతతో నార్జింపవలయు ననెడి యభిలాషముండి సుగుణసంపత్తియుండి బ్రహ్మహత్య, చౌర్యము, సురా

పానము, గురుభార్యావంచనము,—మొదలగు అకార్యకరణముల నొనర్పకను నుండవలయును. ఇంతకుఁ గ్రితము సభ్యుఁడుగ నుండి సక్రమముగఁ దన విధిని నెఱవేర్చక లంచగొండులయి వర్తించిన యెడల నట్టివాఁడును నతని బంధువులును నెన్నికొనఁగూడదని తెలియుచున్నది.

'సోదకాంక్రమత్ సామంత్రికోన్యకాంక్రమత్, యంత్రిస్వామంత్రిణమామంత్రిణీయోభవతి య ఏవంవేద' అని వర్ధిల్లి యుండుండి మంత్రాంగ సభ యేర్పడెను. దాని నెఱింగినవాఁడు మంత్రిత్వమున కర్హతగలవాఁడయ్యెను. అట్టి వానితోఁ బర్యాలోచించుటకయి ప్రజలు వచ్చుచుండిరి. ఈ విషయమును జూడఁగాఁ దొలుత అధికారమంతయుఁ బ్రజల యందుండెననియు నది రానురాను సదస్సులందును సభలందును జేరి మంత్రాంగ సభలకుఁ బిదప వారి యంగీకారమును బట్టి ప్రభువులకు సంక్రమించెననియు విశదమగుచున్నది. ప్రభువునకుఁ గల యధికారము ప్రథమమునఁ బ్రజలది. పరిపాలనాస్వత్వమును బ్రభువునకుఁ బ్రజలిచ్చిరి. అట్టి సభ్యుల నియమముల నతిక్రమించి వర్తించుట దోషమనియు నా దోష పరిహారమునకయి త్రోవల నన్వేషింపవలయు ననియు యజుర్వేదము విధించుచున్నది. 'ఆ బ్రాహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ జాయతా మారాష్ట్రే, రాజన్యః శూర ఇషవ్యోఽతి వ్యాధీ మహారథో జాయతాం, దోగ్ధ్రీ ధేనుర్వోఢాఽనడ్వానాశుః సప్తిః పురంధ్రిర్యోషా జిష్ణూరథేష్ఠాః సభేయో యువాస్య యజమానస్య వీరో జాయతాం నికామే నికామే నః పర్జన్యో వర్షతు ఫలవత్యోన ఓషధయః పచ్యంతాం యోగక్షేమో నః కల్పతాం॥ అనఁగా బ్రహ్మవర్చసము గల బ్రాహ్మణులను, శూరులును ధనుర్విద్యా విశారదులును మహారథులు నగు క్షత్రియులను, దుగ్ధ సమృద్ధిగల గోవులును శీఘ్రగమనముగల యశ్వములును బరువును మోయఁగల యెద్దులును గల వైశ్యులను, గౌరవ స్త్రీలను, ఈ రాజ్యమునఁ బుట్టింపుము. మంచి చారిత్రముగలవాఁడునుఁ బరాక్రమవంతుఁడును సభ్యత్వమున కర్హత గలవాఁడును నగు పుత్రుని ఈ యజమానున కిప్పింపుము. తరుణమునఁ బర్జన్యుఁడు వర్షించుగాక! ఫలపుష్ప సంభరితములగు వృక్షములుండుఁగాక! యోగక్షేమములు కలుగుగాక!

దీని ననుసరించి యార్యులు బుద్ధివైశద్యమును శక్తిసామర్థ్యములును గలిగి జనరంజకుఁడయి వారిచే నెన్నికొనఁబడఁదగిన కుమారుని గోరుకొనిరి గాని బలాత్కార గౌరవమును బడయఁగల వానిని గాదు. ఇట్టి సభ్యులతోఁ గూడిన గ్రామసభలు బృహస్పతి చెప్పినట్లు వర్తక సంఘము, వ్యవహార సంఘము, లేదితర సంఘముల యధ్యక్షులు శిక్షితులను దండించుటయు, నిందించుటయు, బహిష్కరించుటయుఁ బురము వెడలనంపుటయు—ఈ మొదలగు పనులను జేయుచుండిరనియుఁ బ్రభువు కా విషయమును దెలుపుటకు నతఁడంగీకరించుచుండెననియుఁ దెలియుచున్నది. 'ముఖ్యైస్సహ సమూహా



నాం, విసంవాదో యదాభవేత్, తదావిచార యేద్రాజా, స్వధర్మేస్థాపయేచ్చతాన్.' అని బృహస్పతి చెప్పినాఁడు. అనఁగా ముఖ్యులకును—బ్రజలకును శిక్షవిధించుటయందు భిన్నాభిప్రాయము తటస్థించెనేని రాజు జోక్యము కలిగించికొని ధర్మము నడుపవలయునని యర్థము. ముఖ్యులు దండనార్హులగునప్పుడు సంఘమునకు ముఖ్యులను గూడ శిక్షించు నధికారము గలదని, 'వీరమిత్రోదయ' మను గ్రంథమువలనఁ దెలియుచున్నది. భృగువు చెప్పినట్లు సంఘముఖ్యులు (కమీషనర్లు) గొప్ప నేర మొనర్చినవారును సంఘమున నంతః కలహములఁ బుట్టించినవారును గణద్రవ్యమును బాడుచేసినవారును సభ్యత్వము పోఁగొట్టుకొనుచుండిరి. అనఁగాఁ బదచ్యుతులగుచుండిరి. ఈ విషయములఁ బట్టి చూడఁగా నీ సంఘము లేవిధముగ గ్రామములను బాలించినవియో ఎట్టి యధికారము కలిగియున్నవియో తెల్లమగుచున్నది.

క్రీ. శ. ౧౦౬౬—౧౦౪౨ సంవత్సర ప్రాంతమునఁ గల సింహళ దేశ ప్రభువగు నాలవ మహీంద్రుని దేవలకాట్టీను చాపరాయి శాసనము గ్రామ ప్రభుత్వమును విపులముగ జతురతగను విశదపఱచుచున్నది. ఈ శాసనమున 'దశగాము' యను గ్రామమున గౌరవ కుటుంబికులును గ్రామాధికారియు సాంఘిక న్యాయస్థానమును మిక్కిలి జాగ్రత్తతోను న్యాయ్యముతోను నడపుచుండిరని యున్నది. మంత్రులవలనను జట్టనిర్మాణ సభవలనను బ్రకటింపఁబడిన చట్టములను గ్రామసభ అనుష్ఠించుచుండెను. ఈ సభ తన వశమయిన నేరము లన్నిటిని అనఁగాఁ జట్టముల నతిక్రమించిన వారనుండి నిర్ణయమైన అపరాధములను ఇతర విధములుగ విధింపఁబడిన శిక్షలను బరిశీలించుచుండెను. గాని నిర్ణీతకాలములోపుగ 'దశగామ' కాపురస్థులు నేరము చేసిన వారినుండి వసూలు చేయు బాధ్యతయును నేరము పోయినప్పుడు సంఘముతటి పైనను అపరాధములు విధించుటయును ఈ శాసనమున ముఖ్యాంశములు. నేరము చేసినవారు కనుపించకున్న యెడల 'దశగామ' యందలి ప్రజలు వారిని నలువదియైదు దినములలోఁ గనుఁగొని వారికి శిక్ష విధింపవలయును. వారు నేరస్థులను గనుఁగొనలేకున్న 'దశగామ' ప్రజలు ప్రభుత్వమువారికి నూట యిరువదియైదు కాలందములు పరిమాణము గల బంగారము అపరాధము క్రిందఁ జెల్లింపవలయును. గ్రామముఖ్యులు Paman Lands ను ప్రజలు జెల్లించు అపరాధముల నిమిత్త ముపయోగింపవలయును. రాజధాని నగరములను గొప్ప పట్టణములును స్థానిక ప్రభుత్వోపయోగముకయి ప్రత్యేక సంస్థలుండెను. ఋగ్వేదమునఁ బురపతి లేక నగర విభుఁడు అను పదము సముద్ధృతమయి యుండెను. 'ప్రతి పట్టణమునను వ్యవహారముల నన్నిటిని బరిష్కార మొనర్చుటకుఁ బై విచారణకర్త (సూపరింటెండెంటు) యుండవలయును. ఇతనిని 'సర్వార్థ చింతక' యని పిలుతురు. ఇతఁడు ప్రాయశః నగర సంఘమున కధ్యక్షుఁడుగ నుండెనని తెలియుచున్నది. ముప్పదిమంది సభ్యులున్న పురపాలక సంఘమువలన రాజధాని నగర పరిపాలనము నడుపఁబడుచుండెను. ఈ సభ్యులలో నైదుగురు వంతున నొక్కొక్క యుప

సంఘముగ విభజింపఁబడిరి. అనఁగా నాఱు ఉపసంఘములేర్పడినవి. మొదటి యుప సంఘమువారు పట్టణములోని కళాకౌశల్యాభివృద్ధికి బాధ్యులయి యుండిరి. రెండవ యుపసంఘమువారు విదేశీయుల వ్యవహారములఁ బరిశీలించుటయు వారికే విధమగు నిబ్బంది లేకుండఁ జూచుటయు వలయు భోజనాదివసతులొసఁగూర్చుటయు,— మొదలగు కార్యములఁ జేయుచుండిరి. మూఁడవ యుపసంఘమువారు గ్రామములోని జనన మరణ లెక్కలను జూచుచుండిరి. ఇట్లు చేయుట సుంకములను వసూలు చేయుటకు మాత్రమే గాక జనన మరణములు తెలియకపోకుండఁ బ్రభుత్వమువారి యాలోచనమునకుఁ దెచ్చుటకయి యుండెను. నాలవ యుపసంఘమువారు వాణిజ్య సౌకర్యములను బరిశీలించుచుండిరి. ఇంతియే గాక తూనికలు కొలతలు తప్పువి గాకుండను, విక్రయించు పదార్థములలో మోసము లేకుండను జూచుచుండిరి. ఈ సంఘమువారు వ్యాపారము చేయుట కనుజ్ఞా పత్రముల (లైసెన్సుల) నిచ్చుచుండిరి. ఈ యనుజ్ఞా పత్రములయినను బెక్కుర కీయక నొకటికే యిచ్చుచుండిరి. రెట్టి పన్ను చెల్లించినఁగాని క్రొత్తవారనుజ్ఞా పత్రముల నందఁజాలకుండిరి. ఐదవ యుపసంఘమువారు చేతిపనులమీఁది యధికారులు. ఈ వస్తువులు బహిరంగముగ విక్రయింపబడుచుండెను. ప్రాఁత వస్తువులలోఁ గ్రొత్త వస్తువులను గలిపినట్లయిన నపరాధములు విధింపఁబడుచుండెను. ప్రాఁత వస్తువులను—క్రొత్త వస్తువులను, వేఱుచేసి ప్రత్యేక ప్రత్యేకముగ విక్రయింపఁబడుచుండెను. ఆఱవ యుపసంఘమువారు విక్రయమైన వస్తువుల ధరలలోఁ బదియవ భాగము వసూలు చేయుచుండిరి. ప్రత్యేక ప్రత్యేకముగ నిర్ణయింపఁబడిన ఈ పనులు ఈ యుపసంఘములు నిర్వహించుచుండెను. వసూలు చేయు సామర్థ్యము ననుసరించి నగరములోని సామాన్య వ్యవహారములను గూడ ఈ యుపసంఘములు పరిష్కరించుచుండెను. ఈ పనులన్నియు నయిన పిదపఁ బ్రభుత్వ భవనములు సరియైన మరమ్మతు చేసి భద్రముగ నుంచుటయు దేవాలయములు సంతలు ఓడరేవులు ధరలు చూచుచుండిరని మెగస్తనీసు చెప్పుచున్నాఁడు. చాణక్యుఁడు పురపాలక సంఘమునుగాని తదుపసంఘమును గాని యుదహరింపకుండుట గమనింపఁదగిన విషయమే! నగర వ్యవహారములన్నియుఁ బ్రభుత్వోద్యోగుల యధీనమున నుండుట వలనఁ గాఁబోలు చాణక్యుని పరిపాలన క్రిందఁ బ్రాచీన పురపాలక విధానము రద్దు చేయఁబడి యుండెను. చాణక్యుని విధానమును బట్టి నగర ముఖ్యోద్యోగి నాగరకుఁడయి యుండెను. ఇతని క్రింద నలుగురు స్థానికులుండిరి. వీరి నాంగ్లమున డివిజనల్ ఆఫీసరు లనియెదరు. ప్రతి స్థానికుఁడును నగరమందలి నాలుగవ భాగమున కధిపతియై యుండెను. ఈ స్థానికుల క్రింద గోపకు లనువారుండిరి. ప్రతి గోపకుఁడును బది యిరువది నలుబది కుటుంబముల వ్యవహారములను బరిష్కరించుచుండిరి. గృహ యజమానులును వ్యాపారులును నే విధముగనైనను వారి వారి వృత్తులు కలఁతఁ జెందకుండఁ జూచుట నగర ముఖ్యోద్యోగుల విధ్యుక్త ధర్మమయి యుండెను. వ్యాధి పీడితుల కౌషధముల నిప్పించుట, నగరమునఁ బ్రవేశించు నన్యదేశీయులను—నగరమును విడచిపోవు నన్యదేశీయులను,—వ్రాసి



కొనుట, అగ్నిసంస్కారము కలుగకుండ జాగరూకత వహించుట, నగరపారిశుధ్యమును బరిశీలించుట, తమగుట్టు కనుఁగొన వచ్చిన మోసగాండ్రో లేక నిజముగ నేదో పని మీఁద వచ్చినవారో యని యన్యదేశీయులను గనుఁగొనుచుండుట, అపరాధముల ద్రవ్యము నడ్డగించుట, మొదలగు పనులనుగూడ నీయుద్యోగులు చూడవలసియుండె" నని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౨, అధ్యాయము ౩౬)

గ్రామములోని ప్రతిగృహస్థుఁడును నెన్నిక యధికారముఁగలిగియుండెను. గ్రామ పంచాయతీ నిబంధనలను వ్యతిరేకముగ నడచి నేరస్థుఁడుగఁ బరిగణింపఁబడి కొంత కాలమనర్హుఁడుగ నెన్నఁబడినవానికి ఎన్నిక హక్కు లేదు. వారు చట్టములను గౌరవించుచుండిరి. ఎన్నికమార్గములలో నొకటి సంతోషముతో 'సమ్మతి' ని దీసికొనుట. వక్త ప్రశ్నమువైవఁగాఁ గొందఱు సభ్యులు కరతాళములఁ జేయుచు 'ఔ' ననియు మఱికొందఱు 'కాద' నియుఁ జెప్పుదురు. పిదప నతఁడు 'ఔ' నను వారును 'గాద' ను వారును గలరని తలంతునని చెప్పును. అవెయేమయిన నేమి యవతలి పక్షమువారు విరుద్ధమైన కరతాళములవైతురు అంతట వెనుకటిక్రమ మనుసరించి మఱల మూఁడవతూరి, 'భిన్నాభిప్రాయమేమైనఁగలదా ?' యని ప్రశ్నించును. భిన్నాభిప్రాయమున్నదని తలఁచినచో సభ్యులను వేరుపఱిచి (Poll చేసి) సమ్మతుల దీసికొందురు. ఈ విధానము ననుసరించియే కొన్ని గ్రామసభలెన్నికొనఁబడినవి. యథార్థమగు వ్యతిరేక భావమున్న యెడల నది నిర్ణయమయ్యెడిది. అందునఁ గొన్ని వివాదాభిప్రాయము లున్నయెడల రెండవతూరి మూఁడవతూరి ఆతీర్మానమును బ్రవేశపెట్టుదురు. అది యైకకంఠ్యముగ నున్నయెడల సమ్మతులకుఁ బెట్టుదురు. అప్పుడును సక్రమముగ లేనున్నయెడలఁ జీట్లను వైచి యభిప్రాయములను దీసికొందురు. కొన్ని సమయములందు చీట్లు కొయ్యముక్కల వలన బహిరంగముగఁ గాని రహస్యముగఁ గాని పుచ్చుకొందురు. రహస్యముగఁ జీట్ల పయిని అభిప్రాయములఁ గైకొనవలసియున్న, 'ఔ' నను ముక్కకును 'గాద'ను ముక్కకును రంగు వేయఁబడి యొక పేటిక (పెట్టె) యందుఁ బడవైతురు. ఈపద్ధతి బౌద్ధులలో నింతవఱకు నిలిచియున్నది. ఏలయనఁగా బుద్ధుఁడు తన జన్మదినమునఁ దన సంఘము వారు విధులను బరిపాలించుటకయి యీవిధానముంచెను.

బహిరంగమేయైన వారు ముక్కలను సామాన్యముగఁ గ్రిందఁబడవైతురు. కనుక ప్రతిసభ్యుఁడును రెండు సమ్మతుల ప్రోవులను జూడవచ్చును. రహస్యమేయైన ముక్కలను బెట్టెలోఁ బడవైతురు. అంతట లెక్కింతురు. ఈ విధానములలో గొన్నిగాని యొక్కటి గాని భారతవర్షమందంతటను ననుపానమున నుండెను. ఈ విధముగ భారతీయులు తమ వ్యవహారములఁ జక్కచేసికొనుచుండిరి. ఈ విధమగు కార్యనిర్వహణము సోదరభావమును స్నేహభావమును బెంపొందించును. అర్థశాస్త్రమునందును శుక్రనీతియందును బయివిధానమంతయుఁ జెప్పఁబడియున్నది. దేశమంతయు నీయెన్నికసభలచే

నలకారుచుండెను. అప్పటిప్రభువులందఱును నీ సభల సలహాల నందికొని యేలుచుండిరి. కౌటిల్యుఁడొకచోటఁ దనయర్థశాస్త్రమున 'నెన్నికసభతోడ్పాటులేని ప్రభువు చక్రములేని రథమువంటివాఁ' డని పలికెను. అప్పటిమంత్రుల యధికారములు వారి ధర్మములు మొదలగునవి శుక్రనీతి యర్థశాస్త్రము మున్నగుగ్రంథములలో వివరింపఁబడినవి. శాసనసభలోఁ బ్రభువీక్రింది విధముగ సభ్యులనెన్నికొనుచుండెను. వైశ్యులిరువదియొక్కరును బ్రాహ్మణులు నలువురును క్షత్రియులెనమండుగురును శూద్రులు ముగ్గురును సూతుఁ డొకఁడును గలరు. సూతుఁడనఁగా రథచోదకుఁడనిగాని సాంకర్యవివాహ జనితుఁడనిగాని యర్థమని మహాభారతము శాంతిపర్వమునఁ జెప్పఁబడినది. మంత్రులేడుగురు మొదలు ఎనమండుగురువఱకు నియమింపఁ బడుచుండిరి. సామాన్యముగ క్షత్రియవంశ్యుఁడు మాత్రమే ప్రభువుగనుండి ప్రజలను గాపాడుచు నందులకుఁ బ్రతిఫలముగఁ గప్పము తీసికొనుచుండెను. 'రాజు ప్రజాసేవకుఁడుగాని నిరంకుశాధికారిగాఁడు' అని మనుధర్మశాస్త్రమున వ్రాయఁబడినది. (౭వ అధ్యాయము ౧౮౮వ పుట) ఆర్యదేవుఁడను బౌద్ధసన్న్యాసి యొకచక్రవర్తినభివర్ణించుచు 'ఓరాజా! నీవు ప్రజాసేవకుఁడవు, నీపరిపాలనకయి దేశమునఁ బండిన పంటలో నాఱవభాగము ప్రజలు నీకిచ్చుచున్నా' రని చెప్పెను. తక్షశిలానగరమును బరిపాలించునొక ప్రభువు తాను ప్రేమించిన యువతీమణి తనరాజ్యమునుగోర నిట్లనియెను. 'నాకు ప్రజలపయి నెట్టియధికారమును లేదు. నా ప్రజలలో రాజద్రోహులపైనను దుర్మార్గులపైనను మాత్రమే నాకధికారము గలదు" అని చెప్పినటులు మనుధర్మశాస్త్రమున ౧౩౭, ౧౩౮ పుటల యందు వ్రాయఁబడియున్నది. ప్రతిగ్రామమధ్యమున నొక దేవాలయముండెను. బారులు దీర్చిన వీధులును ఇరుప్రక్కల నిండ్లును గలవు. ప్రతియింటికిని పెరటిదొడ్డియు నందులో విహారారామములును నుండెను. ప్రతివారికిని ఆగ్రామమునకుఁ జెందిన గోభూమికి హక్కుగలదు. గ్రామములలోని పశువులన్నియు యథేచ్ఛగఁ దిరుగుటకుఁదగిన గోభూమి యుండెడిది. ఆగ్రామమునకయి నియమింపఁబడిన వడ్రంగి, కమ్మరి, చాకలి, గొల్ల, కుమ్మరి, మొదలగువారుండురు. వీరు గ్రామములోని మాన్యములు స్వేచ్ఛగ ననుభవించుచు గ్రామములోనివారందఱకు వారివారి నియమిత వృత్తులను జేయవలసి యుండును. ప్రతిగృహస్థుఁడును దనవీధిప్రక్క చిన్న చిన్న పూలమొక్కలును, నుపయోగించు వృక్షములును, బెంచెడి కట్టుబాటు గలదు. గ్రామమునను సంబంధించిన అడవులు గ్రామములోని ప్రజలు యథేచ్ఛగ నుపయోగించుకొను హక్కుగలదు. ఆయడవులనుండి వ్యవసాయమునకు వలయు ఎరువున కుపయోగించు ఆకలములును, ఇండ్లు కట్టుకొనుటకుఁ గలపయు, వంటచెఱకును ప్రజలు తెచ్చికొను స్వత్వము గలదు. గ్రామసంప్రదాయము ననుసరించి యడవులలోఁ బసులను మేపుకొను హక్కు ప్రజల కుండెను. ఇప్పుడు రైతులకుఁగల యవసరములలో నిదియొకటి. వారి పశుగణమును అడవులలోనికి విడువవచ్చును. పశుగణమును దోలికొనిపోయి దొడ్డిలోఁబెట్టి విడుదలకయి కొంత సుంకమును బ్రజలిచ్చు పాశ్చాత్య విధానమును మనవారు ముందే కనుఁగొనిరి.



గ్రామములోని పశువులు గ్రామ సరిహద్దు దాటకుండ జాగ్రత పఱచుట కావలివాని విధి. ఒకవేళ గ్రామ సరిహద్దులను దాటి పొరుగూరు వెళ్లిన యెడల అట్టి పశువులను గావలివాండ్రు పట్టి తెచ్చి యజమానుల కప్పగించు పూచీ యుండెను. ఆ పశువు దొరకనిచోఁ బశువుయొక్క కిమ్మతు కావలివాండ్రిచ్చు నియమముగలదు. ఏల యనఁగాఁ బశువులను గాపాడుట కావలివాని ధర్మము గనుక ఆ నియమమున కతఁడు బద్ధుఁడు కావలసియుండెను. ఆ కాలమున దొంగలే లేరు. బందిపోట్లును దొంగతనములును గనఁబడవు. క్రీ. శ. ౫ వ శతాబ్దమున భారత దేశమునఁ బర్యటనము సల్పిన చైనా యాత్రికుఁడగు ఫాహియాన్ అను నతఁడు దేశమంతను నాఱు సంవత్సరములు సంచారము చేసినప్పు డతి జాకరూకతతోను శ్రద్ధతోను బరిస్థితులను గనుఁగొని గ్రంథ రూపమున నిక్షిప్త మొనర్చెను. 'నేను దిరిగిన ప్రదేశములలో నెచ్చటనేని నొక్కనాఁడేని దొంగభయమన్న మాట లే' దని ఫాహియాన్ వ్రాసినాఁడు.

ఒకవేళ దొంగతనము జరిగి రాజుచే నేరస్థుఁడుగఁ బరిగణింపఁబడిన యతఁడాస్తితో దొఱకినచోఁ బోయిన యాస్తికి నాలుగురెట్లు ద్రవ్యము ప్రభుత్వమువారి కోశమునుండి యిప్పింపవలసి యుండెను. పనిలేని బీదవాండ్రకుఁ బ్రభువు భూములఁ బంచిపెట్టి వ్యవసాయము చేసి జీవింపవలసినదని యాజ్ఞ నొసఁగుచుండెను. చక్కఁగఁ బండు భూములను స్వాధీనమునుండి తొలఁగింప కుండుటయే గాక వారి వంశములందే యుంచెడివారు. పంట తక్కువయై నిస్సారముగ నున్న భూములను వారి యధీనము నుండి తప్పించి మఱియొకరికిచ్చెడివారు. ఈ విషయము చెన్నపురి ప్రభుత్వమువారి వలన సేకరింపఁబడిన ఎపిగ్రాఫికల్ పరిశోధనలందుఁ గాన్పించును. దేవాలయముల భిత్తికలపైనను రాగి రేకులపైనను గల శాసనములివి. ఇందుఁ జాల భాగము త్రవ్వి యెత్తఁబడినవి. క్రీ. శ. ౧౭ వ శతాబ్దమునఁ 'దగ్గోజి' యను కమ్మరి పేరుతోను 'నాగోజి' యను వడ్రంగి పేరుతోను బంచి యిచ్చిన భూముల పట్టాలు గలవు. వానిలో నింత నంజ యింత పుంజ యని యుదహరింపఁబడినది. ఈ గ్రామ మాన్యముల పట్టాలు పొందినందుకే వంశములవారు గ్రామములోని ప్రజకు నౌకరి చేయుచుండిరి. ఇఁక నిమ్నజాతుల విషయములోని యేర్పాట్లు చక్కఁగా నున్నవి. వారికిఁ బ్రత్యేక దేవాలయములు గలవు. ఇండ్లు కట్టుకొనుటకు కయాచితముగా స్థలము లీయఁబడినవి. గ్రామములోని వారికి వలె వీరికిని గోభూమిపయి నధికారము కలదు. కమ్మరికిఁ గొంత పల్లపు భూమియుఁ గొంత మెఱక భూమియుఁ గలదు. ఆ భూమిలో నాలుగు తూముల ధాన్యము వెదఁజల్లవచ్చును. (తూము అనఁగా ౩౨ మానికల ధాన్యము) పల్లపుభూమి కాలువ నీటి వలనఁ దడుపఁబడును. వడ్రంగికి గూడ కమ్మరికివలె నాలుగు తూముల ధాన్యము వెదఁజల్లునట్టి పల్లపు భూమియు మెఱక భూమియు నుండెను. పల్లపు భూమి కాలువనీటివలన సాగగుచుండెను. కేంద్ర ప్రభుత్వమువారు ౧౮౫ గ్రామ సభలకు 'దేవాలయ నౌకరులను బ్రహ్మచారులను లేఖకులను గోశాధికారులను బ్రాహ్మణులకు

సప్లయి చేయవలసిన ' దని యుత్తరు వొసంగినట్లు దెలియుచున్నది. వారికిఁ బ్రయాణ భృతి (రాకపోకలకగు ద్రవ్యము) నిర్ణయింపఁబడెను. నూట పదునాలుగు సభలు కావలివాండ్రను సప్లయి చేసినవి. గ్రామ సభల వలన వసూలు కాఁబడిన రివెన్యూ మొత్తము నుండి కావలివాండ్రకు వేతన మిచ్చుచుండిరి. ప్రతి గ్రామములోను బాటసారుల వసతి గృహ మొకటియు నొక విశ్రాంతి గృహమును నుండెను. కావలివాఁడు గ్రామ సరిహద్దులలో బాటసారులను గలిసికొని వచ్చి విశ్రాంతి గృహమునకుఁ గొంపోయి వారెన్నాళ్ళు ఆ యూర నుందురో అంత కాలమును వారి సామగ్రిని భద్రపఱచి పోవునప్పు డాసామాగ్రిని వారి కప్పగించుచుండెను. ఆ బాటసారులా విశ్రాంతి గృహమున నెన్నినాళ్ళువసింతురో దినమున కింత యని రుసుము ఈయవలసి యుండెను. గ్రామ సభకును,—ఈ రుసుమునకును, ఎట్టి సంబంధమును లేకుండెను. ఈ రుసుము కేంద్ర ప్రభుత్వమునకుఁ బోవుచుండెను. సహకార పరిశ్రమమువలన దేవాలయములును రథ్యలును (రోడ్లు) దటాకములును గూపములును నీటి కాలువలును బ్రభుత్వ సౌధములును ఏర్పడుచుండెను. భారత దేశైశ్వర్య మంతయు గ్రామముల లోనే యున్నది. పట్టణములలోను గ్రామములలోను శేతి మగ్గములు వ్యాపించి యున్నవి. తెలుపు, రత్నకంబళులు మొదలగు విచిత్ర వసనములును బంగారు వెండి జరీ వస్త్రములును ఈ మగ్గముల మూలమునఁ దయారగుచుండెను.

గ్రామము మొదలు కేంద్ర ప్రభుత్వము వఱకును బాధ్యత యంతయుఁ బ్రజా ద్రవ్యమున జీవించు నుద్యోగుల పయి నిలిచి యున్నది. కావునఁ బూర్వ మే విధముగ గ్రామ సభలు ప్రజానుమతముగఁ దమ ధర్మమును నిర్వహించి శశ్వద్యశస్సు నార్జించి యుండెనో నేఁడా సంప్రదాయమును ఆదర్శమును ఎట్లు గణనీయములయి విలసిల్లు చున్నవో చదువరులు పరికింతురు గాక!

---

# ప్రభుత్వ కార్యములు.

:0:

అతి ప్రాచీన కాలమునుండియు భారత వర్షమున రాజ్యాసక్తియే ప్రజోపయోగ కార్యముల సంరక్షించుటకును గట్టుబాటునకును నాకర్షించియుండెను. పట్టణములును బల్లెలును ప్రభుత్వ భవనములును బాటలును గాలువలును గళాచాతుర్య విన్యాసములును నౌకా నిర్మాణములును నిందు ముఖ్యములు.



అలగ్జాండరు దండయాత్రా కాలమునఁ బట్టణములలోఁ దృప్తికరమగు జన సంఖ్య యుండెను. పంజాబులో రెండువేల పట్టణముల కన్న నెక్కువగ నలగ్జాండరు జయించి నటులు గ్రీకుదేశపు వ్రాయసకాండ్రు తెలుపుచున్నారు. చంద్రగుప్తుని యతి విస్తీర్ణమగు సామ్రాజ్యమునఁ బ్రతి మండలమునకును నొక పట్టణ ముండెనని యర్థ శాస్త్రములోని మొదటి యధ్యాయమున వ్రాయఁబడియున్నది. కాని యీ పట్టణము లలోఁ జాల భాగము చిన్నవి. ఈ పట్టణము ముఖ్యస్థానముగ నుండెనని రామాయణ మున బాలకాండమునఁ జెప్పఁబడి యున్నది. అయోధ్యా నగరమున ముప్పది వేల దుకాణములును నాలువేల పాటకచేరీలును నుండెనని జర్మనీదేశ చరిత్ర కారుఁడు వ్రాయు చున్నాఁడు. 'రాజ్యమునకు మధ్యమున రాజధాని నగరమును నదీ ప్రాంతమున రాజ నగరును నుండవలయు' నని మానసారుఁడు చెప్పుచున్నాఁడు (అధ్యాయము ౧౧) తరువాత నగర స్థితి నభివర్ణించెను. శిల్పమునఁ బ్రావీణ్యము గల మయుఁడను రాక్షసుఁడు (ఇతఁడు పర్షియా దేశీయుఁడు) ఖాండవ ప్రస్థమునందుఁ బాండవుల కొఱకొక రమ్యహర్మ్యము నిర్మించెనని మహా భారతమునఁ జెప్పఁబడినది. సకల ఋతువులందును మిగుల మనోహరము లయి సమస్త ప్రాణుల కునికిపట్టయి యొప్పు ఖాండవ ప్రస్థమున నొక రమ్యహర్మ్యము గలదు. దీని చుట్టు నొక యగాధమగు నగడ్తయును దానికిఁ బైగఁ బెక్కు అడుగుల యెత్తుఁగల రోజాపుష్పములచే నలంకృత మయిన ప్రాకారమును నెత్తయిన శిఖరములతో నుండు సింహద్వారములును సంధింపఁబడి యుండెను. ఆ నగరమున వివిధ ఫల పుష్ప శోభితములగు తరులతావళులతో నిర్మల జల పూరితములగు కమలాకరములతో రమణీయముగ గిరగిరఁ దిరుగుచుఁ బొంగియూర్ధ్వ ముఖమునకుఁ బ్రవహించు పెక్కు జల యంత్రధారలతో నేత్ర పర్వ మొనర్చుచుండు సుందరారామములును జక్కని కట్టడములును గొలంకులును దటాకములును నుండె' నని మహా భారతమున వాకొనఁబడినది. అరియన్ చరిత్రకారుఁడు భారతదేశమునఁ గల పట్టణములను గూర్చి వ్రాయుచు నీ క్రింది విధముగ వివరించెను. 'నగరముల సంఖ్య మిగుల హెచ్చు కాని యట్టి నగరములు నదీతీరములందుఁ గాని సముద్ర తీరమునఁ గాని యిటుకలతోఁ గట్టుటకు బదులు దారువుతోఁ గట్టుదురు.' మెగస్తనీసను యవన రాయబారి చెప్పి నటులు హిరణ్యావతి గంగానదులు సంగమించు ప్రదేశమున ప్రషియనుల రాష్ట్ర మొకఁ డుండెను. ఈ రాష్ట్రమునఁ బాలింబోత్ర యను పట్టణ ముండెను. దీనినే పాటలీ పుత్ర మనియెదరు. ఈ పట్టణము భారతవర్షమందలి పట్టణములందెల్ల గొప్పది. ప్రకృతము పాట్నా, బాంకి పురములును దత్పరిసర ప్రదేశములును వ్యాపించియుండు ప్రదేశ మంతయు నిది విస్తరిల్లియుండెను. నుఱఁగలఁ గ్రక్కుచు గంగాస్రవంతి దీని ముంగిటనే ప్రవహించుచుఁ జూపఱుల కధికానందముఁ గొల్పుచుండెడిది. ఈ పట్టణము పది మైళ్ళ పొడవును రెండు మైళ్ళ వెడలుపును గలిగి చుట్టును నాలువందల యడుగుల వెడలుపును ముప్పది మూరల లోతును గలిగిన యొక యగడ్తయును, ౫౭౦ శిఖరములును ౬౪ ద్వారములును గల ప్రాకారమును గలిగి యొప్పారుచుండెను. ఫాహియాన్,

హుయాను త్సాంగు అను వారలు పాటలి పుత్రమును సందర్శించినప్పుడు ఆ పట్టణము యొక్క శైథిల్య చిహ్నములుగఁ గొన్ని పిట్ట గోడలు మాత్రము నిలిచియుండెను. (ఫాహియాన్ పర్యటనములు, అధ్యాయము ౨౭; హుయాను త్సాంగు జీవితము ౧౦౧ పుట.) వైశాలి యను నొక పట్టణము ప్రజాసమ్మర్దముతోను నైశ్వర్య ప్రదము గను నుండెననియు నచ్చటి ప్రజలు పుష్కలమగు నాహారము గలిగి యభివృద్ధియం దున్నారనియు బౌద్ధ గ్రంథములు వాకొనుచున్నవి. ఈ పట్టణమున ౭౭౦౭ ఆరామము లును, ౭౭౦౭ కోటలును, ౭౭౦౭ మిద్దె యిండ్లును, ౭౭౦౭ గోపుర శిఖరములు గల సామాన్య యిండ్లును, నుండెనని వినయుని పార్శ్వ గ్రంథముల వలనఁ దెలియుచున్నది. (ప్రాచ్యపావన గ్రంథములు, VIII, ౧.) గొప్ప గ్రాసుసకాఁడగు బాణుఁడు తన కాదంబరి యందుఁ గ్రీ. శ. ౭ వ శతాబ్దములో నున్న ఉజ్జయినీ పట్టణమును రసో చితముగను గావ్యసరణిగను నభివర్ణించెను. " అందలి చావడులు దైవనిర్మితములుగ నుండెను. మైదానములును బచ్చని తోఁటలును కేతకి పుష్పావృతములఁది నట్లుండెను. బావులకు యిటుక దిమ్మ లమర్పఁబడినవి. మధువును ద్రావవలెనని రొదసేయు తేనె టీఁగల గుంపుచేఁ గాళరాత్రిఁబలెఁ దోఁచుచుండెను. మనోజ్ఞములగు లతాపుష్పముల సౌరభముచేఁ బరువెత్తఁబడిన మందమారుతము ఘ్రాణయోగ్యముగ నుండెను. మయూర ముల నిస్వనంబులు ప్రతి ధ్వను లీనుచుండెను. కల్హారములలోని స్వచ్ఛమగు నీలిమ కలు వలను అందలి రాయంచల తళుకు బెళుకులును నయనపర్వ మొనర్చుచుండెను. నలు కెలంకుల సుస్నిగ్ధములగు దంతపు గోపురములును అనంటి తోఁపులును గలవు. భ్రూమ టినిఁ దలపించునట్టియుఁ దనతరంగసంఘాతముచే నాకసము పావనము చేయఁగలట్టియు, ' సిప్రా ' నది చుట్టును బ్రవహించుచుండెను. చిత్రించిన చావడులును హర్మ్యము లును బటికపు జాలవలె శోభిల్లుచున్నవి. పట్టణపుఁ బొలిమేర వఱకు గృహములును లెక్కకు మించిన సత్రాలును గలిగి కల్ప వృక్షము భాతిఁ జెలంగుచుండెను." అని బాణుని కాదంబరియందుఁ గలదు. ఈ వర్ణన మెంతో రమణీయముగ నున్నది. చైనా యాత్రసారి యగు హుయాను త్సాంగు, కన్యాకుబ్జము హర్షుని కాలమునఁ గడు రమణీయ మయి మివుల వైభవ దశలో నున్నది. ఇయ్యది రెండు క్రోశముల పొడవును నొక క్రోశము వెడల్పును గలిగి యొక దెసను గంగాతరంగిణిచేతను దక్కిన మూఁడు దిశ లును అగాధమగు నగడ్తలచేతను ఆవరింపఁబడి యాకసమంటు సౌధపంక్తులతో నిర్మల వాఃపూర యుతములగు తటాకములతో మనోహరములగు నుద్యాన వనములతోఁ గన్నులపండు వొనర్చుచుండెను. ఇందు నూఱు బౌద్ధ విహారములును ఇన్నూఱు దేవాల యములును నుండెను. ప్రజలు భాగ్యభోగ్యములతో మంచి స్థితి యందున్నా ' రని వ్రాయుచున్నాఁడు. (బౌద్ధ గ్రంథములు, పుస్తకము ౫.)

మహమ్మద్గజని దండయాత్ర కాలమునఁ గన్యాకుబ్జము ప్రతిభ హెచ్చయ్యె. రాజధాని పట్టణమున సామాన్యముగ మెఱక ప్రదేశమున రాజభవన మేర్పఱతురు.



అయ్యది కోట బురుజుల వలనను ఎత్తయిన గోడలవలనను బరిరక్షింపఁ బడుచుండె' నని యర్థశాస్త్రమునందును శుక్రనీతి మొదటి యధ్యాయము ౨౧౬, ౨౧౭ శ్లోకము లందును జెప్పఁబడియున్నది. రాజ భవనమునకు దాపున శాసన సభాశాలయు దీనికిఁ జుట్టును బ్రభుత్వ న్యాయస్థానములును బ్రభుత్వ భవనములును దేవాలయములును బారి శ్రామిక కళా విద్యాలయములును మంత్రుల గృహములును నింక నితర ఉన్నతో ద్యోగుల గృహములును సైనికులు నివసించు గృహములును ఆయుధశాలయు నుండెను. వీని వెనుక ప్రక్కను బ్రజాగృహము లుండెను. ఇతర ప్రదేశములలోను రాజధాని పట్టణము లీరీతిగనే యుండును. కాని యవి కొద్ది పరిమాణము గలవి. చాణక్యుని యర్థశాస్త్రము శుక్రనీతి అగ్నిపురాణము వంటి కొన్ని ప్రాచీనగ్రంథములలోఁ బట్టణ ములును బల్లెలును జక్కనివిధానముల ననుసరించి యేర్పడెననియున్నది. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౧, ౩. శుక్రనీతి నాలవ యధ్యాయమునను, అగ్ని పురా ణము CCXXVII నందును గలవు) మత్స్యపురాణమున నగర మేరూపమున నుం డునో వివరింపఁబడినది. 'పట్టాభిషిక్తుఁడయిన పార్థివుఁడు తృణకాష్ఠాది సమృద్ధిగల నదీ తీర దేశ మధ్యమున...నగరంబు నిర్మింపవలయు. అందొక వీథ్యగ్రభాగంబున దేవాల యమును రెండవ వీథ్యగ్రభాగంబున రాజభవనమును నుండవలెను.' (౨౫౦ వ యధ్యాయము) మహాభారతమునఁ ' జుట్టును లోతుగల యగడ్తయును, ఘనమగు కోటయు, సుందరమగు గృహములును, అందమగు వీధులును, సమస్త పదార్థములతో నున్న అంగడులును, బలురకముల ధాన్యములును, ఘృతాది రసద్రవ్యములును, బరా క్రమవంతులగు యోధులును, బండితులును, దూత ముఖ్య పరిజనము మొదలగు వానితోఁ బట్టణ ముండవలయు ' నని చెప్పఁబడినది. భవనములు కళాచిత్రితములు పట్టణ నిర్మాణములు,—ఇవి యన్నియు వాస్తు శాస్త్ర ప్రకారము రూపొందవలసి యున్నది. ఈ విషయములను జర్చించు శాస్త్రము లనేకములు గలవు. ఈ శాస్త్రము లన్నిఁటియందును ' మానసార ' యను గ్రంథము గొప్పది. ఈ గ్రంథమున రాజధాని, నగర, పుర, ఖేట, ఖర్వట, కుబ్జక, పట్టణము లని యేడు విధములుగఁ బట్టణములు వివరింపఁబడియెను. ఇంకను బల్లెలపు దిగువ విధముగ నభివర్ణించెను. దండక (సిబ్బంది యుండు ప్రదేశము), సర్వతోభద్ర (ప్రతి విషయమునను శుభ్రముగనుండు ప్రదేశము) నంద్యావార్త (ఆరోగ్యమున కునికిపట్టు), పద్మక (పద్మమువలె నుండునట్టిది), స్వస్తిక (స్వస్తికములుండు ప్రదేశము), ప్రస్తార (జాతితోఁ గట్టఁబడినది), కార్ముక (ధనస్సువలె నుండునట్టిది), చతుర్ముఖ (నాలుగు మొగములు గలది), అని గ్రామములు వివరింపఁ బడియెను. (మానసార ' గ్రంథము, అధ్యాయము ౧౧) రామరాజునతఁడు ' హైం దవ శిల్ప ' మను శీర్షికతో వ్యాస మొకటి వ్రాయుచు ' మానసార ' గ్రంథమును దక్క నితర గ్రంథములఁ జెక్కంటి నుపహరించెను. ఈ గ్రంథమున డెబ్బది యధ్యాయ ములకు బైఁగా నున్నవి. ఆ యధ్యాయములలో శిల్ప పరిమాణములు శిల్ప విద్య మొద లగునవి వివరింపఁబడెను. యంత్రముల వివిధాంశములును, దన్నియంత్రత్వ సిద్ధాంతము

లును, దేవాలయములు, గృహములు,—మొదలగు వానికొఱకు నిర్ణయమైన పలువిధములగు ప్రదేశములును, గట్టడముల వివిధ భాగములును, వాటి యలంకారములును, విగ్రహములు స్తంభములు,—మొదలగు వాని పీఠములును, బట్టణముల యొక్కయు నగరముల యొక్కయుఁ బల్లెలయొక్కయుఁ బలురకముల నిర్మాణ సూచనలును, మండపములు ద్వారములు రమ్యహర్మ్యములు ద్వారమండపములు పంద్రెండు అంతరువుల వఱకును బలు రకముల దేవాలయములు,—మొదలగునవి వివరింపఁబడ్డవి. చీనా బాటసారి యగు హుయానుత్సాంగు 'పట్టణములను బల్లెలను అంతర ద్వారములు గలిగి యున్నట్లును, వీధులును సందులును వక్రములుగ నుండెననియు, బాటలు బాహాటముగను మార్గము లపరిశుభ్రములుగను నుండెననియుఁ, గుడ్యములు వెడలుపుగను ఎత్తుగను నుండెననియు, వీని పయిని శిఖరములు దారువుతో చేర్పఁబడురనియు, సౌధముల ముంగిట నున్నట్లు వసారాలతో నిండియుండెననియు, వ్రాయుచున్నాఁడు. సామాన్యముగ నిర్ణయమైన చట్టముల ననుసరించి పట్టణములందును బల్లెలందును బ్రభుత్వ భవనములే గాక రహస్య నిర్మాణ గృహములును నిర్మించుచుందురు. 'అవయవాకు రూప సంబంధముల ననుసరించి (వాస్తు శాస్త్రము సారముగ) గృహమును నిర్మింపక యెవ రందుఁ గాపురముందురో యట్టి వారికి విపత్తు సంభవించును గనుక గృహనిర్మాణమునఁ బునాది నుండి చివఱ కప్పు వఱకు బాగుగ యోజింపవలసి యున్నది.' యని శిల్పమును గూర్చి వ్రాసిన ఆధునిక గ్రంథము వాకొనుచున్నది. 'మనుష్యాలయ చంద్రికా' యని రామరాజు తన వ్యాసమున నుదహరించెను. శుక్రనీతియందు 'వేయి స్తంభములతోఁ గట్టబడు కట్టడము మంచిదనియుఁ దక్కినవి మధ్యమము లనియు లేక తక్కువ యనియు భవనములను గూర్చిన ప్రసక్తియుం దుదహరింపఁబడినది. (శుక్రనీతి నాలవ యధ్యాయము, నాలవ పరిచ్ఛేదము, ౧ వ శ్లోకము.) నిర్మాతలు తఱచుగ శిల్పశాస్త్రముల ననుసరించి బాగుగ నారితేఱిన వారయి యుండిరి. స్థాపతులు (శిల్పులు), సూత్రగ్రాహకులు (పరిమాణములను గణిత శాస్త్రమును నేర్చినవారు.), తక్షకులు (ముడికొయ్యను బాగు చేయువారు), వార్ధకులు (వడ్రంగులు), మిపులఁ బ్రాచీన కాలమునుండియు భారతీయులు శిల్పము నాకర్షించునటులు చేసిరి. ఫర్గ్యూజన్ చెప్పినటులు హిందువులు హర్మ్యములను, శాసన సభాశాలలను, స్వాధీనముఁ జేసికొనిరి. బహుశః ప్రతిభాసమన్వితములును, పావనకరములును, నగు దేవాలయములు గూడ అశోకుఁడు సింహాసన మెక్కుటకుఁ బూర్వము నిర్మింపఁబడిన వనితోఁచెడిని. (Indian Eastern Architecture.)

ఈ ప్రాచీన కట్టడములు సామాన్యముగ దారుమయము లయినను ఇండ్ల పునాదులకును యంత్ర శాస్త్ర కార్యములకును ఱాయి నుపయోగింతురు. దోపిడుల కాలములో నిట్టి కట్టడములను బరిశోధించి నట్లుఁ గనిపింపదు. అశోకుని కాలము నుండియే ఱాతి శిల్పము సామాన్యమైనది. ఱాయితోఁ గట్టఁబడిన నూఱుపురములున్నట్లు ఋగ్వే



దమునఁ జెప్పఁబడినది. భవననిర్మాణ కళయు ఱాతి దుర్గముల నిర్మించుటయు మన భారతీయు లెఱింగియుండిరి. కనుక ప్రాచీన జ్ఞాపక చిహ్నములలోఁ జాల భాగము మనకుఁ దెలిసినంత వఱకు బౌద్ధ మతాను సరణములే!

మగధ దేశాధీశుఁడగు బింబిసారుని పుత్రుఁడగు అజాత శత్రుఁడు ప్రథమమున దేవదత్తుఁడనువాని దుర్బోధనల వలన వర్తనము కుంటుపడి కొంతకాలమునకుఁ బశ్చాత్తాపము గలవాఁడయి బౌద్ధ ధర్మ దీక్షను గ్రహించెనట! క్రీ. పూ. ౪౮౩ లో రాజగృహము నొద్ద జరిగిన ప్రథమ బౌద్ధాచార్య పరిషత్తు కొఱకు అజాత శత్రుఁడు 'సప్తపర్ణిగుహ' లో గొప్ప మండపమును గట్టించెను. నాగార్జునుఁడు తన శిష్యుఁడగు నార్యదేవునితోఁ బాటలీ పుత్రమునకు దాపున నున్న గ్రామ మొకటి చూచిరి. ఆ ప్రదేశ సౌందర్య శోభను బట్టి యచ్చట క్రీ. శ. ౪ వ శతాబ్దమున 'ఆర్యదేవుఁడు' నలందా విహారమును గట్టించెను. పాటలీ పుత్రములోని యశోకుని భవనమును గూర్చి ఫాహియాను మాటాడుచు నిట్లు వ్రాయుచున్నాఁడు. 'నగరు మధ్యమున రాజభవనమున్నది. ఆ భవనము సర్వాంగ సుందరముగ నిర్మించుటకయి నిపుణుఁడగు నొక శిల్పి నియమింపఁబడెను. ఆ భవనమున కుపయోగించు ఱాలు దైవనిర్మితము లనునంతవిగ నుండెను. ఇప్పటికిని శైథిల్య చిహ్నములు కనిపించుచున్నవి.' (ఫాహియాన్ బౌద్ధ గ్రంథములు, అధ్యాయము ౨౭.) బౌద్ధ మతాను సరణిని గృహములను గట్టుటకయి యశోక చక్రవర్తి విస్తార ధనరాసులను గ్రుమ్మరించెను. బోధిగయ యందు నతఁడొక గొప్ప దేవాలయమును గట్టించి సాంచిక్షేత్రమున నున్న ప్రసిద్ధమగు తోఁపులవలె నిచ్చటను దోఁపులను జెక్కసేసెను. అశోకుఁడు తన విస్తీర్ణ సామ్రాజ్యమున నలుకెలంకుల నెనుబదినాలుగు వేల స్తూపము లేర్పాటు చేయుట కుత్తరు విచ్చినాఁడు. ఇదియును గాక అతని రాజశాసన పత్రికటనములు చెక్కు స్తంభముల పయి దొంతరలుగఁ జెక్కఁబడియున్నవి. విన్ సెంటు స్మిత్ వ్రాసినటుల అశోకుని కాలములోని కళలు నిస్సంశయముగ నత్యున్నత స్థితి నధివసించినవి. యంత్ర శాస్త్రజ్ఞులు, రాజ శిల్పులు, విశాలమయి గంభీరమయి యున్నతమయి యుండు కట్టడములు, ఱాయితోను, గొయ్యతోను, ఇటుకతోను నిర్మించుట యందలి బలమైన కట్టుబాటులు, తూములు,—ఇతర సాధనములు, చెక్కడపుఁ బనులు, పోగరు పనులు,—వీటియందలి శ్రద్ధాళువు లయి యుండిరి. అశోకుఁడు తలపెట్టిన పను లాతని వంశీయుల వలనను ఇతర బౌద్ధ ప్రభువుల వలనను నెఱవేరుచుండెను. (వి. యే. స్మిత్ వ్రాసిన అశోకుని చరిత్ర, ౧౩౫ పుట) ఫర్గ్యూజన్ అభిప్రాయము ననుసరించి బౌద్ధకళోద్దేశములును సూత్రములును నీ విధముగ నున్నవని తెలియుచున్నది. 'స్తంభములు (లక్షణ యుక్తములును స్వాభావికములును నగు హిందూకళా రూపములు), స్తూపములు, కమ్ములు, చైత్యములు లేక శాసన సభాశాలలు (బౌద్ధాలయములకును క్రైస్తవ చర్చిలకును సామరస్యమును సానురూప్యమును గలిగినవి.) బౌద్ధుల నిలుపాటి స్తంభముల మొనలపయి శాసనములఁ జెక్కుటకు శిల్పులు నియమింపఁ

బడిరి. ఆ శిల్పులు కొన్ని వేళలందు వైష్ణవులయొక్కయు శైవులయొక్కయు ధ్వజస్తంభములను శిలాప్రతిమలనుజిత్రింతురు. మనోజ్ఞారాములనేకములున్నవి. అందెక్కువరామణీయకమయిన దొకటి సాంచి క్షేత్రమునఁ గలదు. ఆ యారామముయొక్క పునాది పదునాలుగడుగులును నలువది రెండు అడుగుల యెత్తును, మధ్యరేఖ ౧౦౬ అడుగులును నుండును. ఈ సాంచిక్షేత్రము మధ్యరాష్ట్రములలో భోపాలు రాజ్యమునఁ గలదు. ఈ క్షేత్రమునఁ బహునొకండు పలుసు స్తూపములు గలవు. ఈ స్తూపములు త్రవ్వుచుండఁగా గౌతముని ప్రధాన శిష్యులగు మౌద్గల్యాయన, సారి పుత్రుల యస్థి శకలములు గనిపించినవి. సాంచిస్తూపము ౫౬ అడుగుల యున్నతియు ౧౩౬ అడుగుల కైవారమును గలిగి యుపరిభాగము శిల్పరచనలతో నలరారు స్నిగ్ధమయిన పలకజాలతోఁ గప్పఁబడినది. స్తూపమునకుఁ జుట్టును వలయాకృతిగ నూటనలువది యడుగుల కైవారము గలిగిన శిలా నిర్మితమగు కంచె యొకటి గలదు. కంచెకు నలుదిక్కులను నాలుగు తోరణ ద్వారములును వీనిపయి నద్వితీయ శిల్పకళా విన్యాసములతో బుద్ధుని జీవితాంశములును జాతక పురాణ కథలును జిత్రింపఁబడినవి. ఉత్తర తోరణ ద్వారమున వెస్సంతర జాతకము సవిస్తరముగ నభివర్ణింపఁ బడినది. ఇవిగాక బుద్ధుని యస్థికల కయి గావించిన ఘోర యుద్ధములు దండయాత్రలు ఆక్రమణలు కొన్ని ప్రదేశముల నతి మనోహరముగఁ జిత్రింపఁబడినవి. అశోకునిచే నీ స్తూపము నిర్మింపఁ బడినను దోరణద్వారములు క్రీ. శ. ప్రథమ శతాబ్దమున నిర్మింపఁ బడినట్లుఁ దెలియుచున్నది. బీహారులోఁగాని డోఓలోఁగాని యే గొప్ప బౌద్ధ చైత్యములయినను నుండినట్లయిన శిల్ప సమూహము ప్రాముఖ్యతను రానేరదు.' (సంపుటము ౧, పుట ౬౬.) ఈ చైత్యములలో ముప్పది యింకను శిథిలము గాక నిలిచియున్నట్లుఁ దెలియుచున్నది. కళా నైపుణ్యమునను భావోన్మేషమునను రస పుష్టియందును మిన్న యనిపించు గిరి గహ్వరములు పశ్చిమ భారతవర్షమునఁ బండ్రెండు వందలకుఁ దక్కువగాకుండఁ గనుఁగొనఁ బడినవి. వీనిలో మూఁడువందల గహ్వరములు జైనమత భావములకును, బ్రాహ్మణములకును ననుగుణ్యముగ నున్నవి. తక్కిన తొమ్మిది వందల గహ్వరములు బౌద్ధమతానుసరణములు. అజంతా, ఎల్లోరా, కార్లి గుహలు అతి మృదులములగు శిల్ప సాదృశ్యములు. అజంతాలో నాలుగు చైత్యములు గలవు. ఈ చైత్యములలో నిరూపింపఁబడిన బౌద్ధమతము ౬ వ శతాబ్దములోని హిందూ మతమును ననుకరించుచున్నది. ఇందలి రూపకల్పనలు ముద్దులు గులుకుచుఁ గన్నుల పండు వొనర్చుచుండును. ఈ చిత్తరువులందుఁ బ్రదర్శిత మయిన భావోన్మేషము, రసపుష్టి, రేఖావిన్యాసములు, వర్ణ సమ్మేళనము, రచనా నైపుణ్యము, ఆధ్యాత్మిక తేజము, నిరుపమానములు. ఈ చిత్తరువు లిప్పటికిని బదియైదు వందల యేండ్లయినను గొంచెమేని పసివాడలేదు. వైవర్ణ్యము చెందలేదు. ఎల్లోరాలోని విశ్వకర్మ చైత్యము గుప్త రాజుల కాలమున నిర్మింపఁబడినది. ఎల్లోరా పట్టణమున ననాదినుండియు నతిమనోహరముగఁ జిత్రింపఁ గల శిల్పులున్నట్లుఁ దెలియుచున్నది. జగద్విఖ్యాతమగు నెల్లోరా గుహలను ఈ



శిల్పులే మలచినట్లుఁ గనిపించుచున్నది. బౌద్ధ భిక్షువుల కొఱకుఁ బర్వతములలోఁ దొలుపఁబడిన చైత్యములలోను విహారములలోను 'గార్లి' పర్వతములోని చైత్యమును అజంతా విహారము గొప్పది. కార్లి చైత్యము బొంబాయి—పునహా నగరములకు మధ్యనున్నది. కార్లి పర్వతములోని చైత్యము యొక్క పొడవు ముఖద్వారము మొదలు వెనుక ప్రక్కనుండెడి గోడ వఱకు నూట యిరువదియారు అడుగులుండును. వెడలుపు నలువదియైదడుగుల యేకంగుళము లుండును. శిల్పుల హస్త నైపుణ్యమును బుద్ధి వైశద్యమును దెలుపునట్టి చెక్కడపుఁ బనులచే శోభిల్లుచుండిన ముప్పది తొమ్మిది స్తంభములు గలవు. మానింగు దొరసాని చెప్పినట్లు మూఁడు వంతులు క్రిమికీటకముల వలనను దరుగుల్మ లతాది వృక్షతతి వలనను అకాల వర్షముల వలనను—శిల్ప కార్య నిర్వహణమును రక్షణయును దదుపయోగమును దఱిగిన దని Ancient and mediaeval India అను గ్రంథమునఁ జెప్పఁబడినది. (పుట ౩౯౬.) బౌద్ధ యుగమున భారత దేశమందలి ప్రతి భాగమునందును సంఘారామములుండెనని తెలియుచున్నది. దీనికిఁ గారణము బౌద్ధ భిక్షువులు మత వ్యాపనమే గాక విద్యావ్యాపనముం గూడఁ జేసిరి. బౌద్ధ విహారములన్నియు విద్యాలయములుగ మార్పఁ గావింపఁబడినవి. భిక్షువులు బౌద్ధమత వ్యాపనము కయి విహారములలోఁ బాఠశాలలును సర్వకళాశాలలును విశ్వ విద్యాలయములును నేర్పఱచి విద్యాభివృద్ధిఁ గావించిరి. బౌద్ధ యుగమునందే గాక అనాదినుండియు భారతవర్షము విద్యాకరమయి ప్రసిద్ధి వడసినది. వేదకాలమున బదరిక, నైమిశారణ్య, ఆశ్రమములు సుప్రసిద్ధ విద్యా సంస్థలయి లెక్కకు మించిన ప్రజకు విద్యాదాన మొసంగినవి. 'విశేష నేర్పుతో సంఘారామము లేర్పడినవి. ప్రతి కేంద్రమునను మూఁడంతరువులఁ గోపుర ముండెను. కవాటములు, గవాక్షములు, అంతర్భాగమునఁ గల కుడ్యములు భావోత్తేజకముగఁ జిత్రించిరి. భిక్షువుల మఠములు అంతర్భాగమునఁ జిత్ర విచిత్రముగను, బహిర్భాగమునఁ గన్నులు మిఱుమిట్లుఁ గొనునట్లుగను నుండెను. మధ్య భాగమున ఎత్తును వెడలుపును గల చావడి కలదు. ప్రాగ్దిశను గవాటములు తెఱువఁబడును. రాజ సింహాసనము కూడఁ బ్రాఙ్ముఖముగనే యుండు' నని హుయానుత్సాంగు తన బౌద్ధ గ్రంథములలో నభివర్ణించెను. (పుస్తకము ౨, పుట ౩౩, ౩౪.) బొంబాయి సామీప్యమున 'సాల్సెట్టి' యను ద్వీప మున్నది. అందుఁ గన్హారీ గుహలున్నవి. ఆ గుహలలోఁ బెక్కు విగ్రహములును శాసనములును జెక్కఁబడియున్నవి. ఒకచోట సముద్రమున విచ్ఛిత్తియి మునకలు వేయుచున్న నొక నావయు నీటఁబడి మునుఁగుచు దిక్కులేక పరమేశ్వరుని వేఁడుకొనుచున్న యిరువురు మనుష్యులును వారి ప్రార్థనము విని లక్ష్మీదేవి దయార్ద్రయై దూతల నిర్వుర నంపి నీటమునుఁగనుండు వారిని రక్షించుచున్నట్లును' జిత్రింపఁబడియున్నది. శాసనములను బట్టి చూడఁగా ఆంధ్రభృత్యుని కాలముననో, ౧౩౩—౧౬౨ సం॥రము లందుఁ బాలించిన వసిష్ఠ పుత్ర శాతకర్ణుని కాలముననో, లేక రెండవ గౌతమీ పుత్రుని కాలముననో,—ఇవి చెక్కఁబడినట్లు దెలియుచున్నది. క్రీ. శ. ౧౨ వ శతా

బుద్ధ శిల్పము జగన్నాథాలయము మీఁద గనిపించుచున్నది. యుక్తి కల్పతరువునందు జెప్పఁబడిన ప్రకార మొక బావిమీఁద గంసుని బారిఁ బడకుండ శ్రీకృష్ణుని నొక యోడలోఁ గొంపోవుచున్నట్లును, శ్రీకృష్ణుఁడా యోడ మధ్య నున్న మందిరములోఁ బైనుండి వ్రేలాడు నుయ్యాలపైన సుఖాసీనుఁ డయి నట్లును గలదు. ఇట్టి చిత్రములే మహా బలిపురమున రథముల పయిఁ గలవు. క్రీ. శ. ౨ వ శతాబ్దము నాటి నాణెములు దక్షిణదేశమున ఇటీవల దొఱకినవి. ఆ నాణెముల పయిఁ బడవలు చిత్రింపఁ బడినవి.

బౌద్ధులవలె హిందువులును జైనులును దా మేకాంతముగ నుండుటకయి దేవ గృహములు గొండలలోఁ దొలుచుకొనిరి. పిదప హిందూ దేవాలయము లసంఖ్యాకములుగ నేర్పాటుఁ జేయ నారంభించిరి. అందనేకము లింకను శిథిలము గాక యున్నవి. వానిలోఁ గొన్ని దక్షిణ హిందూదేశమునను ఒరిస్సా దేశమునను మంచి స్థితియం దున్నవి. రాజ శాసనా బలమువలన నెక్కువ రమ్యహర్మ్యములు నిర్మింపఁ బడెను. మనము తెలుచు శాసనములలో దేవాలయములను గూర్చియు ధర్మగృహములను గూర్చియుఁ బ్రభుత్వమువారి చట్టముల ననుసరించి నిర్మింపఁబడినట్లుఁ జదువుచుందుము. కుమార గుప్తుని యొక్కయు బంధువర్మ యొక్కయు మందసోరు శాసనములఁ బరికించిన ఈ విషయము తెలియఁగలదు. ఫాహియాను అను చీనా యాత్రికుఁడు క్రీ. శ. ౫ వ శతాబ్ద ప్రాంతమునఁ ‘తక్షశిల’ కు వచ్చి యచ్చటి బౌద్ధ విహారములను బౌద్ధ మఠము లను జూచినట్లు దెలియుచున్నది. కాని యితఁడు దీని విషయమయి యేమియు వ్రాయ లేదు. క్రీ. శ. ౫ వ శతాబ్దమునఁ ‘తక్షశిల’ పయి దండెత్తిన రుద్రిహూణుల దుర్మార్గ కృత్యముల వలన మఱల నిది తల యెత్త లేదు. పిదపఁ క్రీ. శ. ౭ వ శతాబ్దమున హుయానుత్సాంగు అను చీనాదేశ యాత్రికుఁడు తక్షశిలకువచ్చి చూచునప్పటికిఁ గాశ్మీర సింహాసనమునకు సామంత రాజ్యముగ నుండెను. అతఁడు వర్ణించిన రెండు బౌద్ధాగారములలో నొకటి ధలక్ స్తూపమును మఱియొకటి కునాళస్తూపమును హుయానుత్సాంగు ఈ ప్రదేశమును జూచుటకుఁ బూర్వమే యచట నొక యాఁడుదానికి జౌ పధము లేకుండఁ గుష్ఠరోగము పోయినదఁట! ఈ ప్రదేశమున బుద్ధుఁడు ధర్మ మభిలషించి తన శిరమును దానము చేసినందువలన నశోకుఁడీ స్తూపమును గట్టించెనని చెప్పుదురు. హుదియాల్ బోడుకు నుత్తర దిశను రెండవ బౌద్ధాగారమగు కునాళస్తూపమున్నది. ఇచ్చట అశోకుని రెండవ భార్య గావించిన కుతంత్రముల వలన నతని కుమారుఁడగు కునాళుని కన్నులను దీసివైవఁ బడినందువలన నతఁడీ స్తూపమును గట్టించెను. అశోకుని పిదప హిందూకళా ప్రాశస్త్యము గుప్తయుగమున నెక్కువ యతిశయించెను. వి. ఏ. స్మిత్ సూచించినటులు భారతదేశమున బలవత్తరమయిన రాజావలిస్థాపనము వలన మానవుని మేధా సంపత్తియు గళాప్రాశస్త్యమును శక్తియు వృద్ధిఁబొందించుటకు తేజక మొసంగెను.



జావా ద్వీపము నేలిన శ్రీయుసన విజయ ధర్మోత్తుంగదేవ మొదలు రాణి త్రిభువనోత్తుంగదేవి వఱకును గల ప్రభువు లందఱును బౌద్ధమతమునే రాజమతముగఁ జేసి యెంతయో యభివృద్ధికిఁ దెచ్చిరి. కొన్ని భాగములలోఁ బ్రజాబాహుళ్యము వలన శైవ మతమే యెక్కువగ నవలంబింపఁ బడుచుండెడిది. ఆ కారణమున జావాయందుఁ బది పదునొకండు పన్నెండు శతాబ్దములలోఁ గొన్ని శివాలయము లేర్పడి బ్రాహ్మణార్చకులు నియమింపఁబడిరి. ౧౧౫౦ సంవత్సరమునఁ గంబోడియా నేలిన ‘పరమ విష్ణులోక’ యను ప్రభువు ఈ శైవాలయమును విష్ణుదేవున కర్పించి క్రీ. శ. ౧౨ వ శతాబ్దమున నుత్తర హిందూస్థానములోని యార్యులు మహమ్మదీయులచే నోడింపఁబడుచుండ జయవర్మ సార్వభౌముఁడు హేమరు సామ్రాజ్యమును బాలించుచుండెను. ఈ సామ్రాజ్యమునకుఁ ‘గంబోడియా’ మధ్య ప్రదేశము. క్రీ. శ. ౩ వ శతాబ్దము మొదలు ౧౩ వ శతాబ్దము వఱకు జావా సామ్రాజ్యము యొక్క రాజకీయ బలమును ఆధ్యాత్మిక బలమును నిరుపమానముగ నుండెను. ౧౧ వ శతాబ్దమున జయవర్మ కాలమున ఈ హేమరు సామ్రాజ్యము నభివృద్ధి యందున్నను అంతకు గ్రిత మెన్నియో శతాబ్దములనుండి హిందూదేశము నుండి బ్రాహ్మణులు ‘కంబోడియా’ కుఁ బోయి రామాయణమును బోధించుచుండిరనియు బౌద్ధమత గురువులు ఎనిమిది ధర్మములను బోధించుచుండిరనియు నిదర్శనము లున్నవి. కావునఁ బ్రథమమున జావానుండి వచ్చిన భారతీయులు ఈ సామ్రాజ్యమును స్థాపించిరని తోఁచుచున్నది. భారతీయుల శిల్పకళా ప్రాశస్త్యమును బ్రకటించు నిదర్శనము లెన్నియో ‘కాంబోడియా’ యందున్నవి. హేమరు సామ్రాజ్యమునకుఁ బ్రధాన నగరమగు ‘అంగకరు’ నందు అంగకరు వాట దేవాలయ శైథిల్య చిహ్నము లింకను నున్నవి. కొన్ని శతాబ్దములకుఁ బూర్వము జీవకళలతో వికసించుచున్న ఈ ప్రదేశము నేఁడు నిర్మానుష్యముగ నున్నది. ఒక చరిత్రకారుఁ డీ యాలయమును సందర్శించి యిట్లు వ్రాసినాఁడు. ‘అంగకరువాటి దేవాలయము ౭౨౦ అడుగుల పొడవును ౬౭౬ అడుగుల వెడల్పును నున్నది. అయిదంతరువుల యెత్తున్నది. ఒక యంతరువు ౧౨౩ అడుగుల యెత్తున్నదనిన ఆ యాలయ మెంత యెత్తయినదో యూహింపవచ్చును. ప్రతి యంగుళమును శిల్పకళా నైపుణ్యమును జాటుచున్నది.’ అని వ్రాసినాఁడు. నేఁటికిని ‘కంబోడియా’ యందు భారతీయుల మత ధర్మము లనుసరింపఁబడుచున్నవి. భారతీయుల పండుగ పర్వములు జరుగుచున్నవి. చరిత్రలవలన జావా, సుమిత్ర, బాలి, సిలిబీసు, బర్మా,—మొదలగు ప్రదేశములలో భారతీయులు ఉపనివేశముల నెలకొల్పి యుండిరని తెలియుచున్నది. క్రీ శ. ౭ వ శతాబ్దమున జపానులోఁ బ్రవేశపెట్టఁబడిన భారతీయ వీణయు గ్రీకు సంప్రదాయాను సారముగ వచ్చిన వాద్యమును నేఁటికిఁ గూడ రాజమందిరమున జాగ్రత పఱుపఁ బడినవి. విజయాదిత్యుని మనుమఁడును నాలవ విష్ణువర్ధనుని కుమారుఁడును నగు రెండవ విజయాదిత్యుఁడు శాలివాహన శకము ౭౨౧ సం॥ రమున సింహాసన మెక్కి శాలివాహన శకము ౭౬౫ సం॥ రము వఱకు అనఁగా నలువది నాలుగు సంవత్సరములు నిర్వక్ర పరాక్రమ

ముతో శాత్రవులఁ దునుమాడి విజయ లక్ష్మిని వరించినందువలన, 'నరేంద్రమృగరా'జను బిరుదము నంది నూట యెనిమిది పర్యాయములు గాంగులతోను రాష్ట్రకూటాధి పతులతోను యుద్ధ మొనర్చి తన రాష్ట్రమంతను విజయ చిహ్నముగ నూట యెనిమిది దేవాలయములను గట్టించెను. ఈ సందర్భమునందే విజయవాడయందు 'సమస్త భువనాశ్రయ' మనెడి యాలయమును గట్టించి యా దేవునకుఁ గొంత భూమిని దానము చేసినటుల రెండవ యమ్మరాజు విజయాదిత్యుని శాసనమున వ్రాయఁబడి యున్నది.

కాకతీయ రుద్రదేవ చక్రవర్తి అనుమకొండయం దాంధ్ర శిల్పుల వలన నొక దేవాలయమును గట్టించి దానికి 'రుద్రేశ్వర' మని పేరిడి తన వంశ చరిత్ర నంతను రామేశ్వర భట్టారకుని చే శ్లోకరూపమున వ్రాయించి శాసనము వేయించెను. గయకు నుత్తరమునఁ బదునాఱు మైళ్ళ దూరమున 'లోమస ఋషిగుహ' యను నొక గహ్వరము గలదు. అందలి లోపలి భాగమున ౩౩ అడుగుల పొడవును ౧౯ అడుగుల వెడల్పును గల చావడి యున్నది. క్రీ. పూ. ౩ వ శతాబ్దమున నీ గుహ నిర్మింపఁబడెను. పశ్చిమ హిందూదేశమున గౌతమీపుత్ర, యదుయశ్రీ, నహపాణా, గుహలు ప్రముఖములు. యదుయశ్రీ విహారములో నలువది యడుగుల పొడవును నలువదియైదు అడుగుల వెడల్పును గల చావడియు భిక్షువులకు నిలువదియొక్క గదులును గలవు. చాళుక్యుల కాలమున భారత వర్షమున వెలసిల్లిన హోయిశల శిల్పము చూపఱుల కచ్చెరువుఁ గలుగఁ జేయుచుండెను. హోయిశల రాజుల విఖ్యాతినిఁ బ్రకటించి యీ దేవాలయము లింతవఱకు నిలచియుండుట మన యదృష్టమే! బెంగుళూరు—పూనా రైలు మార్గమున బనావరు స్టేషను గలదు. దీని కిఱువది మైళ్ళ దూరమున హాలిబిడ్ దేవాలయ మున్నది. ఇచ్చట రెండు దేవాలయములున్నవి. అందొకటి జైనుల కాలమునఁ గట్టఁబడియెను. రెండవది ౧౦౪౭—౧౧౦౦ సం॥ రము లందుఁ బాలించుచున్న హోయిశలేశ్వరుఁడగు వినయాదిత్యుని కాలమునఁ బ్రారంభింపఁ బడియెను. ఎనుబదియాఱు సంవత్సరములు పని జరిగిన పిదప నీ దేవాలయ మసంపూర్తిగ వదలఁబడెను. సోమనాధ దేవాలయమువలె మధ్య రెండు గోపురములు ఏర్పాటు చేయు నుద్దేశము శిల్పుల కున్నట్లుఁ దెలియుచున్నది. సూర్యరశ్మి తగులు కొలఁది ఘనీభవించు ఱాలతో నీ యాలయము నిర్మింపఁబడినది. ఆలయము రెండు భాగములుగ నున్నది. ఒక్కొక్క భాగ మొక గొప్ప దేవాలయము వలె నున్నది. తూర్పు ద్వారమునఁ బక్కని స్తంభములతో రెండు మండపములున్నవి. ఆ మండపముల పయి నంది విగ్రహము లున్నవి. దేవాలయ మంతయు నలువదివేల చదరపు టడుగుల విస్తీర్ణ మున్నది. ఆలయ ప్రధాన భవనము నూఱడుగుల పొడవును నూట యిఱువది రెండు అడుగుల వెడల్పును నున్నది. లోపలి భాగములందంతను అద్భుతమగు శిల్ప కళా నైపుణ్యమును బ్రకటించు నిదర్శనము లనేకము లున్నవి. రెండవ దేవాలయము కేదారేశ్వరాలయము. ౧౨౧౯ సం॥ రమున వీరబల్లాలరాజు భార్య అభినవ కేతాళదేవి నిర్మించినది. దేవాలయములోని విమానము పయి నొక చెట్టు



మొలచుటచేఁ గొన్ని భాగములు శిథిలమయ్యెను. మైసూరు ప్రభుత్వమువారు మఱల విమానమును గట్టింపఁ బ్రయత్నించిరి. కాని నాఁటి పనికిని నేఁటి పనికిని భేద మెంతయో యుండుటవలన ఆ ప్రయత్నమును మానుకొనిరి. హాలిబిడ్‌కుఁ బది మైళ్ళ దూరమున బేలూరు దేవాలయమున్నది. అది వైష్ణవాలయము. ఆలయము చుట్టును భారత పురాణ గాథల భాగములు చిత్రింపఁ బడినవి. ఒక ప్రదేశమున నొక ఫలమును దానిపయి నొక యీఁగయు దానిని మ్రింగుటకయి యొక బల్లి వేచి యుండుటయు నద్భుతముగఁ జెక్కఁబడి యున్నవి. మఱి యొక ప్రదేశమున నొక వ్యక్తి తన వస్త్రమున వృశ్చికమును జూచి వస్త్రమును విప్పుచుండుట మిగుల నేర్పుతోఁ జెక్కఁబడినది. ఆలయము పయి నేని మిది కోణములు గల గోపుర ముండెను.

ఆఱవ శతాబ్దపు వాఁడగు వరాహమిహిరుఁడు బృహత్సంహిత యందు నాఁటి పరిశ్రమలను సూచించినాఁడు. 'ప్రజలేపన' మను నొక విధమైన సిమెంటును సిద్ధపఱచు వారఁట! ఆ సిమెంటు పిడుగును లొంగదనియు దానిని దేవాలయ నిర్మాణమున కుపయోగించుచుండువారనియు బృహత్సంహిత యందు వ్రాయఁబడి యున్నది. నేఁటికిని అమరావతి యందలి శిథిల విగ్రహములను శిలా నిర్మిత ద్వారములను జూచిన యెడల నీ సిమెంటు మహిమ తెలియఁ గలదు. కొయ్య ముక్కల నతుకఁ బెట్టి పై మెఱుగుతో నతుకులు గాన్పింపకుండ గట్టిగ నుండు విధమున ఱాల ముక్కల నతికించి యున్నారు. వరాహమిహిరుఁడు తన గ్రంథమునఁ బలు విధములగు రంగులను దయారు చేయు యంత్ర విశేషములను గూర్చి ప్రశంసించి యున్నాఁడు. పుష్పముల నుండి తైలములఁ దీయు విధానములఁ జెప్పినాఁడు. మంజిష్ఠ మొదలగు వాని నుండి పక్కా రంగులను దీయుటయు నీలియాకు నుండి నీలి మందును దయారు చేయుటయు నుక్కును దయారు చేసి యనేక పనుల కుపయోగించునట్లు మెఱుగుఁ బెట్టుటయుఁ బూర్వము మనవారికి బాగుగఁ దెలియునని ప్రఫుల్లచంద్ర రాయ్ గారు 'ప్రాచీన భారతీయుల రసాయనిక సిద్ధాంతము' లను గ్రంథమున వివరించియున్నాఁడు. వారణాసికి (కాశికి) నుత్తరమున నాలుగు మైళ్ళ దూరమున 'సారనాథ' మను పట్టణము గలదు. పూర్వ మీ ప్రదేశమున గొప్ప విహారమును స్తూపములును లెక్కకు మించి యుండెను. ప్రాచ్య దేశములగు చీనా, బర్మా, జపాను మొదలగు దేశములనుండి బౌద్ధ యాత్రికులు వచ్చుచుండిన ప్రదేశ మిది. బుద్ధ దేవుఁడు బోధిగయయందుఁ దపమాచరించి యీ సామీప్యమున నీ 'సారనాథము' నందే జీవ హింసను జేయవలదనియు సర్వ ప్రాణులను సమత్వమునఁ జూడవలయుననియు నుద్బోధించెను. కావున నిది బౌద్ధుల కతి ముఖ్యమైనది. 'సారనాథము'న 'ధర్మేక్ష' యను భాగమున నొక గొప్ప స్తూపము కలదు. ఈ స్తూపము నిప్పుడు 'ధామేక్ స్తూప' మనియెదరు. అశోక చక్రవర్తి 'సారనాథము'న నొక గొప్ప స్తూపమును స్తంభమును గట్టించెను. క్రీ॥ శ. ౪౦౦—౪౧౧ మధ్య కాలమున నుత్తర హిందూస్థానము నందంతయుఁ దిరిగిన ఫాహియాను అను నతఁడు కురంగా

రామమున నాలుగు గొప్ప శిఖరములను బౌద్ధ భిక్షువుల కయి నిర్మించిన రెండు మఠములను దాను జూచినట్లు వ్రాసియున్నాడు. క్రీ. శ. ౬౪౦ సం॥ రమున హుయానుత్సాంగు అను మరి యొక చీనా యాత్రికుడు ఇన్నూఱు అడుగుల యెత్తుగల వందల కొలది దేవాలయములను శిఖరమున బంగరు నీరు తీయబడిన రసాలముచే నలంకృతమైన గొప్ప విహారమును గలదనియు నిందు న్యాయ చక్రము ద్రిప్పుచుండు బుద్ధ భగవానుని గొప్ప విగ్రహము గూడ గలదనియు దానవి చూచినట్లను దెలుపుచున్నాడు. ఆ కాలమున నీ విహారమున బదియైదు వందల మఠగురువు లున్నటులను దాను జూచినట్లును హుయానుత్సాంగు వ్రాయుచున్నాడు.

ఇ. బి. హావెల్ అను నతడు ౭ వ శతాబ్దములోని బౌద్ధా దర్శములు,—హైందవా దర్శములు,—ఈ రెంటి యథార్థ్యమును గనుగొనెను. ఈ యుగమునకు ముందు హిందూ కళా దర్శములను, అందలి యుత్తమ విజ్ఞానమును హిందువుల రాజ్యప్రాప్తియు నితడు కనిపెట్టెను. ప్రభుత్వమువారు రాకపోకల సాధనములను జక్కగా జేకూర్చిరి. ప్రతినగరమునను నాలు ముఖ్యమయిన బాట లుండవలయును. ప్రతి గ్రామము మీదుగను నుత్తర దక్షిణములుగ నొకటియు బూర్వ పడమరలుగ నొకటియు రెండేసి బాటలు పోయెడివి. చంద్రగుప్తుని కాలమున దేశమంతయు జక్కని బాటలతో నిండి యుండెను. ఉత్తర దక్షిణములుగ బోవు బాట 'మహాకాల' యనియు బూర్వ పడమరలుగ బోవు బాట 'రాజపథ' మనియు బిలువ బడుచుండెను. 'మహాకాల' యను బాట వాణిజ్య సౌకర్యమున కనియు 'రాజపథ' మను బాట సైనికశాఖ సంచారముల కనియు నిర్దేశింప బడినవి. 'రాజపథము' పాటలీపుత్రము నుండి తిన్నగ బశ్చిమ సరిహద్దులకు దక్షశిలా నగర ప్రాంతములకు బోయినది. చంద్రగుప్తుని కాలమున బాటలు వేయుటకును బాడువడిన బావులను బాగు చేయించుటకును ప్రత్యేకముగ నుద్యోగులు గలరు. ప్రతి పట్టణమునను నాలు పెద్దబాట లుండవలయును. ఇవి గాక ముప్పది రెండు మూరల వెడలుపుగల చిన్ని బాటలును అంతకు దక్కువ వెడలుపుగల బాటలును బెక్కులుండెను. అన్ని ప్రదేశముల నుండియు బ్రజలు రాజధానికి బోవుటకు దగిన రాధారి మార్గములును ఇతర చిన్న పట్టణములకు బోవుటకు గూడ మార్గము లేర్పడి యుండెను. ముఖ్యమార్గములను 'రాజమార్గము' లని బిలుతురు. ఇతర మార్గములను వీధులనియు బ్రోవలనియు నందురని శుక్రనీతియందు మొదటి యధ్యాయమున జెప్పబడినది. స్ట్రాబో అను నతడు మెగస్తనీసు యొక్క అభిప్రాయము ననుకరించెను. 'బాటలను వేయుదురనియు బ్రతి పది ఫర్లాంగుల కొక రాయిని దూరమును దెలుపుటకును మార్గమును సూచించుటకును బాతిరనియు జాణక్యుడు చెప్పుచున్నాడు. I Friagment, XXXIV) అశోకుడు ప్రజల యుపయోగార్థమయి బాటల కిరువంకల వృక్షముల నాటించెను. మామిడి తోపులను వేయించెను. ప్రతి యర్ధ క్రోశమునకును బావులను ద్రవ్వించెను. విశ్రాంతి గృహము



లను గట్టించి వ్యాధిగ్రస్తులగు మానవుల యొక్కయు జంతువుల యొక్కయు నుపయోగమునకు ధర్మ చికిత్సాలయముల నేర్పరచెనని యశోకుని ప్రకటనముల వలనను శుక్రనీతి నాలవ యధ్యాయము వలనను దెలియుచున్నది. ఫిరోజి తుగ్లకు అను నతడు ప్రజోపయోగము కయి నలువది మసీదులను ముప్పది పాఠశాలలను నూరు ధర్మశాలలను ఇన్నూఱు పట్టణములను నూరు సమస్త ప్రజలు స్నానముచేయుట కుపయోగించు గృహములను నిరువది రాజమందిరములను నూరు చికిత్సాలయములును ఐది నక్షత్రశాలలను ఐది పెద్ద బావులను ముప్పది చెరువులను నూటయేబది వంతెనలను ఏబది ఆనకట్టలను,—ఇవి గాక గొప్ప కాలువలను త్రవ్వించెను. ఇతడు యమునా నది నుండి యొక కాలువను త్రవ్వించి దానిని పానిపట్టువద్ద బికనీరు మరు స్థలములలోని 'హాంసీ, హిసారు' లను గ్రామముల వరకు బ్రవహించునట్లు జేసెను. ఈ కాలువ నహ్ర్ హిందుమర్ నూర్ ప్రాంతమున బ్రజకు మిగుల నుపయోగముగ నుండెను. దీనిని త్రవ్వునపుడు ౫౦ వేల ప్రజలు పని చేయుచుండిరి. (మహమ్మదీయ మహాయుగము, పుట ౫౯) ద్రావిడ దేశమునకు రాజధాని యగు కాంచీపురము పది పండ్రెండు మైళ్ళ వైశాల్యముగల పట్టణమనియు దేశములో నూరు బౌద్ధ సంఘారామములును బదివేవురు బౌద్ధ మఠాచార్యులును గలరనియు సింహళ దేశ వాస్తవ్యుల వలెనే యీ మఠాచార్యులలో బెక్కురు స్థావిర విద్యాలయమునకు జేరిన మహాయన శాఖా సంబంధులనియు హిందువుల దేవాలయము లెనుబది మాత్రమే యుండెననియు దక్షిణ హిందూస్థానము నందలి దక్షిణ దిగ్భాగమున నున్న యట్లు దిగంబర జైన సన్న్యాసులు గూడ వేనవేలుండిరనియు హుయానుత్సాంగు చెప్పుచున్నాడు.

క్రీ. శ. ౬౦౩ లో ఘూర్జర దేశపు రాజు ఏడువేల ప్రజలను దీసికొని సయాం, జావా ద్వీపములకు బోయి బౌద్ధ మతమును వ్యాపింపజేసెను. 'ఓంకారవాద' యను గొప్ప దేవాలయము మూడు మైళ్ళ వైశాల్యము గలిగి ప్రపంచ మందలి కట్టడము లన్నిటను మిన్నయని చెప్పబడినది. ఈ యాలయ కుడ్యములపయి రామాయణములోని ప్రతిమలు చెక్కబడి యున్నవి. వాని ప్రక్కనే బౌద్ధమత సంబంధమగు ప్రతిమలు గూడ చెక్కబడి యుండుటను బట్టి యీ యాలయము పూర్తి యగుటకు ముందే ఆ ప్రాంతమున బౌద్ధమతము వ్యాప్తియైనదని తెలియగలదు. పంజాబులో నేకరథుడను వాడు సహస్ర పట్టణముల కధిపతి యట! విపాశి నది యొద్ద బదియైదు వందల పట్టణములు గలవని తెలియుచున్నది. అలగ్జాండరు దండయాత్ర కాలమున విపాశ నదీ మధ్య భాగమున బదియైదు వందల పట్టణము లున్నవని 'అప్పల్లో దోరను' అను గ్రీకు చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. చాళుక్య వంశమణి యగు రెండవ పులకేశి యను వాడు దక్కనులోని 'కాలదాగి' మండలమున 'అహోలి' యను గ్రామమున నొక జైన దేవాలయమును గట్టించెను. పాలింబోత్ర పట్టణమున (ఇదియే పాటలిపుత్రము) చికిత్సాలయము లనేకము లున్నట్లును ఇతర దేశముల నుండి వ్యాధి

తులు వచ్చి యౌషధమును సేవించుచుండిరనియు భిషగ్వరులు వ్యాధితుల నెప్పుడును గాపాడుచుందురనియు నౌషధము సేవించు కాలమున వ్యాధితు లుండుటకయి చక్కని వసతులు గలవనియు నౌషధ ముపయోగించుటయే గాక అన్నవస్త్రము లిచ్చి వ్యాధులు కుదిరిన పిదప వారి నింటికి కంపుచుందురనియు ఫాహియాన్ వ్రాయుచున్నాఁడు. ఇప్పటికి మూఁడువేల మూఁడువందల యేండ్లకిత్రితము 'సమరీసు' అను యువతీమణి అస్సిరియా రాజ్యమును మిగుల వైభవముతో నేలినది. ఆ సమయమున రాజహర్మ్యముల నెంటిని నిర్మించినది. ఈమె యనంతరము తొమ్మిది వందల యేండ్లకు ఆ హర్మ్యము లందే అలగ్జాండరు గతించెను. ఈ యమ యూఫ్రటీసు నదిమీఁద వంతెనఁ గట్టించినది. భూమిలోఁ గుండా తూములను బెట్టించి నదిలోని నీరును దన రాజభవనములలోనికిఁ దెప్పించినది. ఈమె రెండువేల పడవలను దీసికొని సింధునది యందు దండు విడిచినప్పు డార్యులు యుద్ధసన్నద్ధమగు నాలుగువేల పడవలను సమకూర్చి సింధునదిలో నుంచిరి. ఆ దినములలోఁ బడవలకుఁ గొదువ లేదు. 3300 ఏండ్లకుఁ బైఁగా సింధునది యం దేవేళ చూచినను నలువదివేల పడవలు నడచుచుండెనని తెలియుచున్నది. లంక యందలి దుర్గముల గుఱించి హనుమంతుఁడు రామునితోఁ జెప్పిన సందర్భమును గమనింపుఁడు.

శ్లో. నియుజ్యమానాస్తు గజాస్సుహస్తా । స్సకేసరాశ్చోత్పల పత్రహస్తాః ।
బభూవ దేవీచ కృతాసుహస్తా । లక్ష్మీ స్తథా పద్మిని పద్మహస్తా ॥
(సుందరాకాండ, ౭ వ సర్గ.)

ఇట్టి విచిత్రమును గనుఁగొనెను. దీనివలన నా కాలమున శిల్ప మెంత వృద్ధియం దుండెనో యెఱుఁగనగు. దశరథుని కాలమున వివిధ ప్రదేశములనుండి రాయబారు లయోధ్యా నగరమునకు వచ్చి నివసించుచున్నట్లు రామాయణమునఁ గలదు. శ్రీరామచంద్రుని తనయుఁడగు కుశునివంశీయుఁడయిన వజ్రనాభుఁడు రాజ్యము చేయు కాలమున దుర్గమొకటి కట్టించి 'రామసేతువు' అను నుత్సవ మొకదాని నేర్పఱచెను. మధురాపట్టణముయొక్క కోట వాకిండ్లను రోమనులు సంరక్షించుచుండిరి. మయుఁడు నిర్మించిన సభ యందలి ప్రమాని కంబములు బంగరు మయములు. చుట్టును బదివేల మూరలు విస్తీర్ణ ముండెను. సూర్య కిరణములను దన కాంతులచేఁ దూలించి యాకాశ మంటి నీటు గులుకుచున్న రత్నమయము లయిన వప్రములును వెలుపలి ద్వారములును గలిగి యుచ్చావచ చిత్రములతో రాణించుచుండెను. అందు మయుఁడు తామరకొలఁకు నొకదాని నేర్పఱచెను. ఆ కొలఁకునకుఁ బలువన్నెలుగల పటికపు జాలతో మెట్టు లమర్చఁబడెను. మందిరము లెట్లు నిర్మింపవలయునో విగ్రహము లెట్లు చెక్కవలయునో చిత్రపటము లెట్టు వ్రాయవలయునో దెలుపు శాస్త్రము లనేకము లున్నవి. అట్టి శిల్పశాస్త్రజ్ఞులలో నాగ్నజిత్తుఁడనువాఁడు ముఖ్యుఁడు. క్రీ. శ. ౭౫౦-౮౦౦ సం॥ రముల ప్రాంతమున నిర్మింపఁబడిన 'బోరబోదూరు' దేవాలయము వంటి దీలోకమున మఱి



యొకటి లేదని చెప్పుదురు. ప్రేమబాణములోని యాలయముఁగూడ మిగుల చిత్రముగ నున్నదనియుఁ దా నిదివఱకు నెచ్చటను జూడలేదనియు సర్ సటాంఫర్డు రాఫిల్సు అను గవర్నరు చెప్పుచున్నాఁడు. కావేరి నది యుత్తర ముఖద్వారమునఁ గావేరి పట్టణము రెండు భాగములుగ నున్నది. అందొక భాగము 'మరువంపాక' మను పేరితో సముద్రతీరమునఁ గట్టఁబడి యున్నది. ఈ భాగమున నితర ప్రాంతముల నుండి వచ్చిన సామగ్రి యుంచుటకయి యుగ్రాణములును వేదికలును బెక్కులు గట్టఁబడి యున్నవి. (రాధాకుముద ముఖర్జీగారి ప్రాచీన నౌకాజీవనము) షాహజహాన్ చక్రవర్తి ప్రపంచమందలి కట్టడములలో శోభకును నందమునకును గళావిన్యాసమునకును మిన్నయని పేర్వడసిన 'తాజమహాలు' భవనమును గట్టించెను. షర్షాకాలమునఁ దన ప్రభుత్వమునం దన్ని దిశలను అశోకుఁడు మొదలగు పూర్వరాజన్యులవలె రాచబాటలను వేయించియు మార్గముల ప్రక్క వృక్షములు నాటించియు విశ్రాంతి గృహములఁ గట్టించియుఁ బ్రఖ్యాతిఁ జెందెను. కలకత్తానుండి సింధు దేశము వఱకును నితఁడు వేయించిన రాచబాట యిప్పటికిని గలదు.

బాటలు తాబేలు నడుమువలె నుండుననియు బాటకు నిరుప్రక్కల మురుగునీటి కాలువ లుండుననియు శుక్రనీతియందు వ్రాయఁబడియున్నది. 'మానసార' యను గ్రంథమున మండలవీధి, రాజపథ, సంధిపథ, మహాకాల యను నాలుగు రకముల బాటలు పట్టణములలోను బల్లెలలోను నుండునని వ్రాయఁబడియున్నది. బాటలప్రక్కను ద్రోవఁజూపు స్తూపము లేర్పఱుపఁబడినవని మెగస్తనీసు వాక్యములలో ౩౮ వ వాక్యము సూచించుచున్నది. చిన్న సెలయేళ్ళమీఁదను గాలువలమీఁదను శాశ్వతముగ నుండు నటులు ఱాయితోఁగాని కొయ్యతోఁగాని వంతెనలు గట్టఁబడును. పెద్ద నదులను దాటుటకు వంతెనలకు బదులు పడవ లేర్పఱుతురు. నదులమీఁద బహురకముల వంతెనలును వంతెనలు లేని ప్రాంతమున దాఁటుటకయి పడవలును ఇతర సాధనములును గలవనియు శుక్రనీతియందలి నాలవ యధ్యాయమునఁ జెప్పఁబడినది. వానరులు సేతువుఁ గట్టునపుడు ఇష్టమువచ్చిన ప్రాల్చుటకును లేవ నెత్తుటకును అనుకూలముగ నుండు పలకల వంతెనల వైచిరని తెలియుచున్నది.

అందుఁ గపులుఁ గొంద ఱలవు మీఱ
కొండగములఁ బెఱికి దండి యంత్రంబుల
నునిచి తెచ్చి రప్పు డుదధి కడకు.
(ఆంధ్ర వాల్మీకి రామాయణము.)

మహారాష్ట్ర నౌకాధ్యక్షుఁడగు కనోజి అంగ్రియా యను నతఁడు పెక్కు నౌకాయుద్ధములఁ జేసి ప్రసిద్ధి వడసెను. ఇతనికి 'ధైర్యసారంగుఁ' డని బిరుదము గలదు. శివాజి మహారాజు విజయదుర్గము, కలబా, సింధువర్గము, రత్నగిరి, అంజన్వేలా, రేవు

లలో నౌకలను నిర్మింపఁ బ్రయత్నించెను. ఔరంగజేబు చక్రవర్తి మక్కా పోవు యాత్రికుల యుపయోగమునకయి నాలుగు గొప్ప నౌకలను నిరంతరము సూరతు నొద్ద సిద్ధముగ నుంచి యుండెను. ఆ నౌకలలో నొక దానిని 'ఎవెరీ' యను ఓడ దొంగ దోచుకొనఁగా లక్ష డెబ్బదివేల రూపాయలు దొరకిన వఁట! గంజ్ సువే యను నౌక పయి నెనిమిది పెద్ద ఫిరంగులును నాలుగు వందల తుపాకులును గలవనియు నితరుల సాహాయ్యము లేకుండ స్వేచ్ఛగా మక్కా, జెడ్డా, ప్రదేశములకుఁ బోవుచుండెడి దనియుఁ దెలియుచున్నది.

క్షేమేంద్రుఁడు రచియించిన 'బోధి సత్యావేదాంత కల్పలత' యను గ్రంథమునఁ బాటలీపుత్రమునకును ఇతర ప్రదేశములకును బోయి వచ్చిన దేశీయ వర్తకుల యోగక్షేమములను అశోకుఁడు విచారించుచున్నటులు వ్రాయఁబడియున్నది. బంగాళాఖాతము నొడ్డున నొక్క మచిలీపట్టణము నుండియే నౌకలు తూర్పుగాఁ బ్రయాణము చేసి బెంగాలు, సయాం, సుమిత్ర, అరకాను, పెగు, కొచ్చించైనా, మనిల్లాదీవులు, మఖ, మెడగాస్కరు వఱకును బోవుచుండెనని 'టావర్నియరు' అను నతఁడు వ్రాసినాఁడు. మౌర్య చక్రవర్తుల పరిపాలనమున నౌకానిర్మాణము మిగులఁ బ్రాముఖ్యత వడసినది. నౌకల నడపువృత్తి యందున్న వారిని ప్రభుత్వమువారి సేనావర్గములోని వారిగఁ బరిగణించిరనియు వారు సామాన్య ప్రజలఁ బనులు చేయువారు గారనియు మెగస్తనీసు చెప్పుచున్నాఁడు. 'యుక్తి కల్పతరువు' అను గ్రంథమునఁ బండిత రాజేంద్రలాలు మిత్రాగారు చక్కఁగా విమర్శించిరి. ఈ గ్రంథము కలకత్తా సంస్కృత కళాశాల యందలి గ్రంథాలయమునఁ గలదు. ఇయ్యది భోజమహీపతిచే సార్జింపఁ బడినది. దీనిలో ఖడ్గములు, నగలు, ధ్వజములు, పీఠములు, నౌకలు, ఆతపత్రములు, గుఱ్ఱములు, ఏనుఁగులు,— మొదలగు వాని ప్రశంసయుండెను. సుళువుగనుండి దారువుతో మిశ్రమ మొనర్చుట కనుకూలముగనున్న మృదువయిన కొయ్య బ్రాహ్మణ జాతి దనియు, సుళువుగ నుండి కటువుఁగలదయి యితర కొయ్యతో నతుకనది క్షత్రియజాతిదనియు, సుళువుగను మృదువుగను నుండు కొయ్యను వైశ్యజాతిదనియుఁ, గటిగను మృదువుగను నుండు కొయ్యను శూద్రజాతి దనియు, 'వృక్షాయుర్వేద' మను గ్రంథమునఁ జెప్పఁబడినది. భోజుని యభిప్రాయము ననుసరించి క్షత్రియజాతి కొయ్యతోఁ జేయఁబడిన నౌకలు విశేషకాల ముండునని తెలియుచున్నది. ఇట్టి నౌకలలో 'తుగ్రఋషి' తన కుమారుఁడగు భుజ్యుని శాత్రవకంఠ లుంఠన మొనర్పఁ బంపెననియు నతని నౌక నదీ మధ్యమున విచ్ఛిత్తయి భంగపడ నశ్వినీ దేవతలు వానిని రక్షించినట్టును ఋగ్వేదమున నభివర్ణింపఁ బడినది. విదురుని సలహా ననుసరించి పాండవు లొకప్పుడు ఈ రకపుఁ బడవలలోఁ బ్రయాణముచేసి కౌరవులఁ బారినుండి తప్పించుకొని పోయినట్లును మహాభారతమున వాకొనఁ బడినది. ఈ రకపు ౫ వందల నౌకలలోఁ గైవర్తకులు దాగియుండి శత్రువులను దటాలున ముట్టడించినట్లు అయోధ్యా కాండలో వివరింపఁ బడియెను. రఘుమహా



రాజు గొప్ప నావికా సైన్యముతో వచ్చిన వంగదేశపు ప్రభువుల నోడించి గంగానది యందు జయస్తంభములను గట్టించెను. శ్లో. వంగానుత్ఖాయ తరసా నేతా నౌసాధనోద్యతాన్ । నిచఖాన జయస్తంభాన్ గంగాస్రోతోంతరేషు సః ॥ (రఘువంశము, నాలవ సర్గ.) మహారాజగు కుశుఁడు సరయూనదీ తీరమున సైన్య శిబిరము నేర్పఱచి యానది యందలి నక్రములు మొదలగు భయంకర జంతువులను జాలములతోఁ దొలఁగించెనని రఘువంశమునఁ జెప్పఁబడినది. జలకేళీ నియమములు సైతము ప్రాచీన గ్రంథముల యందుఁ గలవు. కామందకుఁడను కవి జలవిహారము క్రిందివిధముగ నభివర్ణించెను. 'గ్రీష్మర్తువునందు సెగఁగొట్టు దినము నదీ తీరమున విశ్వసనీయులగు సైనికులను సామంతులను జూపుమేర దూరమునందుంచి మీవ నక్రాది జంతువులు లేని తీర్థమున సుహృద్గణముతోడ జలకేళి కయి నదియందుఁ బ్రవేశింపవలయు' నని కామందకుఁడు వర్ణించెను. కాళిదాస మహాకవి వ్రాఁతలను జూచిన యెడల జలకేళి సలుపువారి సందర్భమును బట్టి మారుచుండునని తెలియుచున్నది. మహారాజగు కుశుఁడు విష్ణుదేవుని యపరావతారుఁడగు ప్రభువుగనుండెను. కుశ మహారాజు జలకేళి సల్పునప్పుడు విమానమువంటి నౌక లుపయోగింపఁబడెను. శ్రీమద్భాగవతమున దేవహూతి కర్దముని విహారమున కేర్పడిన 'కామచారీ' విమాన వర్ణనను వలన దేవయానమునకును సప్తభూమికా భవనమునకును సాదృశ్య మధికముగ నుండెను. రెంటి యందును అం[illegible]వులు గలవు. విహారస్థానము, శయనగృహము మొదలగునవి యున్నవి. బౌద్ధ వాఙ్మయమున జలవిహార ప్రసంగ సందర్భమున విమానమును బోలిన నౌకలను గూర్చిన వర్ణనలు గానవగును. బుద్ధుని తల్లియగు 'సుదీపాదేవి' కల్హారమున సఖులతో నౌక యెక్కి జలక్రీడ యొనర్చెనని యున్నది. కాదంబరియందుఁ 'దారపీడ' మహీపాలుని భవనదీర్ఘికయందు అంతఃకాంతలు విహార మొనర్చినటులఁ గనిపించుచున్నది. అచ్చటి క్రీడాసాధనములలో నౌకలున్నటులఁ గనిపించవు పురాణములలోఁ గార్తవీర్యుఁడు మొదలగువారు జలవిహార మొనర్చినట్లుఁ గనిపించుచున్నది.

'రాజవల్లి' యను గ్రంథమున వంగదేశ ప్రభువగు సింహబాహువు తన కుమారుఁడగు విజయుఁడను వానిని ఏడు వందల పరివారముతో సముద్రము పయిఁ బ్రయాణము చేయించినటులు వ్రాయఁబడియున్నది. జంబూ ద్వీపమునుండి సింహళుఁడను రాకుమారుఁడు లంకకుఁ బోయెనఁట! వానితోఁ గూడ నెనిమిది వందల మందియొక యోడలోఁ బ్రయాణము చేసిరని తెలియుచున్నది. జనకజాతకము, వాలహస్స జాతకము, సముద్ర వణిజ జాతకము, శంఖ జాతకము, మహాజనక జాతకములం దిట్టి నౌకలను గూర్చిన వివరము లనేకము లున్నవి. శంఖ జాతకములో నొక నావ యెనిమిది వందల మూరల పొడవును, ౬ వందల మూరల వెడలుపును ౨౦ నిలువుల యెత్తును నున్నటులు వర్ణింపఁ బడినది. బర్మానుండి తపూస, పాలికతుఁడను నిరువురు వైశ్యులు ౫ వందల బండ్ల సరకులను దీసికొని యొక నావలో నితరులతోఁ బాటు బం

గాళా ఖాతమునఁ బ్రయాణము చేసినటులు, 'గోదమ' జీవితమున వ్రాయఁబడినది. క్రీ. శ. ౪౯౫ సం॥ రమున సింహళదేశపు రాజగు, 'మొగల్లనుఁడు' జాతీయ నావికా సైన్యము నేర్పాటు చేసెను. క్రీ. శ. ౬౦౮ సం॥ రమున సింహళము ప్రభువు చీనా నుండి రాయబారులు వచ్చుచున్న యోడ నెదుర్కొనుటకుఁ, 'గ్యుమెటో' యను బ్రాహ్మణుని ముప్పది పడవల నిచ్చి పంపెనని చీనా చరిత్రమునఁ జెప్పఁబడినది. క్రీ. శ. ౧౨ వ శతాబ్దమునఁ బ్రథమ ప్రక్రమ సింహుఁడు విదేశ విజయమున కయి యైదు మాసములలో వందలకొలఁది పడవల నేర్పాటు చేసెను. అని శకుఁడు యవన ద్వీపమును గూర్చి వ్రాసిన చరిత్రమును దన కుమారున కిచ్చి యతని నైదువేల పరిజనులతో యవద్వీపమున కంపెను. కుమారుని వెంటఁ బంపిన పరిజనులలో వ్యవసాయ శాస్త్రజ్ఞులును, భిషగ్వరులును, శిల్పులును, యుద్ధ శాస్త్ర పారంగతులును, సమర్థులగు లేఖకులును గలరు. వీరందఱును ఆఱు ఓడలలోను నూటయాఱు చిన్ని పడవల లోను బ్రయాణ మొనర్చిరఁట!

క్రీ. శ. ప్రథమ శతాబ్దమున, 'అజిశాఖ' యను నతఁడు కాళింగ ప్రాంతమునకుఁ జనుదెంచెననియు, నచ్చటనుండు, 'పాలూరు' నావికా యాత్రకుఁ బ్రారంభ ప్రదేశమనియు, 'టాల్మీ' గారు చెప్పుచున్నారు. 'సుల్తానుఫాజు' అను వాఁడు విద్యాధికుఁడును బండితాదరణ కలవాఁడును నగుటవలన అశోకునిచేఁ గట్టింపఁబడిన స్తంభములను బాడుచేయక డిల్లీకిఁ గొంపోయి దేశములోని శైథిల్యావస్థ యందున్న ముఖ్య భవనములను దిరుగఁ గట్టించియు డిల్లీలోని జుమ్మామసీదును మరమ్మతు చేయించియుఁ బాలన మొనర్చెను. ఇతఁడు ఫిరోజాబాదులో, 'ఫిరోజిషామద్రసను' నేర్పాటుఁ జేసెను. ఇయ్యది మిగుల సుందరారామముల నడుమ నేర్పఱుపఁ బడినది. ఈ ప్రదేశము ధ్యానయోగుల కత్యంత సుఖప్రదము. మందిరము ప్రక్కను దివ్యదీప్తితో వెలుఁగు నొక చెఱువున్నదని, 'యెల్లా' గారు వ్రాసియున్నారు. 'మద్రస' మనఁగా మహమ్మదీయ కళాశాల. దక్షిణ హిందూస్థానములోని బిజాపురమునకుఁ జాళుక్యవంశ్యుఁడగు రెండవ సోమేశ్వరుని శాసనమున, 'విజయపుర' మని పేర్కొండు నామ మున్నటులు వ్రాయఁబడి యున్నది. చాళుక్య రాజుల కీర్తి జ్యోత్స్నకు నిరుపమానములగు హిందూకళాభవనములు కొంతకుఁ గొంత విశీర్ణమయి యున్నది. మహమ్మదీయుల స్వాధీనమైన పిదప, 'ఆదిల్ శాహా' యను నతఁడు తన శవమునుంచుటకయి, 'గోల్ గుమ్మజు' కట్టడమును గట్టించెను. ఈ కట్టడము యెత్తు భూమట్టమునుండి నూట తొంబది యెనిమిది యడుగుల తొమ్మిదంగుళములను, ౧౩౫ చదరపు టడుగుల యెడఁగుళముల వైశాల్యమును, ఆఱడుగులు మొదలు పది యడుగుల వఱకు మందము నున్నది. ఈ పురమున నిది యొక్కటియే శిల్పకళా ప్రాశస్త్యమును బ్రకటించుచున్నది. ఈ కట్టడమునకు రోము దేశమునందలి సుప్రసిద్ధమగు, 'పైథియన్' మందిరము కూడ సమము కాదనియే చెప్పవచ్చును. బిజాపుర దుర్గమయు రాజసౌధము లొం



బదియాఱు బురుజులతోడను, బ్రధానములగు నైదు సింహద్వారములతోడను, నలు కలంకుల ప్రహరీల తోడను, నిర్మింపఁబడినది. కోటయందలి, 'శాహీమహాలు' ను ఆంగ్లేయ విద్వాంసుఁ డొకఁడు పరికించి తన్మయుఁడయి యిట్లు వ్రాసెను. 'ఇది వైశాల్యమునను శిల్పకళా విన్యాసమునను బ్రసిద్ధి వడసినది. యూరపుఖండమున ప్రాచీనాధునాతనములగు కట్టడములలో నీ కట్టడమునకుఁ దుల్యమైనది కానరాదు. ఈ కట్టడములోని భోజన గృహము యూరపుఖండమందలి ప్రసిద్ధి వహించిన, 'రీగగల్ కౌన్సిల్' యొక్క భోజన గృహమునకు మూఁడింత లధిక వైశాల్యము గలిగియున్న' దని వ్రాసినాఁడు. 'ముబారక్ ఖాన్ మహాలు' కు నీటి గొట్టముల ద్వారమున నీటిని బ్రవహింపఁ జేసి యున్నారు. ఈ విధముగ బిజాపురములోని ప్రతి యింటికిని గొట్టముల ద్వారమున నీరు సప్లయి అగుచుండెను. 'శాహీమహాలు' లోనికిఁ గూడ నీటి గొట్టము లమర్పఁబడినవి. ఇప్పటికి నట్టి చిహ్నములు గానవచ్చుచున్నవి. బిజాపురమునకు వెలుపల నున్న బేగము చెఱువునుండి నీటి గొట్టము లేర్పఱచి నీరు పారించినటులు గొన్ని చిహ్నము లాడనాడఁ గనిపించుచున్నవి.

అతి ప్రాచీనము నుండియు భారత వర్షమున వ్యవసాయము చేయఁబడుచుండెను. ఋగ్వేదమునఁ గాలువలను గూర్చి వ్రాయఁబడినది. నారద మహర్షి యుధిష్ఠిరుని యొద్దకుఁ బోయి అతని రాజ్య స్థితినిఁ గనుఁగొనుచు నిట్లు ప్రశ్నించెను. 'ఓ రాజా! సేద్యము సేయువారు తృప్తి కలిగి చేరెడు విత్తనము నష్టిఁ బొందక వ్యవసాయము చేయుచున్నారా? రాజ్యమున సమతలములందుఁ గొలఁకు లేర్పడి యుండెనా? నీరు నిండియున్న గొప్ప చెఱువు లాయా ప్రదేశములఁ గలవా?' యని ప్రశ్నించినటులు మహాభారతమున సభా పర్వమునఁ జెప్పఁబడినది. మనువుకూడ నీ విధముగనే చెప్పుచున్నాఁడు. అగ్ని పురాణము ననుసరించి నీటి సప్లయి వలన వ్యవసాయ కార్యములు సక్రమముగ నెరవేరుచున్నట్లు తెలియుచున్నది. (అగ్ని పురాణము ౬౪ వ యధ్యాయము.) తటాకములు, కొలఁకులు, కాలువలు,—మొదలగు వాని పరిపాలనము ప్రధాన ప్రభుత్వాయత్త శాఖా యధీనమున నుండెను. పదియైదవ శతాబ్ద ప్రారంభమున దర్శి పట్టణమున కేలికయగు, 'ఆసనదేవ మహారాజు' తన తల్లి యగు, 'ఆర్యమదేవి' పేరితో నొక చెఱువును ద్రవ్వించి క్రీ. శ. ౧౪౩౫-౩౬ సం॥ రములలో నొక శాసనమును వ్రాయించెను. కృష్ణదేవరాయల పిదప విజయనగరమును క్రీ. శ. ౧౫౩౦, ౧౫౪౨ సం॥ రములలో బాలించిన అచ్యుతరాయలకు మంత్రిలుగను గొండవీడునకుఁ బ్రభువులుగను నుండిన రామయమంత్రి పదునాఱు తటాకములను నిర్మించెనని శాసనముల వలనఁ దెలియుచున్నది. ప్రతాప యల్లార్యుని ధర్మపత్నియు రామయమంత్రి భాస్కరుని చెల్లెలును నగు చిన్నమాంబ సాతలూరు నొద్ద పర్వతనాథుని పేర నొక శివాలయమును, గట్టించి, 'గోపినాథ సముద్ర' మను పేర నొక చెఱువును ద్రవ్వించెను. వెలుగోటి వేంకటపతినాయని యుత్తర్వు ననుసరించి చింతపట్ల రుద్రప్పనాయఁడు

కల్లూరి చెఱువునకు అలుగు 33 శిలాస్తంభములు నిలిపి రెండు ప్రక్కల 'సంతని సారువులు', 'సోపానములు' గట్టించినట్లు నెల్లూరు మండల శాసనమువలనఁ దెలియుచున్నది. క్రీ. శ. ౧౪౦౦ మొదలు ౧౪౨౦ వఱకుఁ గొండవీడును బాలించిన పెదకోమటి వేమారెడ్డి భార్యయును ధరణికోట కన్నమ నాయని కుమార్తెయు నగు 'సూరాంబ' యను నామె 'సంతాన సాగర' మను గొప్ప తటాకమును ద్రవ్వించెను. మగధ సింహాసనమును జంద్రగుప్తుఁ డధిష్ఠించుటకుఁ బూర్వము 'నందుఁడు' ఒక జలాశయమును నిర్మించెనని హాత్తి గుంఫ శాసనము వలనఁ దెలియుచున్నది. క్రీ. శ. ౮౫౫-౮౮౩ సం॥ రములలోఁ గాశ్మీరమునకుఁ బ్రభువుగ నుండిన అవంతివర్మకు మంత్రిగ నుండిన 'సుయ్యా' అనువాని వ్యవసాయ కార్యములను గూర్చిన లెక్క విపులముగ గల్హణ పండితుని 'రాజ తరంగిణి' యను గ్రంథమునఁ గనిపించుచున్నది. కాశ్మీరములోని కొన్ని ప్రాంతములు గొప్ప వరదలచే ముంపఁబడినవి. సంవత్సరమునకుఁ దొమ్మిది మాసములు తక్కిన ప్రాంతములు వెల్లువతోఁ గప్పఁబడినవి. కాశ్మీర దేశ మంత్రి యగు 'సుయ్యా' అను నతఁడు వఱదల కొఱకుఁ గందకములను ద్రవ్వించెను. బావుల భూములు లేకుండఁ జేసెను. నదీ జలమును వృథఁ బుచ్చక కాలువలను ద్రవ్వించి భూములను సస్యసంభరితముల నొనర్చెను. చాల కాలమునుండి వర్షాధారమున నాధారపడి యుండిన భూములకు నీటిని సప్లయి చేసెను. నీటి పారుదల విషయమయి పర్యాలోచించి నిరాతంకముగఁ బ్రవహించు పద్ధతిని గనిపెట్టి దేశములోని అన్ని భాగములకును నీరును బ్రవహింపఁజేసి ఊషర క్షేత్రములను సారవంతములుగ నొనర్చెను.

ఉత్తర హిందూస్థానము నేలిన షర్షా కాలమున దేశము విశేషముగ నభివృద్ధిఁ జెందెను. ప్రథమమున భూములను గొలిపించి భూమి వైశాల్యమును బట్టియు సారమును బట్టియుఁ బన్నులను విధించిన దీతఁడే! వ్యవసాయమునకు భంగ మొదవించిన వారు శిక్షార్హులగుచుండిరి. భారతీయుల యుపయోగమునకయి ప్రథమమున వెండినాణెమగు రూపాయిని ఉపయోగించిన దీతఁడే! ఫ్రెంచిబాటసారి యగు 'టావర్నియరు' అను నతఁడు షాహజహాన్ కాలమున మొగలాయి ప్రభుత్వమున కిరువది రెండు కోట్ల రూపాయలు ఆదాయము వచ్చుచుండెననియుఁ, దండ్రి బిడ్డలకుంబలెఁ బ్రజలకును—ఇతనికిని,—అట్టి సంబంధ ముండెననియు, వ్రాయుచున్నాఁడు. ఔరంగజేబు చక్రవర్తి పరిపాలనమునఁ బ్రభుత్వాదాయము సాలుకుఁ దొంబదికోట్ల రూపాయలుండెననియుఁ బ్రజలకయి విశేషముగ వ్యయపెట్టుటవలన షాదుషా చరమదశయందు అనఁగా మరణ సమయమున బొక్కసమునందుఁ బదునాఱు లక్షల రూపాయలుండెననియు మహమ్మదీయ మహా యుగమున వ్రాయఁబడి యున్నది. (౧౫౩ వ పుట.) ఈ యాదాయమున నలువదిమూఁడు కోట్ల రూపాయలు భూమి పన్ను మూలమునను ఏఁబది యేడు కోట్ల రూపాయలు ఇతర సుంకముల మూలమునను లభ్యమగుచుండెను. పదునాఱవ శతాబ్ద



మున నాంధ్ర రాజులు తుంగభద్రానది మీద ఆనకట్టను గట్టించి కాలువలు, చెఱువులు, త్రవ్వించిరనియు నొక సరస్సు నిర్మించుటకుఁ బదియైదు లేక ఇరువదివేల కూలీలు పని చేయుచుండిరనియు నా సమయమున నా ప్రదేశమంతయుఁ జీమలబారువలె నుండెననియుఁ 'నైయుస్' అను చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. సామాన్యముగ నదిలోని నీరుపయోగపడునట్లు నీటి పాఱుదల సాధనము లన్వేషించి యేర్పాటుచేయఁ గల యంత్రశాస్త్రజ్ఞులా కాలమున నున్నట్లుఁ దెలియుచున్నది. రాజపుత్ర రాజులు గూడ క్షామ నివారణకయి మిగుల శ్రద్ధ వహించిరి. రాజసింహుని రాజ్యకాలమునఁ గ్రీస్తు శకము ౧౬౬౧ సం॥ రమున గొప్ప కఱవు తటస్థించెను. ఆ సమయమున బీదసాదలను రక్షించుటకును ముందట్టి కఱవులు రాకుండుటకును మిగుల విశాలమయి సుందరమయి యొప్పు నొక చెఱువును ద్రవ్వించి దానికి 'రాజ సముద్ర' మని పేరిడెను. 'రాజనగర' మను పట్టణమును గోట యొకటియుఁ గట్టించెను. ఈ పనులన్నిఁటికిని ౬౬ లక్షల రూపాయలు పట్టెనని తెలియుచున్నది. చిన్న రాజ్యమున కధిపతి యగు రాజసింహుఁడు కఱవు కాలమునఁ బ్రజలను రక్షింప దాదాపు కోటి రూపాయలను వ్యయపఱచెను. ఈతని ప్రజానురాగ మద్వితీయము గదా! పూర్వులు భారతీయులు వలసపోయిన సింహళము, సుమిత్ర, మున్నగు ప్రదేశములలో విశేషించి బౌద్ధమతము వ్యాప్తియందున్న కాలమున నిట్టి నిదర్శనము లనేకములు గనిపించును. సింహళము రాజులు రాజకీయ కార్య నిర్వహణమున నెక్కుడు శ్రద్ధ వహించిరి. ఎన్నియో బౌద్ధస్తూపముల నిర్మించి, అనేక విశ్రాంతి గృహములఁ గట్టించి, పాంథుల శ్రమ నివారణకయి వృక్షముల నాటించి పెంచిన పరాక్రమ బాహువు చరిత్రను జూచిన ఈ విషయము తెలియఁగలదు. ఈ పరాక్రమ బాహువు 'కారగంగ' యను నది కొక ఆనకట్టను గట్టించి దేశమునకును,—దేశీయులకును,—ఉపయుక్తమగునటులు గాలువలను ద్రవ్వించెను. వియద్గంగవలె నది యతి వేగముగఁ బ్రవహించుచుండెను. ఇతఁడు 'పరాక్రమ సముద్ర' మను నది త్రవ్వించి అందు సుప్రసిద్ధమగు 'జయగంగ' నుండి కాలువను గూడఁ ద్రవ్వించెను. ఈ విధముగ నితఁడు వ్యవసాయాభివృద్ధికయి ప్రయత్న మొనర్చెను. క్రీ. పూ. ౫౪౩ సం॥ రమున లంకకుఁ బోయిన విజయసింహుఁడును అతని వంశీయులును వ్యవసాయ విద్యను గొంపోయి అచ్చట జలాశయములును ఆనకట్టలును ఏర్పఱచి దేశమును సంపత్కరమగు నట్లు లొనర్చెను. అతి ప్రాచీన కాలముననె సింహళ ద్వీపము నౌకాశ్రయముగఁ బరిణమించినది. చంద్రగుప్త చక్రవర్తి తన రాజ్యమునఁ గాలువలను ద్రవ్వించి జలసమృద్ధి కలుగఁజేసి ప్రజల వ్యవసాయమును వృద్ధిఁ గావించుటకయి మిగుల శ్రద్ధ వహించెను. చెఱువులను ద్రవ్వించి ఆనకట్టలను గట్టించి కాలువలఁ ద్రవ్వించి వాని నుండి పిల్లకాలువలను దీయించి వానికిఁ దూములఁ బెట్టించి ఆ తూముల ద్వారమున నీరు క్రమముగఁ బాఱుచున్నదా లేదా యని పరిశీలించుటకయి అధికారుల నియమించి పని చేసెను. చంద్రగుప్తుని ప్రతినిధి పాలకులలో నొకఁడగు పుష్యగుప్తుఁడు పాటలీపుత్రమునకు వేయి మైళ్ళ దూరమున

నున్న 'గిరనారు' లోఁ బర్వతముల నుండి ప్రవహించు నొక యేటికి ఆనకట్టను గట్టించి అందలి నీటి నొక తటాకమునకు మఱల్చి చక్కని నీటి వసతి యేర్పఱచెను. దీనినే 'సుదర్శన' తటాక మనియెదరు. ఇది మనోహరముగ నుండును. ఇది మౌర్యగుప్త వంశ రాజులచే నెనిమిది వందలేండ్లవఱకును మంచి స్థితిలో నుంపఁబడినది. అశోకుని ప్రభుత్వమున నతని రాష్ట్రపాలకుఁడు (గవర్నరు) దీనిలోని నీరు వ్యవసాయమున కుపయోగపడుట కయి కాలువలను ద్రవ్వించెను. క్రీ. శ. ౧౫౦ సం॥ రమున నీ తటాకము 'రుద్రదమను' వలన మరమ్మతు కాఁబడెను. క్రీ. శ. ౫ వ శతాబ్దమున స్కంధగుప్తుని రాష్ట్రపాలకుఁడగు చక్రపాలితుని వలన ఈ తటాకము మఱల మరమ్మతు చేయఁబడెను. 'సంగ్యాన్' అను నతఁడు కాశ్మీర దేశములోని వ్యవసాయమును గూర్చి మాటాడుచు నిట్లు చెప్పెను. 'సకాలమున సెలయేటి నీరు పుష్కలముగ వచ్చినప్పుడే భూములు సాంవంతములుగ బాగు చేయఁబడి యున్నవో ఆ భూముల పయిని ఆ సెలయేటి నీరును బ్రవహింపఁ జేయును' రని చెప్పెను. శుక్రనీతి యందలి నాలవ యధ్యాయమునఁ 'గొలఁకులు, తటాకములు, కూపములు, కాలువలు విస్తారముగ నేర్పఱతురు గనుక దేశమున నే విధమగు క్షామములు లేకుండెను. ఆ చెఱువులను గాలువలను లోతుకన్న రెండింతలు గాని మూఁడింతలు గాని వెడల్పు ఉండు' నని వ్రాయఁబడినది. మహాభారతము శాంతి పర్వము ౧౪౧ అధ్యాయమున అనావృష్టి క్షామము వర్ణింపఁ బడియెను. భారతము నాంధ్రీకరించిన తిక్కన సోమయాజి తన తేటతెలుంగు బాస యందు ఎటులు వ్రాసెనో చూడుఁడు.

సీ. ఏటులఁ జెఱువులు నివురఁ గర్షనము లెం
దునుఁ జెడఁ దరులతొడులునుఁ గమర
భూమియుఁ బసమాల గోమహిషాది జీ
వధనంబు వొలియ భూవరులు మేర
దప్పె లోకములోని ధాన్యముల్ గొన నధ
ర్మం బంతకంతకుఁ బ్రబ్బ నధికు
లన దలఁ జెఱుపంగ యాగముల్ దేవతా
పూజలు నెడలంగ భూసుర ప్ర
ముఖులైన వర్ణముల చొప్పు దప్ప నా
హార రహిత జనము లపట నచటఁ
బడఁగఁ జూడ ఘోర భంగిగాఁ దఱచయ్యె
డొక్కలున్న వారి కెక్క భయము.

ఈ యనావృష్టి క్షామము త్రేతాయుగ ద్వాపరయుగముల సంధిలో వచ్చెనఁట. అనావృష్టులు వచ్చునని జలసమృద్ధి కలుగునటులు చెఱువులు మొదలయినవి త్రవ్వించి



ప్రజ లాకాశమును నమ్మియుండకుండ సర్వ సస్య సమృద్ధి యగునటులు పూర్వ ప్రభువులు పాటుపడిరి. వాల్మీకి రామాయణములోని యయోధ్యాకాండలో ౧౦౦ సర్గ యందును, మహాభారతమున నైదవ యధ్యాయమునను 'ప్రభువగువాఁడు తటాకాదులను ద్రవ్వించి దేశమును సస్యాఢ్యగ నొనర్పవలయు' నని కలదు. ఋగ్వేదము ౨-౧౫-౬ నందు 'ఇంద్రుఁడు సింధునదిని ఉత్తరాభిముఖముగఁ ద్రవ్వె' ననియు, 3-33-౬ నందు 'ఇంద్రుఁడు వజ్రబాహుఁడయి నదుల కడ్డు గట్టులను గట్టిన వృత్రుం జంపి నదుల నుంచి కాలువలను ద్రవ్వె' ననియు వ్రాయఁబడి యున్నది. ఋగ్వేద కాలమున బావులును అందలి పలు విధములగు భేదములును గలవు. ౧ వ మండలము ౧౦౪ సూక్తము మొదలు ౧౦౯ సూక్తము వఱకును బావులను గూర్చి విస్తారముగఁ గలదు. ఖండి చక్రము వలన మూయఁబడఁ జాలినంత చిన్న బావియుఁ, బది సెంట్ల వైశాల్యముండిన బావియు, వర్ణితమయ్యెను. పది సెంట్ల వైశాల్యముఁగల బావికి ఱాతి గిలకయుండి తోలుత్రాళ్ళఁ గట్టి నీరును దోడి, పశువులకును మనుష్యులకును, దొడ్లయందుంచి నిలువచేసిరనియుఁ, జొట్టును బయిరు పెరుగుచున్నదనియు, ఋగ్వేదమున ౧౦-౧౦౧ లో వివరింపఁ బడియెను. శ్రీరాముఁడు భరతునితో నాడిన వాక్యముల వలన ఆనాఁటి ప్రభువులు దేశమునం దెట్టి ప్రేమను జూపి యెట్టి స్థితియందుంచిరో తెలియఁ గలదు.

శ్లో. కచ్చిచ్చైత్య శతైర్జుష్ట స్సునివిష్ట జనాకులః
దేవస్థానైః ప్రపాభిశ్చ తటాకైశ్చోప శోభితః
ప్రహృష్ట నరనారీక స్సమాజోత్సవ శోభితః
సుకృష్ట సీమాపశుమాన్ హింసాభిః పరివర్జితః
అదేవమాతృకో రమ్య శ్శ్వాపదైః పరివర్జితః
పరిత్యక్తో భయైస్సర్వైః ఖనిభిశ్చోప శోభితః
వివర్జితో నరైః పాపై ర్మమ పూర్వై స్సురక్షితః
కచ్చిజ్జనపద స్ఫీతః సుఖం వసతి రాఘవ !

(శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండ ౧౦౧ సర్గ.

దేవాలయములు, చలిపందిరులు, చెఱువులు, ఆరోగ్యులగు ప్రజలు గలిగి పశుసమృద్ధి, సస్యసమృద్ధి, యుండి ఆకాశమును నమ్ముకొని వ్యవసాయము చేయక కాలువలు మొదలగు వానివలన వ్యవసాయము చేయఁబడుచుండి, దుష్టమృగములచేతను వ్యాధులచేతను దస్కరులచేతను బీడింపఁబడక పాపమెఱుఁగని ప్రజలతోఁ గూడిన పల్లెలు నిరపాయకరముగను సుఖప్రదముగను శ్రీరాముని కాలమున నుండినటులు తెలియుచున్నది గదా! ప్రభువయిన వాఁడు పట్టాభిషిక్తుఁడగుటకు ముందుఁ బ్రజోప

యుక్తములగు కొన్ని పనులఁ జేయుచుండెను. వర్ణాశ్రమ కులాచారములఁ దెలిసికొనుటయుఁ, జెఱువులు, బావులు మొదలగు వాని నేర్పాటు చేయుటయు, రాజు చేయఁదగిన పనులని యైతరేయ బ్రాహ్మణము ౭.౪-౩ నందుఁ జెప్పఁబడినది. 'వర్ణాశ్రమ త్రయీధర్మ మిష్టము. తద్వ్యతిరేకము పూర్తము.' అని విద్యారణ్యులు నిర్వచన మొనర్చిరి. రామాయణ, మహాభారతములలో రాజనీతులను వర్ణితమైన ప్రదేశమున 'అదేవ మాతృకముగా వ్యవసాయము రాజ్యమున నుండవలయు' నని చెప్పఁబడినది.

ప్రాచీన భారతీయుల ప్రభుత్వ కార్యములను శిల్పశాస్త్రజ్ఞుఁడగు ఫెర్గ్యూజన్ అను నతఁ డిట్లు వివరించెను. "దేవాలయము లత్యద్భుత రామణీయకముగఁ గట్టుట వలన భారతీయుల శిల్పశాస్త్ర పాటవము విశదమగుచున్నది. భారతీయుల నాగరకము తెలియవలెనన్న వారేర్పఱచిన వంతెనలును బాటలును జాలును. కోటనుండి దక్షిణమున మేకాంగు నది వఱకు నూటయేఁబది క్రోశముల పొడవుఁ గల్గిన బాట గలదు. ఈ బాట పూర్వము రోముదేశీయు లేర్పఱచిన బాటను ధిక్కరించుచుఁ గాలువ లున్న చోటులను బలీయమగు వంతెనలతో నున్నది. ఆ వంతెన లిప్పటికిని గనిపించుచున్నవి. అందొకటి నాలుగు వందల అడుగుల పొడవును ఏఁబది యడుగుల వెడలుపును గలిగి యున్నటులు డాక్టరు బాస్టెయిన్ గారు వర్ణించిరి. తొమ్మిదవ శతాబ్దములో అనఁగా క్రీ. శ. ౬౦౩ మొదలు ౧౪౭౭ వఱకును జావా, సుమిత్ర ద్వీపములలో వలస పోయిన భారతీయులు శిల్పశాస్త్రమునకు వన్నె తెచ్చిరని యొప్పికొనక తప్పదు." అని వివరించెను. బిజాపురములోని ప్రాకారము పయి నున్న బురుజులలో గొప్పదియగు పశ్చిమ బురుజుపయి మల్లిక్ మైదాన్' అను ఫిరంగి యున్నది. ఇచ్చటనే 'లండాక్ సబ్' అను నింకొక ఫిరంగి యున్నది. 'లండాక్ సబ్' ఫిరంగి పొడవు ఇరువది యేడడుగుల యేడంగుళము లుండును. ముఖవ్యాసము నాలుగడుగుల నాలుగంగుళము లును, నాళము పదునెనిమి దడుగుల యేడున్నర అంగుళములును, బరువు నలువది యేడు టన్నులును నుండును. 'మాలిక్ మైదాన్' ఫిరంగి యెంత చిన్న తాఁకుడు తగిలినను గంటవలె మ్రోగును. అతి మృదులముగ నుండును. ఇది 'మహమ్మద్ బిన్ హాసన్ స్తంబోలి' యను నతఁడు చేయించినది. ఇయ్యది పదునాలుగడుగుల నాలుగంగుళముల పొడవును, నాళము నాలుగడుగుల తొమ్మిదిన్నర యంగుళములును, నలువది టన్నుల బరువును గలిగి తాలికోట యుద్ధమునఁ బెక్కురను దన కుక్షి నింపుకొనినది. ఇది నిజాం శాహి యొక్క ఆయుధశాలనుండి 'తల్లికోట' యుద్ధము పిదపఁ 'బరందావా' కిల్లాకుఁ గొంపోఁబడియెను. బిజాపుర నవాబు లాకిల్లాను జయించినప్పు డిది తచ్చిహ్నముగ బిజాపురమునకుఁ దీసికొని వచ్చిరి. అప్పటినుండి యిచ్చటివారు దీని నారాధించుచున్నారు. నిజాం రాజ్యమున ముఖ్యపట్టణమగు హైదరాబాదునకుఁ బశ్చిమమున నుమారు ముప్పది క్రోశముల దూరమున 'బీదరు' పట్టణముండెను. 'అహమ్మద్ షావాలి' యను నతఁడు రాజ్యము చేయు కాలమున నిచ్చోట దుర్గమొకటి



యేర్పఱుపఁబడినది. దుర్గములోపల జలాశయములును గోపురములును శాలికాగారములును శోభిల్లుచుండెను. ఈ పట్టణమున నరసింహస్వామి యాలయ ముండెడిది. కాని ౧౫౫౬ సం|| రమున నలంగీరు బాదుషా (ఔరంగజేబు చక్రవర్తి) దండయాత్ర సందర్భమున నీ యాలయమును మసీదుగ మార్పఁ గావించి 'ఫరాకాబాగ్' యని పేరిడెను. 'ఫరకా' యనఁగా నురుదు భాషయందు 'స్వర్గము' న కర్థము. ౧౪౩౫ సం|| రమున అహమ్మద్ షా చనిపోఁగా అతని కుమారుఁడగు నల్లా యుద్దీనుఁడు సింహాసన మధిష్ఠించి క్రొత్తఁగా నొక పట్టణమును గట్టించెను. అందు గొప్ప భవనములును ఆరామములును ధర్మ విద్యాలయములును నేర్పాటు చేసి వలయు వ్యయము క్రింద గొప్ప భూదానములఁ జేసి కీర్తిఁ గాంచెను. క్రీ. శ. ౧౦౫౭ సం|| రమున రాజేంద్ర దేవుఁడను వాఁడు రాజ్యమేలుచుఁ దన గ్రామమున నొక దేవాలయమును గట్టింపఁదలఁచి గ్రామ సంఘము వారికిఁ గొంత సొమ్మిచ్చి యుండెను. ఢిల్లీలోని యయః స్తంభమును డాక్టరు బాస్టెయిన్ గారు ఇట్లు వర్ణించిరి. "ఈ స్తంభ మిప్పుడు భూమిపయి నిరువది రెండడుగుల యెత్తున్నది. లోపలి భాగము ౨౦ అంగుళము లుండునని తెలియుచున్నది. కావున దీని పొడవు ౨౩ అడుగుల యెనిమిదంగుళములును, చుట్టుకొలఁత ౧౬.౪ అంగుళములును, అగ్రభాగమున ౧౨.౦౫ అంగుళములును నుండును. క్రీ. శ. ౩౬౩ సం||ర ప్రాంతమున సముద్రగుప్తుఁడు తన దిగ్విజయములను బహిర్గత మొనర్చుటకయి పోత పోసిన జయస్తంభ మిది. పదునాలుగు శతాబ్దములు శీతవాతాతపములకుఁ దల యొగ్గి కొంచెమైనను త్రుప్పు పట్టకను స్తంభముపయిని శాసనములలోని లిపులు కించిత్తయినను అఱిగి మాసిపోకను విస్పష్టముగఁ గనిపించుట చాల చిత్రము. అంతటి పూర్వకాలము ననే భారతీయు లిట్టి స్తంభమును బోతపోయఁగల్గుటయుఁ, 'బోత పోసినారని దెలిసికొనుటయు, సంతోషావహము.' మహాదేవ గోవిందరానడే గారు 'అయః పరిశ్రమ స్థానికావసారముల నన్నిఁటిని దీర్చుటయే గాక యితర దేశములకు నెగుమతి చేయఁగలట్టి శక్తిఁ గలిగి యుండెను. ఢిల్లీలోని ప్రసిద్ధి వహించిన ఇనుప స్తంభము కనీసము పదునైదు వందల సం|| రముల నాఁటిది. అది యినుప పరిశ్రమయందలి యద్భుత కౌశలమును వెల్లడింపుచున్నది. ఇది యెట్లు చేయఁబడునని విమర్శింపఁ దలపెట్టిన వారెల్లను విఫలులైరి' యని తన యార్థిక శాస్త్ర వ్యాసములలో వ్రాసెను. జనరల్ కన్నింగుహాము దొర ఈ స్తంభమందలి యొక తునుకను దీసి డాక్టరు మర్రే చేతను, డాక్టరు పెర్సీ చేతను, బరిశోధింపఁగా నిరువురును ఈ స్తంభము యొక్క యినుము నందు గర్తి లేదని నిర్ణయ మొనర్చిరి. జావా, సుమిత్రా ద్వీపములలోని దేవాలయములు మిగుల విచిత్రముగ నున్నవి. డాక్టరు గ్రిఫిత్ గారు 'చాల కాలము శ్రద్ధతో నీ గిరి గహ్వరముల శిల్పమును బరికించితిని గాని అదేమి చిత్రమో శిల్పకారుఁ డొకచోటనైనను అతుకుఁ బెట్టి పొరబడి వక్రముగఁ దొలిచినట్లు నాకుఁ గనిపింపలేదు. ఇట్టి పొరబాటులు లేకుండ గుహాలయములు తొలువఁబడిన' వని వ్రాసినాఁడు. గార్డన్ అను గ్రీకుదేశ ప్రభువు సైన్యమున భారతీయ విలుకాండ్రుండిరనియు వారు

పేము విల్లులను, ఇనుప ములికలుగల బాణములను నుపయోగించుచుఁ గ్రీస్తు పుట్టుటకు ౫ శతాబ్దములకుఁ బూర్వమే యినుమును వాడుకలోనికిఁ దెచ్చిరనియు విన్సెంటు స్మిత్ చెప్పుచున్నాఁడు.

కనుక దీనిని బట్టి చూడఁగా భారతీయుల రాజకీయ నిపుణతయు శిల్పశాస్త్ర పాటవమును భాగతావని యంతయు నల్లుకొనెనని చెప్పవచ్చును.

---

# మంత్రులు.

---

పూర్వకాలమున మంత్రుల నియామకము మిగుల ప్రాముఖ్యత వహించి యుండెను. మంత్రిగ నుండువాని ప్రవర్తనమును బట్టియు సామర్థ్యమును బట్టియు మాత్రమే గాక అతని సాంసారిక సంబంధ సామరస్యములను గౌరవ ప్రపత్తులనుగూడఁ జక్కఁగా నాలోచించి నియామకము జరుగుచుండెను. మంత్రిత్వమున కర్హత యున్నవాఁడెట్టి వాఁడనఁగా; దేశీయుఁడయి గొప్ప కుటుంబమున జన్మించియుండి పలుకుబడియు శాస్త్రములందును గళలయందును బరిచయమును దూరదృష్టియు మంచి జ్ఞాపక శక్తియుఁ బరిజ్ఞానమును వక్తృత్వమును నుత్సాహమును సహనమును మర్యాదతోఁ గూడిన ప్రవర్తనమును బ్రతిభయును రాజ్యాభివృద్ధికయి సంరక్షణ కయి తన సర్వస్వమును ధారవోయు స్వభావమును ధైర్యస్థైర్యములును బలారోగ్యములును గలిగి—కాలవిళంబమును మతిచాంచల్యమును లేక ప్రేమించు ప్రకృతి యుండి స్పర్థలను రేపెట్టు స్వభావముండక మంచిగుణము లుండవలయునని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౧, అధ్యాయము ౯.) ఇవి మంత్రి కుండఁదగిన గుణములు. ఈ యాదర్శములు గణనీయములని తెలియవలయును. విష్ణు పురాణము ననుసరించి మంత్రిగ నియమింపఁబడువాఁడు మర్యాదయును జాగరూకతయును సామర్థ్యమును దురాశ లేకుండ నుండవలయునని తెలియుచున్నది. (అధ్యాయము ౧౦, ౧౧) ఎవరి పూర్వులు రాజభక్తి పరాయణులును గౌరవ ప్రపత్తిగల కుటుంబములకు సంబంధించినవారును శాస్త్రపరిచయమును,—సవ్యాప సవ్యములుగ నాయుధముల నుపయోగించుట యందు సమర్థతయును గలిగి యుందురో యట్టివారి నేర్చి యేడుగురినిగాని యెనమండుగురినిగాని మంత్రులను రాజేర్పఱుప వలయునని మనువు చెప్పుచున్నాఁడు. (VII, ౫౪.) ‘రాజు సభా పరిజ్ఞాతృత్వము గలిగి సభ్యుల నేర్పఱచును. వారు రాజావలి యొక్క నేత్రముల రీతిగ



మెలంగుదు’ రని కురళ్ అను నతఁడు చెప్పుచున్నాఁడు. (పోప్స భాషాంతరీ కరణము, పుస్తకము ౨, అధ్యాయము ౪౫) మఱియు మంత్రియైనవాఁడు దూరదార్శనిక పరిజ్ఞానమును స్వరక్షణమున గొప్పఁదనమును అచంచల హృదయమును,—గలిగి ధైర్యస్థైర్యములతోఁ గార్యముల నిర్వహించుచుండవలయునని కురల్ చెప్పుచున్నాఁడు. (పుస్తకము ౨, అధ్యాయము ౬౪.) మహాభారతముఁగూడ మంత్రివర్గము వారి గుణములను వ్యక్తీకరించుచున్నది ఎవరు యశస్సు సంపాదింతురో యెవరు పరుల యెడ సహనమును గలిగియుందురో యెవరు దుష్కార్యములఁ జేయకుందురో యెవరు దురాశావివశులయి ధర్మమును విడువకుందురో భయమును—బేరాశయును,—అతి కోపమును లేక యుందురో వ్యాపార సంవిధానమున నెవరు దిట్టలో యెవరు వివేకయుతమును నమూల్యమునగు వాఙ్నిపుణతను బేర్వడసి యుందురో అట్టి వారినే మంత్రులుగ నియమింతురు. అట్టివారు వినయ విధేయతలు గలిగి పరనిందయు నాత్మశ్లాఘనమును లేకుండ ధైర్యస్థైర్యములును గౌరవ ప్రపత్తులును గలిగి యుందురు గావున వివిధ శాఖలకు మంత్రులుగ నియమింపఁ బడుదురని శాంతిపర్వమునఁ జెప్పఁబడినది. చాణక్యుఁడు అర్థశాస్త్రమునఁ బ్రాచీనోపాధ్యాయులను గూర్చి చర్చించు సందర్భమున నెట్టివారిని మంత్రులుగ నేర్పఱుపవలె ననువిషయము సంక్షిప్తముగ వివరించుచున్నాఁడు. భరద్వాజుఁడు, ‘రాజయినవాఁడు మంత్రులను నియమించుటయందతి జాగరూకతఁ గలిగి దూరదృష్టితో మర్యాద విశ్వాసము శక్తి సామర్థ్యము లున్నవారి నేర్చి నియమించు’ నని చెప్పుచున్నాఁడు. ‘తనయందు విశ్వాసముంచి బాగోగుల నన్నిటిని జక్కఁగా గుర్తెఱిఁగిన వారిని మంత్రులుగ రాజు ఏర్పఱచు’ నని విశాలాక్షుఁడు చెప్పుచున్నాఁడు. ద్రోహపు తలంపుఁ గలిగి రహస్యములను వెల్లడించి శత్రువులకప్పగించివైచుట యిరువురకును సమానమైన భయమే! మంచి—చెడు, అన్ని విషయములలోను రాజభక్తి పరాయణుఁడయి వర్తించు మంత్రుల సలహా ననుసరించి పని చేయును. మంత్రులుగ నియమించినప్పటినుండియుఁ గష్ట సమయములందుఁ గూడ రాజునందు విశ్వాసము గలిగి సేవించువారిని మాత్రమే మంత్రులుగ రాజు నియమించు’ నని పరాశరుఁడు చెప్పుచున్నాఁడు. రాజకీయములందనుభవము లేకుండ నూహాజన్య జ్ఞానముతోఁ బ్రజా పరిపాలనమున నియమించినచో నతఁడు పెక్కు గొప్ప తప్పిదము లతఁడు చేయఁగలఁడు. గౌరవ కుటుంబమున జన్మించియుండి వివేకము గలిగి ధైర్యము రాజభక్తియుఁ బవిత్రోద్దేశమును గలవారినే రాజు మంత్రులుగ నేర్పాటు చేయవలయును. ‘మంత్రివర్గ నియామకములు గుణసంపత్తి పై నాధారపడి యున్న’ వని బాహుదంతి కుమారుఁడు చెప్పుచున్నాఁడు. ఈ యభిప్రాయము లన్నిటియందును న్యాయ్యము ధర్మము ప్రాతిపదికగ నిలిచియున్నది. మంత్రి యొక్క అర్హత అతఁడు చేయు పనిని బట్టి యోజింపఁబడునని చాణక్యుఁడు తన స్వీయాభిప్రాయమును వ్యక్తపఱచెను. (అర్థశాస్త్రము, పుస్తకము ౧, అధ్యాయము ౮.) నీతి వాక్యామృతములోని పదునెనిమిదవ యధ్యా

యమున నీ విషయము చర్చింపఁబడినది. అగ్ని పురాణమును బట్టి మంత్రుల్ల సామాన్య ధర్మములు క్రింది విధముగ వివరింపఁబడినవి. ౧. ప్రభుత్వము యొక్క పరిమాణముల్ల నాలోచించుట ౨. అనుకూల ప్రయత్నములకు సాధనముల నన్వేషించుట, ౩. ముందు వచ్చు దైవ వైపరీత్యముల కన్నిఁటికిని సిద్ధపడుట ౪. ప్రభుత్వ కోశమును నింపుటయుఁ బరిశీలించుటయు ౫. రాజ్యనిర్వహణమున కయి ధనదోష చట్టముల (సివిల్ క్రిమినల్) నిర్మింపఁ జిత్తు ప్రతుల వ్రాయుట ౬. ఏ విదేశపుదాడుల వలన నైనను దేశము ఆక్రమింపఁ బడెనేమో యని పరిశీలించుట. ౭. రాజును—దేశమును, సంరక్షించుచుండుట. ౮. రాజ్యమున తగాదాలు లేకుండఁ జూచుట—మొదలగు పనులను జేయుటయే మంత్రి విధి యని యగ్ని పురాణమునఁ గలదు. ప్రభుత్వావసరములఁ బట్టి మంత్రుల సంఖ్య ఆధారపడి యున్నది. చాణక్యుని యభిప్రాయములోఁ జిన్ని మంత్రివర్గము మంచిదనియుఁ, గార్యసాధన కనురూపమునియుఁ దెలియుచున్నది. రాజు ముగ్గురు లేక నలుగురు మంత్రులతో సంప్రదింపవలయుననియు, నొక మంత్రి యుండిన 'క్లిష్ట పరిస్థితులలో సంతృప్తికరముగ ఫలితములను జేకూర్పఁజాలఁడనియు, నింతియే గాక స్వేచ్ఛగ నిరంకుశముగ నడువవచ్చుననియు, నట్లుఁ గాక యిరువురు మంత్రులను బ్రభువు నియమించిన యెడల వారందఱు సంఘీభావము వలన అతఁడు త్తమాధికారము క్రమముగ సాగింపవచ్చుననియు, లేక వారిలో వారికి స్పర్ధలు సంభవించిన ముప్పు వాటిల్ల వచ్చుననియుఁ గాని యతఁడు ముగ్గురు లేక నలుగురు మంత్రుల యాలోచన పయిని యే విధముగనేని దుర్వ్యసనమునకు రాఁడనియుఁ, దృప్తిఁ గలిగి యుండుననియు నర్థశాస్త్రమున వివరింపఁబడినది. (పుస్తకము ౧, అధ్యాయము ౧౫.) 'సంఖ్య మాత్రము బేసిగ నుండవలయును. ముగ్గురు, అయిదుగురు, ఏడుగురు, మంత్రులుండుట శ్రేయస్కరము. భావైక్యతను బొందుట మిగుల కష్టము.' అని నీతి వాక్యామృతము భావన. (అధ్యాయము ౧౦.) సోమదేవ సూరి యను నతఁడు ప్రభుత్వోపయోగము కొఱకు వారి ప్రత్యేక బుద్ధి వైశద్యము వలన మంత్రుల సంఖ్య వృద్ధి యగును. ఎప్పుడేని మంత్రి యగు వాఁడు పరిపాలనా నిర్వహణమునకు అవసరమగు శక్తి సామర్థ్యములం గలిగి యుండును. ఒకరు గాని యిద్దరు గాని మంత్రు లేర్పడుటలో హాని యేమియు లే' దని చెప్పుచున్నాఁడు. 'మెగస్తనీసు చెప్పినట్లుగా పక్రమముగఁ బ్రభుత్వ కార్యముల నిర్వహించు ప్రజా స్వామ్య నగరములందలి ప్రాడ్వివాకులు విద్యావంతులగు బ్రాహ్మణ సంఘమునుండి నియమింపఁబడుచుండిరి. వీరినే రాజును ఆలోచన చెప్పు ప్రత్యేక తరగతి వారనియెదరు. 'కొద్ది మంది యైనను బుద్ధి వైభవమున మిన్న లగుట వలన రాష్ట్రమునకు ముఖ్యాధికారులగు గవర్నరులు, డిప్యూటీ గవర్నరులు, కోశాధిపతులు, సైన్యాధ్యక్షులు, నౌకాధ్యక్షులు, వ్యవసాయ కమీషనరులు, కంట్రోలరులు,—మొదలగు వారి నేర్పఱచు సత్తమాధికారమును,—విశేషాధికారమును అనుభవించుచుండి' రని యొక గ్రీకు దేశపు వ్రాయసకాఁడు తెలుపుచున్నాఁడు.



రాజకీయ తత్త్వజ్ఞుఁడగు ప్లేటో అను నతఁడు 'అన్ని విషయములలోను అన్ని సమయములందును రాజ్య సంరక్షణము పట్ల అతి శ్రద్ధ వహించి, చక్కని ప్రవర్తనముఁ గలిగి ధైర్యస్థైర్యములును, ముందు సంభవించు కీడును దెలిసికొని పడు భయమును, జ్ఞాపక శక్తియుఁ, గలిగి యుండవలయు' నని తన రిపబ్లిక్ గ్రంథమున వ్రాసెని నాఁడు. అరిస్టాటిల్ అను నతఁడు 'గొప్ప పదవులందున్నవారి సుగుణ సంపత్తి ౧. రాజభక్తియు ౨. పరిపాలనాదక్షతయు ౩ ప్రభుత్వ విధానము లన్నిఁటి యందును న్యాయ్యము, నీతిఁ గల విధాన నిర్వహణము' నని చెప్పుచున్నాఁడు. 'ఈ భక్తి మానసిక శక్తి కాదు. ఆర్థిక కార్యములందు నియుక్తులయి మామూలు రివెన్యూ మొత్తము కన్న హెచ్చుగఁ జూపించు తెలివితేటలు గలవారినే మంత్రులుగ నియమింతు' రని పిశునుఁడు చెప్పుచున్నాఁడు. 'అదియే కాదు. అట్టి వారు ఇతర మంత్రి వర్గమువారి గుణములు లేకుండ నున్నారు. ఎవరి తండ్రులు తాతలు మంత్రులుగ నుండిరో అట్టి వారినే మంత్రులుగ నియమింపవలయును. అట్టివా రాతని నెన్నఁడును విడనాడ గూడ' దని కౌనపదంతుఁడు చెప్పుచున్నాఁడు. వాతవ్యాధి యను నతఁడు 'అట్టి వారు రాజకీయ శాస్త్రమునఁ బ్రవీణతను సంపాదించిన వారిఁగఁ జూచి యేర్పఱుప వలయు' నని చెప్పుచున్నాఁడు. శుక్రనీతియందుఁ 'బురోహితుఁడు (ఆచార్యుఁడు), ప్రతినిధి (రెజెంటు,) ప్రధానుఁడు (ముఖ్యుఁడు,) సచివ (ఆర్థిక మంత్రి.) మంత్రి (కౌన్సిలరు,) ప్రాడ్వివాకుఁడు (ప్రధాన న్యాయమూర్తి,) పండిత (న్యాయశాఖామంత్రి,) సుమంత్రక (శాంతి శాఖామంత్రి లేక యుద్ధాంగ మంత్రి,) అమాత్య (రాజ్యాంగ కార్యదర్శి) దూత (రాయబారి,) అని పది విధములగు మంత్రి వర్యులను పేర్కొనఁ బడినది. 'మిళింద పణహ' యను గ్రంథమున రాజ్యమున నార్గురు ముఖ్యాధికారులుండు విషయమయి యుదాహృతమయి యున్నది. ప్రధాన సైన్యాధ్యక్షుఁడు, ప్రధానమంత్రి, ముఖ్యన్యాయాధిపతి, ఉన్నత కోశాధిపతి, రాజ్యభారవహనుఁడు, రాజ్యదండధరుఁడు, అని యార్గురు పేర్కొనఁబడిరి. 'ఓ రాజా! రాజు క్రిందనుండు అధికారులు ముఖ్య సైన్యాధిపతి, ప్రధానమంత్రి, ముఖ్య న్యాయాధిపతి ప్రధాన కోశాధికారి, రాజ్యభార వహనుఁడు రాజ్యదండధరుఁడు అను వారు ప్రభుత్వము నడుపుట కయి యేర్పడుదు' రని మిళింద ప్రభువర్యుని ప్రశ్నములలోఁ గలదు. ప్రధానామాత్యుని సర్వార్థక యనియు, ప్రధాన యనియు, సర్వాధికార యనియు, అగ్రామాత్య యనియు, మహామాత్యయనియు, సాధారణ మంత్రి యనియుఁ బిలుతురు. 'సర్వార్థక' యను మాటకు బదులు మిళిందుని ప్రశ్నములలో 'సబ్బత్థక' సాధారణ మంత్రి) అను మాట కనిపించుచున్నది. (IV. ౮, ౨౬.) ఈ మాట ప్రధానామాత్యుని కార్య స్వభావమును దెలియఁ జేయుచున్నది. 'సర్వాధికార' అను మాట కల్హణ పండితునిచే వ్రాయఁబడిన 'రాజతరంగిణి' యందుఁ గనుఁగొనవచ్చును. 'అగ్రామాత్య' యను మాట సింహళ శాసనమునఁ గనిపించును. 'మహామాత్య' యను మాట

'మహాపరినిబ్బాణసుత్తంత వస్సకార' యని మగధ మాహాత్మ్యమున (మహామత్త యందు) వర్ణింపఁబడియెను. 'మంత్రి' యను పదము ప్రధానామాత్యుని పరముగఁ బెక్కు పర్యాయములు కౌటిల్యుఁ డుపయోగించెను. ఈ ప్రధానామాత్యుఁడు నిజమైన కార్యనిర్వాహక శాఖాధ్యక్షుఁడు. రాజ్యము యొక్క ఉత్తమాధికారి. సామాన్యముగ నితఁడు రాజ్య వ్యవహారములందు జోక్యము కలిగించుకొనును. కొన్ని సమయములలో విదేశ కార్యాలయము వంటి ప్రత్యేక శాఖాధర్మములను నిర్వహించుచుండును. ఇంకొక ముఖ్యమంత్రి పురోహితుఁడు. అనఁగాఁ బ్రధానాచార్యుఁడు. ఇతని యందెల్లపుడును మంచి మర్యాద నుంచెదరు.

ఐతరేయ బ్రాహ్మణమునఁ బురోహితుని (రాష్ట్రగోపకుని) రాజ్యసంరక్షకుఁడని పిలుతురని చెప్పఁబడినది. బాగుగఁ జదువుకొనిన బ్రాహ్మణుని రాజ్య సంరక్షకునిగను, అతని పురోహితునిగను, రాజు పరిగణించును. ఈ బ్రాహ్మణుఁడు విదేశ ప్రభువులతో రాజునకు మైత్రి చేకూర్చును. ఆతని శత్రువుల నిర్మూలించును. క్షత్రియుల సాహాయ్యమున క్షత్రియుల జయించును. సైన్య సాహాయ్యమున నధికార మనుభవించును. అతనికిఁ బ్రజలనుకూలు రగుదురు. అతనికి వారెల్లరును తోడ్పడుచుందురని యైతరేయ బ్రాహ్మణమునఁ బదునొకఁడవ యధ్యాయమునఁ జెప్పఁబడినది. 'మంత్రులనఁగాఁ గార్యాకార్య తత్త్వార్థదర్శులు. మంత్ర సంపదవలన రాజ్యము ప్రబల మగుచున్నది. మంత్రగోపనము అతిముఖ్యమైనదని తెలియవలయును. కార్యాంధునకు మంత్రము వెలుఁగు వంటిది. మంత్రము చేయు మువ్వురకు నేకీభావమును ఐక్యతయును గలిగిన అట్టి మంత్రము ఆచరణ యోగ్యమును విశ్వసనీయమునునై యున్నది. స్వీయ కార్యములలో ననఁగా దేశమునకు సంబంధించిన కార్యముల విషయమయి ఆయత్తముగ నుండుటయే తంత్రమనియు మండల నివిష్టియే ఆవాపమనియు సంధి విగ్రహములకుఁ బ్రాతిపదికయగు నట్టిది మండలమనియుఁ దెలియవలయు' నని చాణక్యుని సూత్రములలోఁ గలదు. 'తస్యశాస నివర్తిత' యని బోధాయనుఁడు చెప్పుచున్నాఁడు. 'ప్రధానామాత్యుఁడును బురోహితుఁడును రాజునకుఁ దలిదండ్రుల వంటి వా' రని నీతివాక్యామృతము చెప్పుచున్నది. 'కొన్ని సమయములందు మంత్రిత్వమును ఆచార్యత్వమును నొకని యందే విలుప్తమగును. రాజ్యాంగ మందలి యితరోద్యోగులు అనఁగా సచివ, మహామాత్య, అమాత్య అను వారు ప్రత్యేక శాఖలయం దుపవిష్టులగుచుండిరి. వారి వారి యధికారములకు సంబంధించిన మండలములు చక్కని విధానమున కార్య సౌలభ్యమునకయి విభాగింపఁబడినను, వారి కార్యక్రమము నెఱవేర్చుటకుఁ దగిన ప్రదేశమును—అవకాశమును బట్టి ప్రభుత్వోద్యోగులవలె నియమింపఁబడుదురు గాని కేవలము సభ్యులవలెఁ గాదు.' అని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడియున్నది. (పుస్తకము ౧, అధ్యాయము ౮.) 'మహామాత్య' యను పదము అశోకుని శిలాశాసనములలో నున్నటులు గౌటిల్యుని యర్థశాస్త్రమునందును గలదు. వీరిలో ముఖ్యులు సన్ని-



ధాత, సమాహర్త అను వారు అనేక విధములగు ప్రభుత్వ సుంకములు వసూలు చేయుటకు Former ధర్మమయి యుండెను. భూముల పయిని విధింపఁబడిన సుంకములు క్రింది విధముగ నుండెను. గనులనుండి వచ్చు ఆదాయము,—అడవులు, పచ్చిక బీళ్ళు, చేపలు, వ్యాపార మార్గములనుండి పుచ్చుకొనఁబడు సుంకములు,—మొదలగునవి సమాహర్త యను నతఁడు వసూలు చేయు సుంకములు. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౬. సన్నిధాత యను నతఁడు ప్రభుత్వ ద్రవ్యమును జాగరూకతతోఁ జూచువాఁడు. ఇతఁడు రాజుగారి సుంకములు కోశములోనికిఁ జేర్చికొని యమూల్య లోహములు, ఆభరణములు,—మొదలగు విలువఁగల యాస్తియు నితరములను జాగరూకతతోఁ జూచువాఁడు. ఇతర శాఖోద్యోగులు ప్రభుత్వాదాయమును అపహరించుచున్నారా లేదా యని పరిశీలించుటయు నతని విధ్యుక్త ధర్మము. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౫.) మఱియొక మంత్రి యుద్ధాంగమంత్రి, విదేశాధికారులతో సంప్రతించుటయును, ఏ యవసర సమయమందైనను సమర్థనీయమై యుండు విదేశ రాజకీయముల సాధనము లుపపత్తు లేవిగలవో వాని నిర్ణయము చేయుటయును, అతని విధ్యుక్తమని యగ్నిపురాణమునఁ జెప్పఁబడినది. (అగ్నిపురాణము, అధ్యాయము ౨౨౦) ముఖ్య న్యాయాధిపతి ప్రభుత్వ న్యాయస్థానమున కధ్యక్షత వహించుచుండును. ఇతఁడు ఒక విధముగ న్యాయశాఖామాత్యుఁడనియే చెప్పవచ్చును. ముఖ్య సైన్యాధిపతి మంత్రి పదవియందుంపఁబడినను అతఁడు సభ్యుఁడుగ నుండుటకు నీతివాక్యామృతము నిరోధించుచున్నది. 'సేనానాయకులు సభలో సభ్యులుగ నుండఁగూడదు. ప్రభువు కనుగుణ్యముగా నేకీభవించి ప్రవర్తింపవలయు' నని నీతివాక్యామృతము పదియవ యధ్యాయమునఁ జెప్పఁబడినది. శుక్రనీతియందు వివరింపఁబడిన మంత్రుల పట్టికలో నితని పేరు లేదు. కొన్ని సమయములందు రాజముద్రను బొందుటకుఁ బ్రత్యేకమంత్రి నియమింపఁబడును. ముద్రరక్షకుని ఐకమత్యము ప్రభుత్వ కార్యములన్నిటి యందును బ్రముఖమైనది. అతని స్థితి మంచి మర్యాదతోను ప్రాముఖ్యతతోను గూడుకొనినది. ప్రతి మంత్రియుఁ దనకు నిర్ణయమైన కార్యములను నిర్వహించుచుండును. మంత్రుల బాధ్యత సంయుక్తముగఁ గాక ప్రత్యేకముగ నుండినట్లు కనిపించుచున్నది. మంత్రు లందఱును నొక వర్గముగ నేర్పడి సమష్టిమీఁదఁ గార్యముల నిర్వహించుచుండిరి. అంతరంగ సభ (మంత్రిగణ)కును, మంత్రుల సభకును (మంత్రిపరిషత్) గల తారతమ్యమును జాణక్యుఁ డభివర్ణించుచున్నాఁడు. మంత్రి పదవులు లేని యితర సభ్యులవలన అంతరంగ సభ పూర్తిఁజేసి ముఖ్య విషయములను రాజు పైరెండు సంస్థలతోను యోజించి పని చేయవలయునని చాణక్యుఁడు ఆలోచన చెప్పుచున్నాఁడు. రాజు సమష్టిమీఁద నెట్లు మంత్రులతో సంప్రతించుటకు అధికారము కలిగియున్నాఁడో అట్లే వ్యష్టిఁగూడ మంత్రులతో సంప్రతించుట కధికారము కలిగి యుండెను. అన్ని విధములఁ బనులను జేయుట యందుఁ బ్రతి మంత్రియును బరిచయము కలిగి యుండెను. మంత్రులు తమ ధర్మముల నెఱవేర్చుట యందు రాజునకే బాధ్యత వహించి యుండిరి.

కాని ప్రజలకుఁ గూడ నా రొక విధముగ బాధ్యత వహించి యుండిరి. చీనా బాటసారి యగు హుయానుత్సాంగు (శ్రావస్తి రాజగు విక్రమాదిత్యుని గురించి యొక కథా రూపమున నీ విషయమును జిత్రించినాఁడు. 'విక్రమాదిత్యుఁడు వదాన్యుఁడనియు, నా కారణమున బీదసాదలకును—దలిదండ్రులు సంరక్షకులు లేని దిక్కుమాలిన బిడ్డలకును, నష్టిఁ బొందినవారికిని, విశేషముగ ధర్మము చేయుచుండెను. ఒక నాఁడు విక్రమాదిత్యుఁడు తన మంత్రులకుఁ 'బ్రతి దినము నయిదు లక్షల బంగారు నాణెములఁ బంచి పెట్టుఁ' డని చెప్పెను. అందుపయిఁ గోశాధికారి, 'అట్లుఁ గావించిన కోశము లోని ద్రవ్య మయిపోవు' ననియెను. 'నీ కోశము వట్టిపోయిన యెడలఁ బిదపఁ గ్రొత్త పన్నులు విధింపఁబడును. భూమిమీఁద విధింపఁబడిన సుంకములు గూడ నయిపోయిన యెడల యోజింపవచ్చును' అని విక్రమాదిత్యుఁడు బదులు పలికినట్లు బౌద్ధ గ్రంథములలోఁ గలదు. ఈ విక్రమాదిత్యుఁడు ధర్మపరుఁడు గనుక ధర్మములు చేయుటకుఁ గోశములోని ద్రవ్యము చాలకున్న ఋణము తెచ్చి చేయుననియుఁ, గోశాధికారియగు మంత్రి విక్రమాదిత్యుని యభిప్రాయము ననుసరించి వెచ్చింపకున్న అందువలనఁ బొందుచున్న సమ్మానము పోఁగొట్టుకొనుననియుఁ దెలియుచున్నది. ఈ కథావైచిత్ర్యమే అశోకుని మంత్రి విషయమయి హుయానుత్సాంగు కాలమున కెక్కెఁ బడినది. కోశములోని ద్రవ్యమును ధర్మకార్యములకయి వినియోగింపవలయునను రాజు కోర్కెను గూడఁ బాటింపక తిరస్కరించుటను జూడ మంత్రులకుఁ గల ప్రజానురాగము విశదపడుచున్నది. (హుయానుత్సాంగు వ్రాఁతలు, ౧.) మంత్రులు వారి సొంత పనులకు మాత్రమే గాక ప్రభువుయొక్క కార్యములకుఁ గూడ బాధ్యతను వహించి యుండిరి. సంస్కృత నాటకమగు ముద్రారాక్షసమున నీ యూహ అనఁగా మంత్రి వర్గము యొక్క బాధ్యత స్పష్టముగ వెల్లడింపఁబడినది. 'ఏ తప్పిదమైనను రాజు చేసిన యెడల నది మంత్రి దోషమై యున్నది. ఏనుఁగు తప్పుదారి నడచుట మావంతుని తప్పిదము గదా!' యని ముద్రారాక్షసములోని మూఁడవ యంకమున వ్రాయఁబడినది. ఈ విధముగనే కన్యాకుబ్జ నగర (కనోజు) విభుఁడగు రాజ్యవర్ధనుఁడు దుర్మార్గముగ జంపఁబడినప్పుడు మంత్రులు హర్షవర్ధనునితో నిట్లనిరి. 'ఈ దురదృష్టమునకును, దుర్మార్గ కృత్యమునకును మమ్ముల నిందింపుఁడు. రాజ్య వర్ధనుని ఒంటిగ నితర ప్రభుత్వ భవనమునకు సిబ్బంది లేకుండఁ బోనిచ్చుట మాది తప్పు' అని చెప్పినట్లు హర్ష చరిత్రమున నాలవ యధ్యాయమున వ్రాయఁబడినది. సాధారణ సమయములలోఁగూడ మంత్రులు రాజ్యాంగమునందు గొప్ప పదవులు గలిగి యుండిరి. కాని రాజుగారి అప్రాప్త వ్యవహార దశలోఁ గాని లేక రాజు దుర్బలుఁడయి యున్నపుడు గాని మంత్రుల యధికారములు విస్తారముగనుండెను. సింహాసనము ఖాళీగానున్నపుడు మంత్రులు 'రాజనిర్మాతలు' చర్యను జరుపుదురు. శతపథ బ్రాహ్మణమునఁ బ్రభుత్వోద్యోగులఁ గొందఱిని 'రాజనిర్మాతల' ని పిలిచినట్లుఁ గనిపించుచున్నది. చాణక్యుఁడు చంద్రగుప్తుని మగధ సింహాసనము పయి నుంచి పట్టాభిషిక్తుఁ జేసినట్లు నిదర్శనము గలదు. వాయు పురాణము



నందును ఇతర పురాణములందును 'చంద్రగుప్తమ్ రాజ్యే కౌటిల్యః స్థాపయిష్యతి' యని యున్నది. చరిత్రాత్మక కవి యగు బాణుఁడు హుయానుత్సాంగువలెఁ గన్యాకుబ్జ నగర విభుఁడగు రాజ్యవర్ధనుని వంశీయుని నెట్లు లేర్పఱచినదియు మనకుఁ దెలియును. భండి యను ప్రధానామాత్యుఁడు మంత్రులను సమావేశపఱచి వారితో 'ఈ దినము జాతియొక్క అదృష్టము నిర్ణయింపఁబడవలసియున్నది. ఏలయన హర్షుఁడు పెద్దవాఁడయినాఁడు. ప్రజలాతని యందు విశ్వాసముఁ గలిగి యున్నారు. అతఁడు రాజ్యభారము వహించవలెనని యుపపాదించుచున్నాను. ఈ సభ యందున్న ప్రతి వారును యోజించి తమ యభిప్రాయమును వ్యక్తపఱుప వచ్చు' నని చెప్పెను. పిదపఁ బ్రధానామాత్యుఁడు 'హర్షుఁడు రాజ్యమును స్వీకరించి తద్భారము వహింపవలయు' నని యుద్బోధించుచు నిట్లనియెను. 'వారి మాటలలోఁ దెలుపఁబడి నట్టులు రాజునకుఁ దగిన అణఁకువ యున్నది. రాజ్యపాలనము ప్రజాభిప్రాయానుగుణ్యముగ నుండుఁగాక!' యని చెప్పి నట్టులు హుయానుత్సాంగు వ్రాఁతలందును హర్ష చరిత్రమునను గలదు. సింహళ దేశపు రాణి యగు లీలావతి మంత్రి లెన్నికొనినట్లును దరువాత సింహాసనము నుండి తొలఁగించినట్లును సింహళములోని శాసనము వలనఁ దెలియుచున్నది. తాత్కాలికముగ రాజు ఊరలేనప్పుడు మంత్రులు దేశమును మిగుల వివేకముతోను బాగుగాను ఏలిరి. విజయుని యనంతరము సంవత్సరము కాలము సింహళ దేశమును మంత్రులే న్యాయదృక్పథముతో నీతిమార్గ మవలంబించి యేలినట్లును, విజయుని మేనల్లుఁడు భారత దేశమునుండి రాఁగా నీ మంత్రు లతని నాహ్వానించి ప్రభుత్వ వ్యవహారములు జూడవలసినదని చెప్పి యొప్పించినట్లును 'మహావంశ' మను గ్రంథమునఁ జెప్పఁబడినది. (అధ్యాయము ౯.) శివాజీ మహారాజు తన రాజ్య మొకప్పుడు 'రామదాసస్వామి' కి ధారవోసి కేవలము హిందూ ధర్మ సంరక్షణముకయి స్వామిచే ననుజ్ఞాతుఁడై సకల రాజ్య స్వీకార మొనర్చినట్లు 'శివాజీ చరిత్రము' న వ్రాయఁబడి యున్నది. శ్రీ మహావిష్ణువు భృగు మహర్షికి రాజ్యము సమర్పించినట్లు జదువుచున్నాము. శ్రీరామ చంద్రుఁడు పితాజ్ఞాపరిపాలనమునకయి కాఱడవుల వసింపఁ బోయి నప్పుడు భరతునకుఁ బట్టము కట్టినను శ్రీరామ సేవా సంసక్తుఁడయి రాజ్య వ్యవహారములఁ జూడ నందున వసిష్ఠాదులే మంత్రుల సాహాయ్యమునఁ బరిపాలనము చేయుచుండిరి. సమర్థులగు మంత్రులున్న యెడల రాజు లేకుండనే రాజ్య వ్యవహారములు నిర్వహింపవచ్చునని చాణక్యసూత్రమునఁ గలదు. 'ప్రతి మంత్రియు బాధ్యతలతోఁ గూడికొన్న స్వామ్యము కలిగి యుండెను. దేశము యొక్క సుపరిపాలనము కొఱకు ఎక్కువ బాధ్యత వహించిన ప్రధానామాత్యుఁడే హక్కును గలిగి యుండెను. అన్ని సమయములలోను ఒరులకుఁ దెలియకుండఁ బనులఁ జేయవలసి యున్నపుడు ప్రధానామాత్యునితో రాజు ఆలోచించును.' అని యబుల్ ఫజుల్ అను నతఁడు 'హిందూ ప్రభుత్వ సంప్రదాయ' మభివర్ణించుచుఁ జెప్పినాఁడు. రాజు మిగుల ప్రజ్ఞావంతుఁడయినఁ దప్ప లేకున్న రాజ్యమునకుఁ బ్రధానామాత్యుఁడే నిజమయిన పాలకుఁడుగ

నుండెను. ‘ప్రజాకార్యముల నిర్వహించుట అంతఃకలహములనుండియు విదేశశత్రు దాడులనుండియుఁ గష్టములనుండియు రాజ్యమును సంరక్షించుట, భూమి వృద్ధి సైన్య సంరక్షణము ప్రభుత్వ సుంకములను వసూలు చేయుట, ఆక్రమణము వ్యయము—మొదలగు పనులన్నియుఁ బ్రధానామాత్యుని పయి నాధారపడియున్న’ వని చాణక్యుఁడు చెప్పుచున్నాఁడు. (అర్థశాస్త్రము, పుస్తకము ౮, అధ్యాయము ౧.) భరద్వాజుని యభిప్రాయము ననుసరించి రాజ్యమునఁ బ్రధానామాత్యుఁడే ముఖ్యమైన వ్యక్తి యనియు రాజు కన్నను మిగుల ముఖ్యుఁడనియుఁ దెలియుచున్నది. ‘ప్రధానామాత్యుఁడు లేని సమయమున రెక్కలు లేని పక్షివలె రాజు ఏ పనియుఁ జేయఁజాలని అసమర్థుఁడయి యుండును. రాజు తరువాత ప్రధానామాత్యుఁడే ముఖ్యుఁడని భరద్వాజుఁడు చెప్పుచున్నాఁడు. ‘రాజు మంత్రులను నియమించును. మంత్రులలో దుర్మార్గుఁడున్నయెడల నతనిఁ దొలఁగించి యాస్థానమున మఱియొక మంత్రిని నియమించు’ నని చాణక్యుఁడు చెప్పుచున్నాఁడు. (అర్థశాస్త్రము, పుస్తకము ౮, అధ్యాయము ౧.) ముద్రారాక్షసమున వర్ణింపఁబడిన రీతిని తెలివిగల ప్రధానామాత్యుఁడు రాజు నెడ నుపయోగించు పలుకుబడి చాణక్య చంద్రగుప్తుల వలె నున్నదని తెలియుచున్నది. ఈ నాటకమునఁ బ్రధానామాత్యుని యుపదేశము లేకుండ పొత్తుగ నిస్సహాయుఁడయి యుండు వ్యక్తివలెఁ జక్రవర్తి యభివర్ణితుఁ డయ్యెను. చాణక్యుని యాలోచన లేకుండఁ గొద్దిగనో గొప్పగనో యే పరిమాణమయినను రాజు గ్రహించుట లేదు. ఇట్టి స్వాతంత్ర్యము పలుకుబడి పూర్వపు మంత్రులకుఁ గలదనుట నిస్సంశయము. పూర్వపు మంత్రులలోఁ జాలమంది చిరకాలము స్వప్రయోజన రాహిత్యముతోఁ బ్రభుత్వమును సేవించిరి. అట్టి మంత్రులుండిన ప్రభుత్వములు గొన్ని వేళల యందు విస్తీర్ణమును ఐశ్వర్య ప్రదమును నగు ప్రభుత్వము లని యభివర్ణింపఁ బడియెను. పూర్వపు మంత్రులు నిరాడంబర జీవితముల గడపిరి. వారెన్నఁడును భోగ పరాయణులయి వర్తింపలేదని చాణక్యుఁడు చెప్పుచున్నాఁడు. (పుస్తకము ౫, అధ్యాయము ౬.) కౌటిల్యుఁడు శిథిలావస్థ యందున్న కుటీరమున జీవించుచుండినటులు ముద్రారాక్షసములోని మూఁడవ యంకమున వర్ణింపఁ బడియెను. ఈ వర్ణనము ప్లేటో తత్త్వజ్ఞుని వర్ణనమునకుఁ బోల్ప వచ్చును. ‘గార్డియనులు కుటీరములలో నివసించుచుండిరి. వారుండుట కిండ్లును సాగు చేయుటకు భూములును,—ఏ యితరాస్తియును లేక యుండిరి. వారి జీతము భోజనమునకు సరిపోవుచుండెను. వారికి దుబారా కర్చులు లేవు. వారి ఋజువర్తనము మాత్రము నిలిచియున్న’ దని ప్లేటో తన రిపబ్లిక్ గ్రంథమున వర్ణించినాఁడు. భాసుని ప్రతిమా నాటకమునను స్వప్నవాసవదత్త యందును రాజుయొక్క సంరక్షణమునకయి యే యపాయములనైనను అనుభవించుటకు సిద్ధపడు వ్యక్తి యని ప్రధానామాత్యుఁడు వర్ణింపఁ బడియెను. మంత్రులలోఁ గొందఱు అత్యాశతో నుండిరి. పరుల వలనఁ గోశమునఁ జేర్పఁబడిన ద్రవ్యమును దన స్వోపయోగమునకుఁ జాణక్యుఁ డుపయోగించును. ‘సమాహర్త’ యను వాఁడు మొదటఁ దన సొంత ద్రవ్యమును



గోశమున జమకట్టి పిదపఁ బ్రభుత్వమువారి సుంకములను వసూలు చేయును. కొందఱు మంత్రులు దుర్మార్గముగను నైచ్యముగను నుండి తఱచు రాజునకుఁ జెడు సలహా నిచ్చుచుందు’ రని మృచ్ఛకటిక యను సంస్కృత గ్రంథమునఁ జెప్పఁబడినది. కాలకవృక్షీయ క్షేమదర్శి సంవాదమున ‘మంత్రి రాజున కిష్టుఁడు గాక పౌరజానపదాప్తుఁడుగ నుండవలయు’ నని చెప్పఁబడినటులు శాంతి పర్వము ద్వితీయాశ్వాసమున ౧౬౯ వ పద్యమున నున్నది. దీని బట్టి మంత్రి ప్రజలచే నెన్నికొనఁబడు వాఁడుగ నుండెనని తెలియుచున్నది. ప్రధానామాత్యుఁడు రాజ్యములోని ప్రజల యందతి సమ్మతి పయిని తదున్నతస్థాన మలంకరించు వాఁడనియుఁ దెలియుచున్నది. రాజ్యములోని వివిధ విషయములను బరిపాలించుటకయి వేర్వేఱు మంత్రులను గూడ నియమింప వలసినట్లు ధర్మరాజు పట్టాభిషేక మహోత్సవ సందర్భమున నభివర్ణింపఁ బడియెను. (శాంతి పర్వము.) కార్య నిర్వాహక వర్గమునఁ బ్రధాన మంత్రి యగు విదురుఁడు తక్కిన వారలగు సంజయుఁడు యుయుత్సుఁడు మొదలగువారు గలిసి యుండిరనియు ‘ప్రధాన వర్గముగ నేర్పడి వ్యవహారములను జక్క జేతురనియు రాజునకు మాత్రము వ్యవహారములు జక్కఁగా నడచుచున్న విషయ మప్పుడప్పుడు విధిగఁ దెలియఁ జేయుచుండవలయు ననియుఁ దెలియుచున్నది. సుమనుండను రాజునకు బృహస్పతి ‘ప్రజాహితైషులు గాని మంత్రులను బాటింపఁ గూడదు. మంచి మంత్రుల సలహా లెప్పుడును అంగీకారార్హములు’ అని చెప్పినటులు శాంతి పర్వమునఁ గలదు. ప్రజలతోఁ బర్యాలోచించి వారి యంగీకారమును బట్టి పన్నులు విధింపవలయును. వసూలు చేయవలయును. పన్నులను రాఁబట్టుటకయి అధర్మము పొంతఁ బోవఁగూడదు.

‘ప్రథమమునఁ బ్రారంభించుట సులువే గాని కొన్ని సమయములందు నొకరి వలన జరుగుట దుస్తరము. ప్రభుత్వమును బ్రత్యేకముగఁ బాలించుటయును, హెచ్చు పన్నులను వసూలు చేయుటకును, రాజునకుఁ దోడ్పడువారు లేనప్పుడు ఎంత కష్టముగ నుండునో చెప్పవలయునా?’ యని మనువు చెప్పుచున్నాఁడు. (VII, ౫౫.) ‘ఇతరుల సాహాయ్యముతో మాత్రమే రాజ్యమును జేయవచ్చు’ నని కౌటిల్యుఁడు చెప్పుచున్నాఁడు. పరిపాలనా శకటము ఒంటి చక్రముతోఁ గదలఁజాలనట్లు రాజు మంత్రులు లేనిదే రాజ్యము చేయలేఁడనియు, మంత్రులను నియమించి వారి యూహలను బట్టి వర్తించుననియు, నర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౧, అధ్యాయము ౭.) కేంద్ర పరిపాలనము ప్రధానోద్యోగులగు పెక్కుమంది మంత్రుల తోడ్పాటుతోఁ బ్రభువు నడపుచుండెను. కావున సోదరులారా! పూర్వపు మంత్రు లెట్లు ప్రజలకు బాధ్యత వహించి ప్రజాస్వామ్యము నిర్వహించిరో, రాజునకును—మంత్రులకును, మంత్రులకును—ప్రజలకును,—ఎట్టి సామరస్యము ఏకీభావముగలదో బుద్ధి వైభవమునందును శక్తి సామర్థ్యములందును సుగుణ సంపత్తి యందును వేర్వడసి యుండిరో, ఆధునిక కాలమునఁ గల మంత్రివర్యులకును,—ప్రభువులకు,—ప్రభువులకును—ప్రజ

లకును,—ప్రజలకును—మంత్రులకును,—గల తారతమ్య మెట్టిదో, వారి పరిపాలనా చతురతకును, ప్రజానురాగమునకును, న్యాయైక దృష్టికిని, ధర్మైకరతికిని,—ఎట్టి విలువ కలదో పరికింతురు గాక!

---

# సైన్యవ్యవస్థ.

---

ప్రాచీన కాలమునఁ దఱచు యుద్ధము లుండుట వలన భారతవర్షమండలి ప్రతి రాజ్యమును గొప్ప సైన్య సన్నాహముతో నుండుట అవసర మయ్యెను. ఆ కారణమునఁ బ్రతి రాజ్యమును గొప్ప రాజ్యాంగ నిర్మాణము నేర్పఱచి స్కంధావారమున వ్యవస్థ కల్పించి యద్దాని కనువగు తెఱంగున బలంబుల నడిపి వ్యూహ చమత్కారములఁ గనఁబఱచి మెలంగుచుండెను. ఆంధ్రరాజ్యము లక్షపదాతులును, రెండువేల అశ్వికదళమును, వేయి గజములును గలిగి యుండె ననియుఁ, గళింగరాజ్యము అఱువది వేల పదాతులును, [illegible] వేల యశ్వములును, ఏడువందల యేనుఁగులును గలిగి యుండెననియు, సౌరాష్ట్ర దేశాధిపతి యొద్ద ౧౬ వందల యేనుఁగులును, లక్ష యేఁబది వేల పదాతులును, అయిదువేల యాశ్విక దళమును నుండెననియు మెగస్తనీసు యవనరాయబారి చెప్పుచున్నాఁడు. (మెగస్తనీసు వ్రాఁతలు, LVL, and LVIB. హర్షవర్ధనుఁడు కన్యాకుబ్జ సింహాసన మధిరోహించి నప్పుడు ఆ రాజ్యమున ౫ వేల యేనుఁగులును, రెండువేల యాశ్విక దళమును, ౫౦ వేల పదాతులును గల స్కంధావార ముండినట్లును హర్షవర్ధనుని పిదప నతని సామ్రాజ్యాధికారము విస్తరించి యుత్తర హిందూస్థానములోని చాల భాగము తన రాజ్యమునఁ గలుపఁ దలఁచి యిదివఱకున్నది గాక అదనముగా నఱువదివేల యుద్ధపు టేనుఁగులును, లక్ష అశ్విక దళమును వృద్ధిఁ జేసెను. (బౌద్ధ గ్రంథములు, పుస్తకము ౫.) పాండ్యులును బలమైన నాలుగువేల యాశ్వికదళమును, లక్ష యేఁబదివేల పదాతులును, నయిదువందల యేనుఁగులును గలిగి యున్నట్లు మెగస్తనీసు వ్రాయుచున్నాఁడు. (LVI) మగధ దేశాధీశుని స్కంధావారమున నాలుగులక్షల పదాతులును, ముప్పదివేల యశ్వములును, ఎనిమిదివేల యేనుఁగులును నుండెను. ఈ సైన్య మంతయు బలీయమైనది. Gangaridæ ప్రజలు (అనఁగా వంగదేశీయు లనుకొనెదను.) వేయి యశ్వములును, ఏడువందల యేనుఁగులును, అఱువదివేల పదాతులును గలిగి యుండిరని ప్లినీ యను నతఁడు వ్రాయుచున్నాఁడు.

సైనిక నిర్మాణము మిగుల కార్యసాధకమైనదిగఁ గనిపించుచున్నది. సైన్యము నాలుగు భాగములుగ విభజింపఁబడినది. కాల్బలము, రథములు, గజములు, అశ్విక



దళము అని నాలుగు విధములు. మహాభారతము ననుసరించి రథములు, అశ్విక దళము ప్రబలమై యున్న సైన్యము చక్కని శీతోష్ణాది పరిస్థితులందుఁ జేయఁబడు యుద్ధమున మిగుల నుపయోగించునని యెన్నఁబడినది. వర్షాకాలమున సిపాయీలతో నుండిన సైన్యము బాగుగ నుపయోగపడును. (మహాభారతము, శాంతి పర్వము, ౨౪, ౨౫ శ్లోకములు.) యోధు లనేక విధములుగ నున్నారు. చాణక్యుఁడు, 'మౌల్యము, భృతులు, శ్రేణులు' అని యోధులను జేర్కొనినాఁడు. శత్రుదేశమునుండి వచ్చిన క్రొత్త సిపాయిలు, పరిసరములనుండి వచ్చిన సిపాయిలు, అడవి జాతులనుండి యేర్చుకొనఁబడిన సిపాయిలు కూలి కేర్పడిన సిపాయిలు, గ్రామ సభల వలన బంపఁబడిన సిపాయిలు అని చాణక్యుఁడు సిపాయిలను విభజించినాఁడు. (అర్థశాస్త్రము, పుస్తకము ౯, అధ్యాయము ౧.) శుక్రనీతి యందు సిపాయిలు రెండు విధములుగ విభజింపఁబడిరి. మౌల్యము, సద్యస్క (క్రొత్త సిపాయిలు,) అనునవి పెక్కు ఉపభాగములుగఁ జేర్కొనఁబడినవి. (అధ్యాయము ౪, పరిచ్ఛేదము ౭.) చాణక్యుని యభిప్రాయమునఁ దండ్రి తాతల నుండి పరంపరగ వచ్చినట్టి వారును, విధేయతయుఁ, దృప్తియుఁ గలిగి శాశ్వతముగ నుండుట కిష్టపడువారు గాక సహనశక్తియు యుద్ధ విద్యయం దతినిపుణతయుఁ గలిగి అనేక రణరంగములందుఁ బోరాడి రాజానుగ్రహమునకుఁ దలయొగ్గి క్షత్రియులయి యున్నవారు ఉత్తములనియు నట్టివారున్న సైన్య ముత్తమ సైన్యమనియుఁ దెలియుచున్నది. (అర్థశాస్త్రము, పుస్తకము ౬, అధ్యాయము ౧.) యోధజాతినుండి యేరుకొనఁబడిన సిపాయిలు రాజ్యాంగము నందలి ముఖ్యాంగము. తండ్రుల నుండి కుమారు లెట్టి వృత్తుల నవలంబించి ప్రవర్తింతురో, అట్లే యీ సిపాయిలును యుద్ధకళయందు మిగుల నిపుణులగుదురు. పారంపర్యముగ వచ్చుచున్న సిపాయిలను రణరంగమునఁ బ్రముఖమున నుంతురు. కూలికయి పనిచేయు సైనికులను సామాన్యముగ వెనుక భాగమున నుంతురు. (హుయానుత్సాంగు బౌద్ధ వ్రాతలు, పుస్తకము ౨.) 'ఆజన్న జాతక' గ్రంథమునఁ గూలికయి పనిచేయు సైనికులను బూర్ణముగ రొట్టె పయి జీవించు యోధులకును గల ప్రతిభలు వర్ణింపఁబడినవి. శుక్రనీతి యందుఁ, 'ప్రభువు యుద్ధమునకుఁ దనమూలబలముతోఁ బోవలయును. ఆ బలము తమ యజమానుల నెన్నఁడును,—ఆపత్సమయ మందైనను విడువ నంగీకింప' రని వ్రాయఁబడినది. (శుక్రనీతి, ౪-౭-౧౨౪) స్కంధావారమున నాశ్వికదళమే మిగుల ప్రముఖముగ నుండెను. అశ్విక దళముయొక్క విలువ గమనము ననుసరించి యున్నది. ముందు ప్రదేశముల నాక్రమించు నిమిత్తము మిగుల నుపయోగపడునని యీ దళమునకుఁ బ్రాముఖ్యత యేర్పడినది. కోశమును సంరక్షించుచుండి శత్రువుల కగు సప్లయిని నిరోధించి, పఱుగువారు శత్రువుల వెంటనంటి, శత్రుసేనలకు వ్యతిరేకముగ నడ్డులఁ గలిగించి స్కంధావారమున వలయు భోజన సామగ్రి జాగ్రత పఱచి పనిచేయుట అశ్విక దళముయొక్క ధర్మము. (అర్థశాస్త్రము, పుస్తకము ౧౦, అధ్యాయము ౪.) అతి విస్తీర్ణ సామ్రాజ్యమును దమ యధికారమునం దుంచుకొని ప్రవర్తిం

చుటయే యాశ్విక దళముయొక్క ధర్మము. చంద్రగుప్తుని సైనికబలము అతని యాశ్విక దళము యొక్క ఉత్తమాధికారము పయి నాధారపడి యుండెనని మనము చదువుచున్నాము. రథము లనేక విధములు. అవి సైన్యమును రక్షించుచుండి శాత్రవుల యునికిని దెలిసికొని శాత్రవ యోధుల దుర్భేద్యమగు వ్యూహమును భేదించి పని చేయుట కుపయోగించును. యుద్ధభూమియందు ఏనుఁగులు చాల యుపయోగకరములని నిర్ణయమయ్యెను. శాత్రవ యోధ విచ్ఛేదము ముఖ్యముగ నేనుఁగులపయి నాధారపడి యుండెనని యర్థశాస్త్రమున వ్రాయఁబడి యున్నది. (పుస్తకము ౭, అధ్యాయము ౧౧.) మెగస్తనీసు Gangaridæ అను వంగదేశ ప్రజలు తమ స్కంధావారమున నున్నతమగు నేనుఁగుల నుంచెడివారని చెప్పుచున్నాఁడు. ఈ కారణము వలన వంగదేశ మెన్నఁడును ఇతర ప్రభువులచే నాక్రమింపఁ బడలేదని మెగస్తనీసు వ్రాఁతల వలనఁ దెలియుచున్నది. (మెగస్తనీసు ఫ్రాగ్మెంటు, ౧.)

క్రీ. శ. ౭ వ శతాబ్దమున మహారాష్ట్ర దేశ ప్రభువు 'పులకేశి' యను వాఁడు హర్షవర్ధను నోడించెను. హర్షవర్ధనునొద్దఁ జాల యడవి యేనుఁగులుండెనని హుయానుత్సాంగు చెప్పుచున్నాఁడు. (హుయానుత్సాంగు జీవితము, పుస్తకము ౮.) ఇతని జీవితమున 'నీ యేనుఁగులు యుద్ధభూమియందు అతి నిపుణతతోఁ బనిచేయును. మత్తు కలుగు నిమిత్తము సారాయి త్రాగింతురు. ఆ కారణమున విస్మృతి కలిగి 'నగారా' వాయింపఁగనే యుద్రేకము కలిగి శత్రువుల నెదుర్కొనును. శత్రువులుగూడఁ దమ స్కంధావారమునం గల యేనుఁగుల కిట్లే యొనర్తు' రని వ్రాయఁబడినది. (పుస్తకము ౮.) ప్రబలాధికార మున్న ప్రభువులు చతుర్ముఖములు గల నావికా సైన్యము కలిగి యుండిరి. 'రాజ్యాంగమున సైనికశాఖ లాఱింటి యందును నావికాశాఖ యొకటి' యని మెగస్తనీసు సూచించుచున్నాఁడు. చాణక్యుఁడు నావికాధ్యక్షుని యధికారము క్రింద నున్న యుద్ధ పడవలను వివరించుచున్నాఁడు. హుయానుత్సాంగు అభిప్రాయము ననుసరించి 'అస్సాము రాజు' ముప్పది వేల యోడలు కలిగియుండెనని తెలియుచున్నది. అతని స్కంధావారమున సేనాముఖ, గుల్మ, గణ, వాహినీ, ప్రతన, చమూ, అనీకినీ, అక్షౌహిణి, పత్తి అను పేరులతో భాగము లేర్పడియుండెను. ఈ భాగము లిప్పటి వ్యూహములు (Battalions), పటాలములు (Regiments), కంపెనీలు (Company), సైన్యములో నొక భాగము (Brigades), భాగములు (Divisions), సైన్యపు దండు (Army Coops), మొదలగువాని వలె నుండునని తోఁచుచున్నది. మహాభారత యుద్ధము పదునెనిమిది అక్షౌహిణుల సైన్య నివహంబులతో జరుపఁబడినది. ఈ సంఖ్య చాల హెచ్చు. ముప్పది తొమ్మిది లక్షల ముప్పదియాఱువేల ఆఱు వందల యోధులు గల సైన్యము మహాభారత యుద్ధభూమియందుఁ బనిచేసె నన్నమాట! ఇదిగాక యొక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకుఁ గొంపోయి సప్లయి చేయు సేవాసంఘము లున్నవి. ఈ సేవా సంఘములు గాక ప్రతి స్వల్ప పరిమాణము గల భాగ



మునందును ౩ వందల సిపాయీలును, ౮౦ గుఱ్ఱములును, రథ మొకటియు, ఫిరంగులు రెండును (బృహన్నాళికలు), రెండు బండ్లును, పది యొంటెలును, బదునాలు వృషభములును నుండెనని శుక్రనీతి యందు వ్రాయఁబడి యున్నది. (శుక్రనీతి, IV. ౭, ౨౨, ౨౩.) ఆశ్విక దళము కన్న నాలుగు రెట్లు కాల్బలమును, అశ్వములలో నయిదవ వంతు వృషభములును, ఎనిమిదవ వంతు ఒంటెలును, ఒంటెలలో నాలవ భాగము ఏనుఁగులును, ఏనుఁగులలో నర్ధ భాగము రథములును, రథముల కన్న రెండింతలు ఫిరంగులును, నుండవలెనని శుక్రనీతి వాకొనుచున్నది. స్కంధావారములోని యన్ని బలములను ప్రధానోద్యోగులు బరిశీలించుచుండిరి. ఈ యుద్యోగులు తమ క్రిందఁ బని చేయు యోధుల సంఖ్యను బట్టి యేర్పడుచుండిరి. (శుక్రనీతి, IV. ౭, ౨౧) పటాలము లన్నియుఁ బలు రకముల చిహ్నములును బతాకలును గలిగి యుండెను. అనేక రకముల బాకాలును, నగారాలును, శంఖములును గలిగి యుండెను. 'తూర్య ధ్వజ పతాకాభిర్వ్యూహ సంజ్ఞా ప్రకల్పయేత్' అని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౨, అధ్యాయము ౩౩.) స్కంధావారమునకుఁ బెంపుడు పావురములవలనను, మఱి యితర సాధనముల వలనను, వార్తలఁ దెప్పించుకొనుచుండిరి. అప్పుడప్పుడు సైన్యములోని పటాలములవారు కవాతు నేర్చుకొనుచుండిరి. ఈ కవాతు యుద్ధము లేని విరామ సమయములందుఁ జేయుచుండిరి. ఆ కవాతు సమయములందుఁ బ్రభువు హాజరయి పరిశీలించుచుండెను. ప్రధాన సేనాపతి రాజ్యాంగమున సైనిక శాఖాధ్యక్షుఁడుగ నుండెను. ఇతఁడు యుద్ధ విద్య యందు బాగుగ తరఫీదు అయి యుండును. అది కారణముగ రణరంగమున సవ్యాపసవ్యములుగ సాధనముల నుపయోగింపఁ గలిగి యుండెను. యోధులు కవాతు చేయునప్పుడు క్రమ శిక్షణ మలవడునట్లుఁ జేయుటయును, రణరంగమునఁ జక్కఁగఁ బనిచేయఁ బురికొల్పుటయును, నీ సైనిక శాఖాధ్యక్షుని ధర్మము. స్థానేశ్వర ప్రభుత్వమున సేనాపతి ప్రవర్తనమును హర్షచరిత్రమునఁ జక్కని కవిత్వ ఫక్కిని వర్ణింపఁ బడినవి. (హర్షచరిత్ర, ఆశ్వాసము ౬.) ఆశ్విక దళాధిపతియు, రథాధ్యక్షుఁడును, గజబలాధిపతియుఁ, గాల్బలాధిపతియు, సేనాధ్యక్షుని యధీనమున నుందురు. ఇతర బలముల యధికారు లెల్లరును వీరి క్రిందివారు. చాణక్యుని యభిప్రాయము ననుసరించి స్కంధావారములోని ప్రతి చిన్న భాగమునకును (Unit) 'పదిక' యను నొక యధికారి యుండును. పదిమంది పదికులు గలిసి నాయకుని యధీనమున నుందురు. ఇతని నాంగ్లమున (General) అని యందురు. (అర్థశాస్త్రము, పుస్తకము ౧౦, అధ్యాయము ౬.) శుక్రనీతి కూడ నూఱుమంది యోధులను బరిశీలించువారిని 'స్థానిక' లనియు, వేయి మంది సిపాయిలను బరిశీలించువారిని 'సాహస్రిక' లనియుఁ జెప్పుచున్నది.

మెగస్తనీసు వచ్చిన కాలమునఁ జంద్రగుప్త చక్రవర్తి సైన్య వ్యవస్థకయి ముప్ప దధికారులుఁ గల సంఘ మేర్పఱచి దానిని గూడ నాఱు పంచాయతులుగ విభ

జించి మొదటిపంచాయతిలోని యధికారులు సముద్రసైన్యమునకును (Admirality రెండవపంచాయతిలోని యధికారులు వస్తుసామగ్రి (Commissariat), ప్రయాణ ప్రయత్నము (Transport), సూత్రగ్రాహకుఁడు యావశికుఁడు మొదలగు క్షుద్ర సేవకుల సంపాదించుటకును, మూఁడవ పంచాయతిలోని యధికారులు కాల్బలమునకును, నాలవ పంచాయతిలోని యధికారులు అశ్వికదళమునకును, అయిదవ పంచాయతిలోని యధికారులు రథసైన్యంబునకును, ఆఱవ పంచాయతిలోని యధికారులు గజసైన్యంబునకును బాధ్యులయి యుండిరి. కాల్బలములోని ప్రతి యోధుఁడును ముఖ్యముగ నొక కత్తియు విల్లమ్ములను గలిగి యుండెను. అతఁడు విడచిన బాణ మెట్టి కవచమైనను (Shield), పలకనైనను, భేదించుచుండెను. అశ్విక దళమునందు యోధుఁడు రెండు బల్లెములను, డాలును యుద్ధమునకుఁ దీసికొని పోవుచుండెను. స్ట్రాబో అను నతఁడు ఒక భాగము నావికాధ్యక్షునితో సహకార మొనర్చుటకును, ఇంకొక భాగము వృషభ, శకటముల యధికారులతో సహకార మొనర్చుటకును, మఱియొక భాగము యుద్ధయంత్రములు గొంపోవుటకును, సిపాయిల భోజనము సప్లయి చేయుటకును, పశువులకు నెండుగడ్డి మొదలగు నాహారములను సప్లయి చేయుటకును, ఇతర సైనికావసరములకును, బనికివచ్చు ననియు, ఇవిగాక యీ శకటములు నగారా వాయించు సేవకులను,—జేగంటలను మోయువారిని, యంత్రగతి శాస్త్ర మెఱిఁగినవారిని, వారి సహకారులను, గుఱ్ఱపు నౌకరులను (మాలీసు చేయువారిని),—ఇంక నితరులను గొంపోవు చుండుననియు, మఱియొక భాగము పదాతుల కేర్పఱుపఁ బడినదనియు, నాలవ భాగము అశ్వములకయి యేర్పఱుపఁ బడినదనియు, నయిదవ భాగము యుద్ధరథములకయి యేర్పఱుపఁ బడినదనియు, నాఱవ భాగము గజములకయి యేర్పఱుపఁ బడినదనియు, గుఱ్ఱములకును ఏనుఁగులకును ప్రభుత్వము వారి లాయములును, ఆయుధములకుఁ బ్రభుత్వము వారి యాయుధాగారమును నుండెననియు, ఏలయనఁగా సిపాయి తన యాయుధములను ఆయుధాగారమునకుఁ దిరిగి చేర్చవలసి యుండెననియు, నతని గుఱ్ఱమును నేనుఁగును లాయములకుఁ జేర్చవలసి యుండెననియుఁ, బ్రతి రథముమీఁదను సారథిగాక యిరువురు రథికు లుందురనియుఁ, గొన్ని రథములమీఁద నిరువురు సారథులును, నిరువురు ధనుర్ధరులును, నిరువురు పలకధారులును నుందురనియు, యుద్ధపుటేనుఁగు నలుగురు మనుష్యుల మోయుచుండుననియు, నీ నలుగురిలో నొకరు మావఁతుడును, ముగ్గురు బాణముల సంధించువారును నై యుండిరనియుఁ జెప్పుచున్నాఁడు. (మెగస్తనీసు ఫ్రాగ్మెంటు ౨౪) ఆపత్సమయములందును,—ఇతర సమయములందును, పెక్కు రకముల ఆయుధము లుపయోగింపఁ బడెడివి. ఋగ్వేదమున విల్లమ్ములు, కవచములు, బాణములు,—మొదలగు వానిని గూర్చి చెప్పఁబడినవి. వైదికయుగమున యుద్ధములు స్వల్పముగ నున్నవని తెలియుచున్నది. పదాతులతోను రథికులతోను బ్రతి సైన్యమును ముప్పిరిఁ గొనియుండెను. ఒక్కొకప్పుడు పదాతులకన్న రథికులు హెచ్చుగ నుండుట సంభవించుచుండెను. క్షత్రియులును, బ్రాంగణమున నున్న భృత్యులును హెచ్చుగ



నుండిరి. పదాతులు గొంచెముగఁ గవచమును ధరించుచుందురు. ఆపత్కాలమున మాత్రము వీరు విల్లమ్ముల నుపయోగించెదరు. ప్రభువులు యుద్ధభూములందు బొమ్మ కవచమును (వర్మమును), ఇనుపకుళాయిని (శిలాత్మజ శీర్ష బంధనము), హస్తఘ్నమును ధరింతురు. బండిమీఁద రథికుఁ డొకఁడును, అతని యెడమ ప్రక్కను యోధుఁ డొకఁడును నుందురు. ఆపత్సమయములం దుపయోగించు నాయుధము సామాన్యముగ ధనుస్సు అయి యున్నది. కత్తియు, గొడ్డలియు, బల్లెమును అరుదుగ నుపయోగించెదరు.' (Vedic Index, ౧౧ పుట ౪౧౭.) చాణక్యుఁడు క్రింది విధముగ నాయుధములను జేర్కొనినాఁడు. 'చలనము లేనివి (స్థితయంత్రములు), చలనము గలవి (చలయంత్రములు), విల్లమ్ములు, బాణములు, కత్తులు, నాగేటికఱ్ఱు అంచులున్న ఆయుధములు,—ఇతరాయుధములు,—అని ఆయుధములను విభజించినాఁడు. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౧౮.) ఇందలి ప్రతి యాయుధమును గొన్ని యుపభాగములుగ విభజింపఁ బడినది. మహాభారతమునందుఁ బెక్కు రకముల ఆయుధములు చేర్కొనఁ బడినట్లు దెలియుచున్నది. యుద్ధములలోఁ దఱచు నుపయోగించునవి గండ్ర గొడ్డలి, విల్లు, బాణము, వజ్ర, (పిడుగు), చక్రము, దుడ్డుకఱ్ఱ అని మహాభారతమునఁ జెప్పఁబడినది. అగ్ని పురాణమున నాయుధము లయిదు తెఱఁగులుగ వివరింపఁ బడినవి. ౧. యంత్రముల వలనఁ బోఁగొట్టునవి. (యంత్రముక్త), ౨. హస్తమువలనఁ బోఁగొట్టఁ బడునవి (పాణిముక్త), ౩. ముక్తసంధృత, ౪. అముక్త, ౫. బాహుయుద్ధమున నుపయోగించు నాయుధములు అని యైదు విధములు. (అగ్ని పురాణము, అధ్యాయము ౧౪౯.) శుక్రనీతియందు 'బాణము' గదా (ఈటె), పట్టిస, ఖడ్గ, చక్ర, సుపాశక, కరిజ, ఇషు (బాణము), క్షురప్రాంత, ఏకధార,' యని యాయుధములు వివరింపఁ బడినవి. (శుక్రనీతి, అధ్యాయము ౪, పరిచ్ఛేదము ౭.) నీతిప్రకాశిక యను గ్రంథమున రణరంగములో నుపయోగించు నాయుధము లన్నియుఁ జేర్కొనఁ బడినవి. ఈ గ్రంథ మాధునికము. ప్రాచీన గ్రంథముల పయి నాధారపడి యియ్యది వ్రాయఁబడినది. 'ఆయుధములు పూర్వము మన వారు ఉపయోగించి యుందురు. ముక్త, ధను, ఇషు, భిండివాల, శక్తి, ద్రుఘన (చిన్ని గొడ్డలి), తోమర (గండ్ర గొడ్డలి), నాళిక (తుపాకి), లగుడ (చిన్ని కఱ్ఱ), పాశ, చక్ర, దంతకంటక (పల్లుముల్లు), ముసుండి (అష్టకోణాకృతి శిరముగల దుడ్డుకఱ్ఱ), అనియు,—అముక్త, వజ్ర, చేకత్తి, పరశు, గోశిర, అసిధేను (కటారి), లవిత్ర (కొడవలివంటి వంకకోత కత్తి), ఆస్తర, కుంత (బల్లెము), స్థూణా (కంసాలిధాని దాగలి), ప్రాశ, (పినాక లేక త్రిశూల), గదా, ముద్గర, శిర, ముసల, పట్టిస, మౌష్టిక (బాకు), మయూఖి (కోల), శతఘ్ని,—ఇవిగాక నలుబదినాలుగు ఇతర రకములును మంత్రముక్త (మంత్రముల నుచ్చాటనము చేయుటవలనఁ బోవునవి), ఇవి పురాణ సంబంధమైన ఆయుధములు. విష్ణుచక్ర, వజ్రాస్త్ర, బ్రహ్మాస్త్ర, కాళపాశక, నారాయణాస్త్ర, పాశుపతాస్త్రములని నీతిప్రకాశిక గ్రంథమున వివరింపఁ బడియెను. ఆత్మరక్షణమున కుపయో

గించు నాయుధములు డాలు, లేక కేడెము, సిపాయిలు తోలుతోఁగాని యినుముతోఁగాని చేయఁబడిన కవచములఁ గప్పికొందురు. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౧౮.) యుద్ధ పరికరములన్నియు నాయుధశాలలలో భద్రపఱుపఁబడును. ఆయుధశాలలు రాజముద్రతో గుఱుతువేయఁబడును. రాజముద్రలు వైచిన అనుజ్ఞా పత్రము లుండిన దప్ప నాశాల కదలించుటకే అవకాశము లేకుండెను (అర్థశాస్త్రము, పుస్తకము ౫, అధ్యాయము ౨)

భారత వర్షమునఁ బూర్వపు దినములలోఁ దుపాకుల నుపయోగించుచుండిరా లేదా యను ప్రశ్నము నిర్ణయము కాలేదు. రామాయణమునందును మహా భారతమునందును ‘వజ్ర, నాళిక, ఆగ్నేయాస్త్ర’ మొదలగు పదములు తుపాకులకుఁ బర్యాయములుగ గనిపించుచున్నవి. శుక్రనీతి సారమున ‘అయిదు పాళ్ళు శుద్ధమయిన సువర్చలవణమును, ఒక భాగము గంధకమును బాగుగఁ గాల్పఁబడిన యర్క స్నుహ్యాద్యంగారం బొక భాగమును, గ్రహించి వేర్వేఱ చూర్ణముఁజేసి మఱి యన్నియుఁ గలిపి యర్కాదిరసమునఁ బాకముచేసి యెండను నెండించి చక్కెరవలె మెఱల నూఱినఁ జూర్ణమగును. దీనినే తుపాకి మందు అనియు టపాకాయ మందు అనియుఁ బిలుతురు. ఆఱు భాగము లయినను నాల్గు భాగము లయినను సువర్చ లవణమును, నొక భాగము ఇంగిలమును, నొక భాగము గంధకమును, గ్రహించి పై రీతిని చేసిన సేవల నాలాగ్ధంబయిన అగ్నిచూర్ణంబగును. లఘునాలికమునకుఁ గేవల లోహమయమైనను, సీసగర్భంబయినను, అన్యలోహ గర్భంబయినను అగు గోలము గావలయును. నాలికాస్త్రము లోహసారమున నిర్మించినను, ఇతర ధాతువుల నిర్మించినను, బ్రతి దినము కడుగుట మూలమున స్వచ్ఛము సేయించుచుఁ దద స్త్రధారులచే రక్షించుచుండవలయును.’ అని షష్ఠ ప్రకరణమునఁ జెప్పఁబడినది. చాణక్యుఁడు మండెడు చూర్ణములను, దత్ప్రయోగములను, దన్నిర్మాణ విధానములను వివరించుచున్నాఁడు. అగ్ని ధార, అగ్నియోగ, — మొదలగు చూర్ణములు (Powder) శత్రువుల పయి ఱువ్వుట కుపయోగించును. శ్రీవేష్టము, యక్షధూపము, గుగ్గిలము, పారిభద్రము, కంపుగొట్టు కసవు, తెల్ల తెగడచెట్టు, లక్క,—ఇవి గాడిద, గొఱ్ఱె, మేక, యొంటెల మలముతోఁ గలిపి చూర్ణము చేసి చిన్న మాత్రలుగఁ జేయుదురు. ఈ మాత్రలు ‘నగ్నిధారణ’ యని పిలుతురు. పిరియాల చూర్ణము, కాయగచ్చ మొక్క పొడి, మధూచ్ఛిష్టము (మైనము),—ఇవి గాడిద, గుఱ్ఱము, ఆవు, ఒంటెల మలముతోఁ గలిపి చేసిన చూర్ణము శత్రుమారణమునకయి యతని పయి విసరుట కుపయోగించును. సర్వలోహముల చూర్ణము నిప్పువలె నెఱ్ఱగ నుండును. లేక కుండభస్మము, సీసము, తుత్తునాగములను జూర్ణముచేసి పారిభద్రక పుష్పముల భస్మముతోను, మోదుగుచెట్టు చూర్ణముతోను, వెండ్రుకలతోను, తైలముతోను, మైనము కర్పూర తైలముతోను గలిపి మర్దించినట్లయిన నిదియు ‘నగ్నిధారణ’ యను మందు కాఁగలదని యర్థశాస్త్రము. పుస్తకము ౧౩, అధ్యాయము ౭



నందు వ్రాయఁబడి యున్నది. తుపాకి మందు చేయు పద్ధతిని గూర్చియు, ఫిరంగు లుపయోగించు విధానమును గూర్చియుఁ, దుపాకు లుపయోగించు క్రమమును గూర్చియు, శుక్రనీతియందు వివరింపఁబడినది. నీతి ప్రకాశిక యను నాధునిక గ్రంథమున దహించునట్టియుఁ, బ్రేలునట్టియు, తైలమును, శత్రువుల పయిఁ ద్రోయుట కుపయోగించునట్టియు, నొప్పించునట్టియు, హాని చేయునట్టియు, మిశ్రపదార్థములును, వివరింపఁబడినవి. గుస్టవ్ ఆపర్టు దొరగారు భారతదేశమునఁ దుపాకిమందుఁ బూర్వముననే చేయఁబడినదనియు, నితర దేశములలోని ప్రజలకీ విషయము తెలియక ముందే హిందువుల వలనఁ దుపాకులు మొదలగు నాయుధము లుపయోగింపఁ బడెడివనియుఁ జెప్పుచున్నాడు. విదేశ యాత్రికుల వ్రాఁతలలోఁ దుపాకులు మొదలగునవి వ్రాయఁబడలేదు. క్రీ. శ. ౭ వ శతాబ్దమున ‘హుయాను త్సాంగు’ అను నతఁడు ఈ క్రింది మాటలలో నాయుధము లుపయోగింపఁ బడిన విషయమును, స్కంధావారమందలి ప్రతి భాగమునందుఁ గల సంగ్రామ కౌశల్యమును గూర్చియును విశదపఱచుచున్నాఁడు. ‘ఏనుఁగులు దట్టమగు కవచముతోఁ గప్పఁబడియుండును. వాని కొమ్ములు పదను గలిగి ముల్లులవలె నుండును. శకటము పయి నున్న నాయకుఁడు (అధిపతి) తక్కిన వారికుత్తరువు లిచ్చుచుండును. ఆ శకటమునకుఁ గుడి ప్రక్కను ఎడమ ప్రక్కను నిద్దఱు సహచరు లుండి తోలుచుందురు. నాలు గశ్వములను ఆ శకటమునకు వరుసగఁ గట్టుదురు. సేనానాయకుఁడు ఆ శకటమునఁ గూర్చుచుండును. సేనానాయకుని చుట్టును రక్షకు లుందురు. బండి చక్రముల వెంటనే వీరుందురు. ఆశ్వికదళము శాత్రవ యోధులను వారి సైన్యమును నెదుర్కొనుటకయి ముందు భాగమున నుండును. ఓటమి సమయమున నీ దళము ఆవల యీవల నుత్తరువులఁ గొంపోవుచుండును. శీఘ్ర గమనముల వలనఁ గాల్బలము రక్షణ కనుకూలించును. ధైర్య స్థైర్యములఁ బట్టియు, శక్తి సామర్థ్యములఁ బట్టియుఁ, బదాతుల నేర్చికొందురు. వీరు పొడవయిన నీటెయును గొప్ప డాలును ధరించుచుందురు. కొన్ని సమయములందు వీరు పట్టా కత్తియును గత్తియును బట్టికొని యుద్వేగమున ముందుకు నడతురు. వారి కుండు ఆయుధము లన్నియుఁ బదను గలిగియుఁ బదను గలవియు, మొనఁ గలవియు నై యున్నవి. వానిలోఁ గొన్ని విల్లమ్ములు, కత్తులు, గండ్ర గొడ్డళ్లులు, బల్లెములు, డాలులు, ఈటెలు, అనేక రకముల యొడిసెలలు, పొడవుగను జిన్నవిగను నున్న ఈటెలు—మొదలగునవి. ఇవి చాల తరముల నుండి వాడుకలో నున్నవే!’ యని బౌద్ధ గ్రంథములలో వ్రాయఁబడి యున్నది. (పుస్తకము ౨.)

యుద్ధోపక్రమణమునకుఁ బూర్వము శిబిరముల నేర్పాటు చేయుటకయి మంచి ప్రదేశముల వెదుకవలసి యుండెను. మహా భారతము ననుసరించి గ్రామములకు దాపున నున్న అరణ్యములలోనే శిబిరముల నేర్పాటు చేయవలసి యున్నదనియు, నట్టి ప్రదేశ





ములు చాల యనుకూల ప్రదేశములనియుఁ, బరిగణింపఁబడెను. రణరంగము నేర్పఱచుకొనుటను గూర్చి మహాభారత మిట్లు వాకొనుచున్నది. 'యుద్ధవిద్యయం దారితేరినవారు నిర్ణయించిన ప్రదేశమయి యుండవలయును. బురదగాను వెల్లువతోను నుండక మొలక పల్లములు లేక రాలతోను ఇటుకలతోను గ్రుచ్చియుండక ఆశ్విక దళపుఁ బనుల కనుకూలముగ నుండవలయును. పంకమును రంధ్రములును లేని ప్రదేశము రథికుల కనుకూలించును. అడుగు భాగమున నీరుండి నికుంజముల చేతను, వృక్షముల చేతను బరివ్యాప్తమయి యున్న ప్రదేశము గజయోధుల కనుకూలించును. ప్రదేశానర్హములును, పెద్ద వృక్షములును, దోఁపులును, వెదురు పొదలును గలిగి యారణ్యక ప్రదేశములనియుఁ, గొండ ప్రదేశములనియుఁ బేర్వడసిన చోటులును గాల్బలము యొక్క కార్యముల కనుకూలించును.' (మహాభారతము, శాంతిపర్వము, శ్లో॥ ౧౧, ౧౩.) చాణక్యుఁడును రణరంగమునకుఁ దగిన ప్రదేశమును గూర్చి వివరించి యున్నాఁడు. కాని సామాన్యముగ ఆలోచనను మాత్ర మిచ్చుచున్నాఁడు. 'విజయమందిన వాఁడు తన సైన్య నివహంబుల వ్యూహములు వైరివీరులకు దుర్భేద్యముగను, అననుకూలముగను నుండునట్లుఁ బయినిఁ బేర్కొనిన ప్రదేశము నేరికొను' నని మహాభారతమునందును, శుక్రనీతి నాలవ యధ్యాయమునను, వివరింపఁబడినది. కొన్ని సమయములందు ఆయా ప్రదేశముల నాక్రమించు నిమిత్తము కాలవిళంబనము గూడ జరుగును. ఆ సందర్భములలో శాశ్వతమగు శిబిర మేర్పఱతురు. చాణక్యుఁ డట్టి శిబిరమును గూర్చి దిగువ విధముగఁ జెప్పుచున్నాఁడు. 'అట్టి ప్రదేశము కట్టడముల కుపయోగించును. సేనాధిపతి, వడ్రంగులు, జ్యోతిషులు, శిబిరమునకయి వలయాకృతిగ గాని సమకోణముగఁ గాని ఉదగముగఁ గాని కొలతలవైచి, నాలుగు ద్వారములును నాలు గోడ్లును రక్షణ బురుజులును,—గుంటలు పిట్టగోడలు ఉద్గమన మార్గములు తాత్కాలిక ప్రభుత్వ భవనము,—ఇవి తొమ్మిది భాగములుగ నేర్పాటుఁ జేసి ఆ ప్రదేశ మంతయుఁ జక్కని భవనములతో నలరారునట్టు లొనర్తు' రని యర్థశాస్త్రమున వ్రాయఁబడి యున్నది. (పుస్తకము ౧౦, అధ్యాయము ౧.) ఇంకను రణరంగము నందలి సైన్య సన్నాహముల యేర్పాటులు మిగుల జాగ్రతగను విపులముగను సూచించుచున్నవి. 'చాలకాల మనుభవమున్న వారును సిపాయీలును ధైర్యమును బట్టియు బలమును బట్టియు సేనాముఖమున నిలుతురు. దుర్బలమైన యోధులు సైన్యమున నుండుట యరుదు.' అని శుక్రనీతి నాలుగవ యధ్యాయమునఁ జెప్పఁబడి యున్నది. 'నీతి ప్రకాశిక' యను గ్రంథమున 'ఏ సమయము శత్రువుకుఁ గీడు సంభవించునట్టిదో, యే సమయమున నట్టిది చేకూరునో, యాయంశముల పయి దృష్టి నిగుడ్చుటయే సైన్యబలము యొక్క ధర్మము.' అని చెప్పఁబడినది. (VII, ౫౩.) మహాభారతమున వివిధ రకముల వ్యూహములను గూర్చి వ్రాయఁబడి యున్నది. భారత యుద్ధమునఁ బాండవులు యుద్ధము జరిగినన్నాళ్ళు సైన్యమును వ్యూహములుగ విభజించి విరామ సమయముల నొద్ద నుంచికొనిరి. ఇంతకన్న నెక్కువ ముఖ్యముగు రీతిని కౌరవులు 'చక్రయుధ' మను వ్యూహమును బన్నిరి. కేంద్ర



స్థానము నందలి ముఖ్యనాయకులను రక్షించుటకయి యీ వ్యూహమును బన్ని యుండిరి. ఈ విషయము The Journal of Indian Art and Industry. (హైందవ కళ, పరిశ్రమ యను మాసపత్రిక) యందుఁ జూడ నగును. వ్యూహములు దండ, భోగ, మండల, అసంహత యని నాలుగు విధములని చాణక్యుఁడు చెప్పుచున్నాఁడు. ప్రతివ్యూహమును పెక్కు విధములుగ నభివర్ణిత మయ్యెను. సైన్య పంక్తు లొకటి తరువాత నొకటి యేర్పడిన 'భోగ' యని యందురు. ఒక ముఖముగ నన్ని దిశలను నున్నపుడు 'మండల' యని యందురు. స్కంధావారము నందలి యేర్పాటులలోఁ బ్రత్యేకించిన భాగములను 'అసంహత' యని యందురు. అడ్డముగ నుండు భాగములలో సైన్య సన్నాహమును 'వ్యూహ నిబ్బంధి' యనియు, 'దండ' యనియుఁ బిలుతురు. విల్లమ్ములవారిఁ బార్శ్వము లేర్పడియుండిన నా వ్యూహమును 'సంజయ' యని పిలుతురు. విల్లమ్ములవారిఁ బార్శ్వము లుండి ముందటికిఁ బొడుచుకొని వచ్చి యున్న యెడల నా వ్యూహము 'విజయ' యని పిలుతురు. స్కంధావార పార్శ్వములును బక్షములును దట్టముగ నున్న వ్యూహమును 'స్థూలకర్ణ' యని పిలుతురు. 'విజయ' వ్యూహముకన్న నెదుటి భాగము రెండింతలు బలముగ నున్న వ్యూహము 'విశాల విజయ' యని పిలుతురు. 'విశాల విజయ' వ్యూహము యొక్క పక్షములు ముందుకు విస్తరిల్లి యుండిన ఆ వ్యూహమును 'జమూముఖ' యని పిలుతురు. ఈ వ్యూహము తలక్రిందుగ నొనర్చిన యెడల దానిని 'ఝషాస్య' యని పిలుతురు. 'దండ' యను వ్యూహము మిక్కిలి సన్నగ నుండిన యెడల దానిని 'సూచి' యని యందురు. అదే విధముగ నీ వ్యూహము ఎప్పుడు రెండు పంక్తులుగ నేర్పడునో దానిని 'వలయ' యని పిలుతురు. నాలుగు పంక్తులుగ నేర్పడిన 'దుర్జయ' యని యందురు. ఇవి 'దండ' వ్యూహ భేదములు.

'భోగ' వ్యూహ పార్శ్వములును బక్షములును ఎదుటి భాగము ననుకూపమయిన నిమ్నతఁ గలిగియున్న యెడల 'సర్పసారి' యనియు, 'గోమూత్రిక' యనియుఁ, బిలుతురు. ఎదుటి భాగమున రెండు పంక్తులుండి 'దండ' వ్యూహమున నున్నట్లుఁ బక్షము లేర్పడి యున్న దానిని 'శకట' వ్యూహ మనియెదరు. దీనికి వైకృతముగ నున్న దానిని 'మకర' వ్యూహ మనియెదరు. ఏనుఁగులును, గుఱ్ఱములును, రథములును గలిగి యున్న 'శకట' వ్యూహమును 'వారిపతంతక' వ్యూహ మనియెదరు. ఇవి 'భోగ' వ్యూహ భేదములు.

'మండల' వ్యూహ మనఁగాఁ బక్షములు, పార్శ్వములు, ఎదుటి భాగము వేఱుగ నుండక నొకే రీతి నుండునట్టిది. దీనినే 'సర్వతోముఖ' యనియు, 'సర్వతోభద్ర' యనియుఁ బిలుతురు. ఎనిమిది భాగములుగ నున్న వ్యూహమును 'అష్టానీక' యనియు, జయింపఁ గూడని దానిని 'దుర్జయ' యనియుఁ బిలుతురు. ఇవి 'మండల' వ్యూహ భేదములు.

పార్శ్వములును, పక్షములును, ఎదుటి భాగమును, నొకదానినుండి వేఱొకటి విభేదపడియున్న వ్యూహమును 'అసంహత' వ్యూహ మనియెదరు. వ్యూహములోని యైదు భాగములు వేఱు వేఱుగ నేర్పఱచి యున్న యెడల నట్టి వ్యూహమును 'వజ్ర' యనియు, 'నక్ర' యనియుఁ బిలుతురు. నాలుగు భాగములున్న యెడల నా వ్యూహమును 'ఉద్యానక' వ్యూహ మనియెదరు. లేకున్న 'కాకపది' యనియెదరు. మూఁడు భాగములున్న యెడల నా వ్యూహమును 'అర్ధచంద్రిక' వ్యూహ మనియెదరు. 'కర్కటకశృంగి' యని కూడఁ బిలుతురు. ఇవి 'అసంహత' వ్యూహములోని భేదములు.

రథములు ప్రాగ్భాగమునను, ఏనుఁగులు పక్షములందును, అశ్వములు వెనుక భాగమునను నున్న వ్యూహమును 'అరిష్ట' యనియెదరు. కాల్బలము, అశ్వికదళము, రథములు, ఏనుఁగులు ఒకదాని వెనుక నొకటి నిలిచి యున్నట్టి వ్యూహమును 'అక్ల' యందురు. గుఱ్ఱములు, ఏనుఁగులు, రథములు, కాల్బలము క్రమముగ నొకదాని వెనుక నొకటి యుండిన 'అప్రతిహత' యనియెదరు. (అర్థశాస్త్రము, పుస్తకము ౧౦, అధ్యాయము ౬.) చాణక్యుని యభిప్రాయము ననుసరించి యుద్ధమున నుభయసైన్యములు సిద్ధపఱచి యొండొంటితో డీకొనఁదగు విధానము గమనింపఁదగినది. సేనానాయకుఁడు 'దృఢక' సాధనముఁ 'బదర'ను, 'అసహ్య' సాధనమున 'దృఢక'ను, 'చాప' సాధనమున 'శ్యేన'ను, 'సుప్రతిహత' సాధనమునఁ 'బ్రతిహత'ను, 'విజయ' సాధనమున 'సంజయ'ను, 'విశాలవిజయ' సాధనమున 'స్థూలకర్ణ'ను, 'సర్వతోభద్ర' సాధనమున 'వారిపతంతక'ను ముట్టడించును. 'దుర్జయ' సాధనమున నన్ని రకముల వ్యూహములను సేనాపతి ముట్టడింపవచ్చును. సేనాధ్యక్షుఁడు ఇంతకు సూచించిన సాధనమునఁ గాల్బలమును, అశ్వికదళమును, రథములను, ఏనుఁగులను నిరోధించును. పూర్వకాలమున సంగ్రామపటు (ఖాటక) యను సొరంగమును ద్రవ్వుటఁ దెలిసియుండెను. చాణక్యుఁ డీరకపుఁ బోరాటములను ప్రశంసించుచున్నాఁడు. ఏలయనఁగా నీ పద్ధతిని బట్టి యోధులు మిగుల ననుకూలముగ మెలఁగిరి. ఇంకొక విధానము ఎత్తుననుండి పోరుట. దీనినే ఆకాశయుద్ధ మనియెదరు. ప్రాచీనకాలమున యుద్ధమునందుఁ గోటను ముట్టడించు పద్ధతి కూడ నభ్యసింపఁబడినది. చాణక్యుఁడు కోటను ముట్టడించు విషయమును సేనతోఁ జుట్టియున్న ప్రదేశమును ముట్టడించు విషయమును విపులముగ నభివర్ణించుచున్నాఁడు. మిక్కిలి పురాతనము నుండియు భారతవర్షమున దుర్గముల నిర్మింపఁ బ్రారంభింపఁబడెను. భారతవర్షమున అనార్యజాతులున్నపుడు గూడ దుర్గము లుండెను. విష్ణుస్మృతి యను గ్రంథము అనేక రకముల దుర్గములను సూచించుచున్నది. 'ధన్వన్మహీవృక్షగిరి దుర్గాని' యని విష్ణుస్మృతి యందు వ్రాయఁబడినది. అగ్నిపురాణమునందును శుక్రనీతి యందును నీరకపు దుర్గము లుదహరింపఁబడినవి. 'మానసార'



యను గ్రంథమున 'శిబిర', 'వాహినీముఖ', 'స్థానీయ', 'ద్రోణక', 'సంవిద్ధ', 'కోలక', 'నిగమ', 'స్కంధావార' అను ఎనిమిది విధముల దుర్గము లుదహరింపఁబడినవి. (అధ్యాయము ౧౧) మనువు ఈ క్రిందివిధముగఁ జెప్పుచున్నాఁడు, 'ప్రాకారము పయి నొక విలుకాఁడుండిన యెడల నూర్గురు శత్రువులను యుద్ధమునఁ గీటడంచును. పేరు మంది విలుకాండ్రుండిన యెడలఁ బదివేవుర శత్రువుల నుక్కడంతురు.' (మనుస్మృతి, ౭, ౭౪.) ఇంకను 'తాలతోను మట్టితోను గట్టిన దుర్గములును, నీటి వలనను చెట్ల వలనను సంరక్షింపఁబడు దుర్గములును' వివరించుచున్నాఁడు. ఈ దుర్గము లన్నిఁటి యందును జిన్ని కొండ దుర్గములు చాల మంచివి. మహాభారతము కూడ ననేక రకముల దుర్గములను సూచించుచున్నది. మఱియు రాజుకు దుర్గనిర్మాణముల కనుగుణ్యముగ నీ క్రింది సలహా నిచ్చుచున్నది. 'బలమైన విరోధి దుర్గమును ముట్టడించినప్పుడు దుర్గములోని రాజు దుర్గరక్షణకయి చుట్టును బాహ్య ప్రాకారముల వృద్ధిఁజేయువలయును. కందకముల నిండ నీరుంచి యందు మకరములును జేపలను నుంపవలయును. కందకముల పయి వ్యాఘ్రముల నేర్పఱచి యుంచు మారణయంత్రముల నుంపవలయును. బావులను గట్టించి యా మూలమున నీటిని సప్లయి చేయవలయును. ఆయుధశాలలను శిబిరములను, విడుదులను, సిపాయీల నిమిత్తమును, ఏనుఁగులు గుఱ్ఱములు మొదలగు వానికి లాయములను,—ప్రభువు ఏర్పఱుప వలయును. 'అతఁడు ద్రవ్యమును వెచ్చించి యాహారము, తేనె, మందులు, పచ్చిగడ్డి, బాణములు, వంట చెఱకుఁ, గత్తులు, పండ్లు, ఈటెలు, శుద్ధి చేయఁబడిన వెన్న, క్రొవ్వు,—మొదలగు నన్ని రకముల పదార్థములతోను గల కొట్టుల నేర్పఱుపవలయు' నని మహాభారతము, శాంతిపర్వమునందు వ్రాయఁబడి యున్నది. (శాంతిపర్వము, శ్లో। ౩౩, ౮౦) చాణక్యుని యభిప్రాయము ననుసరించి, 'రాజ్యము నందలి నలుదిశలను దుర్గములు నిర్మింపఁబడు' నని తెలియుచున్నది. మైదానములలో నేర్పఱచిన దుర్గములు, లంకలలో నేర్పఱచిన దుర్గములు, తాలతో నిర్మింపఁబడిన దుర్గములు, నీటిచే రక్షింపఁబడుచున్న దుర్గములు, గుహలలో నిర్మింపఁబడిన దుర్గములు, గుట్టలపయిఁ గట్టింపఁబడిన దుర్గములు, ఎడారులలో నేర్పఱచిన దుర్గములు, అడవులలోఁ గట్టింపఁబడిన దుర్గములు, పర్వతప్రదేశములలోని దుర్గములు,—మొదలగు నవి యుండెను. 'స్థానీయ' దుర్గమును ఎనిమిది వందల గ్రామములకు మధ్య నేర్పఱతురు. 'ద్రోణముఖ' దుర్గమును నాలుగు వందల గ్రామములకు మధ్య నేర్పఱతురు. 'ఖార్వటిక' దుర్గమును రెండు వందల గ్రామములకు మధ్యగ నేర్పఱతురు. 'సంగ్రహణ' దుర్గమును బది గ్రామములకు మధ్యగ నేర్పఱతు రని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౨, అధ్యాయము ౧.) శుక్రాచార్యుని యభిప్రాయము ననుసరించి, 'అవసరము వచ్చినప్పుడొకరొకరు పరస్పర సాహాయ్య మొనర్చుకొను నట్టుగా స్పష్టమగు విధానమున దుర్గముల నిర్మింతురనియు, నీ దుర్గములలోఁ గొన్ని మిగుల బలిష్ఠమైన వనియుఁ' దెలియుచున్నది. పంజాబు దేశమునను సింధు దేశమునను గల దుర్గములను ముట్టడించుట

కయి అలగ్జాండరు చక్రవర్తి మిగులఁ గష్టపడియెను. మాళవుల ముఖ్య దుర్గమును అలగ్జాండరు చక్రవర్తి తన ప్రాణములఁ బోఁగొట్టుకొని యైనను ముట్టడించవలెనని యతిసాహసముతో ముట్టడించుట వలన స్వాధీనము చేసికొన గలిగెను గాని పాప మతఁడు ప్రాణాపాయ కరమగు గాయముల పాలయ్యెను.

క్రీ. శ. ౬ వ శతాబ్దమునకుఁ బిదప మాండవ్యదుర్గము నిర్మింపఁబడినది. దీని చిహ్నములు పూర్వము కొండల పయి దుర్గములు నిర్మించుటను గొంతవఱకు సూచించుచున్నవి. కుడ్యములు విస్తారమైన యెత్తుఁ గలిగి యున్నవి. అవి లావుపాటి ఱాతిదిమ్మలతోఁ గట్టఁబడినవి. సగటున వాటి వైశాల్యము ఇరువది నాలుగు లేక యిరువది యైదడుగులుండును. స్వభావ సిద్ధముగ నవి బలముగ నుండి బయటనున్న కోటబురుజులచేఁ బరిరక్షింపఁబడుచుండెను. అందుఁ బెక్కులింకను బశ్చిమోత్తర దిశల నిలిచి యున్నవి. కుడ్యముల యవగుంఠనముతోఁ గూడ నీ కోట బురుజులు వర్తకమునఁ జతురముగఁగాని లేక సమకోణములుగఁ గాని యుండును. కాని వాయవ్యమూల నొకటి యుండినను లేక యితర మూలలుండినను, మొత్తము పయిని వటువ్రపగ నుండును. ద్వారములు గ్రిందఁబడిన చెత్త క్రింద దాగి యుండెను. కాని యపి గుర్తింపవచ్చును.

సోదరులారా! మన పూర్వుల సైనిక నిర్మాణ కళయును, సవ్యాప సవ్యములగ నాయుధములఁ బ్రయోగించుట యందలి నిపుణతయును, వ్యూహాభేదములును, దుర్గ నిర్మాణములును, దత్సంరక్షణమును,—గమనింతురు గాక!

# నాగరకము.

ఈ విషయమున మనము తెలిసికొన వలసిన యంశము లెన్నియో గలవు. విద్యావ్యాప్తి యందేమి పరిశ్రమల యందేమి మతము, నీతియందేమి, పూర్వము మనవారు గడించిన విఖ్యాతి మఱవఁ దగినది కాదు. చాణక్యుని కాలమున రాజకీయ మే విధముగ సర్వాంగ శోభనముగ నున్నదో యతని యర్థశాస్త్రముఁ జదివిన వారికిఁ దెలియఁగలదు. నాఁడును ఇప్పటివలె వ్యవసాయము రాష్ట్రమునకును, నేత పరిశ్రమయును, దుస్తులఁ గుట్టుటయును దుర్గమునకును, సంబంధించిన అభివృద్ధి శాఖ యొండుఁ గలదు. నేత పరిశ్రమను బరిశీలించువానికి 'సూత్రాధ్యక్షుఁ' డని పేరు. ఇతఁడు, నూలు, దుస్తులు, బట్టలు, తాళ్ళయొక్క పనులను ఆయా పనుల యందు సమర్థులగు వారిచేఁ జేయించుటయును, వితంతువులు, అంగవైకల్యులు, కన్యాత్వమున నున్న స్త్రీలు,



వేశ్యమాతలు, సన్యాసినులు, దండ ప్రతీకారముఁ గోరువారు, వృద్ధాప్యమున నున్న రాజుగారి దాసీ జనము, పని చేయలేని దేవదాసీ జనము,—వీరిచే నూలు, నార, వస్త్రములును, జనపనారతోఁ జేయఁదగు వలలు, త్రాళ్లు,—మొదలగు నవి నేయింప వలయు' నని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౨, అధ్యాయము ౨౩.) 'కృతకర్మ ప్రమాణ కాలవేతన ఫలనిష్పత్తిభిః కారుభిశ్చకర్మ కారయేత్ ప్రతిసంసర్గంచ గచ్ఛేత్' అని చాణక్యుని నిర్వచనము. అనఁగాఁ గర్మప్రమాణమును బట్టి యింత కాలములో నింత ద్రవ్యమిచ్చిన యెడల నింత పనిని జేయుదుమని యొప్పికొనిన వడ్రంగి, సాలె, సంగలి, చాకలి, చర్మకారకుఁడు (మాదిగ),—మొదలగు వారిచే సూత్రాధ్యక్షుఁడు (నేతపను, వ్యవసాయమునకును, సూపకారుండైనను) వస్తువు నేతపనులఁ జేయింప వలయును. వారికి ఈ వ్యాపారముకలుగుటకుఁ గాను బాహుగూడఁ గలిసి పనిచేయింపవలయు ననియర్థము. ఈ సూత్రాధ్యక్షుఁడు శిల్పులచేతఁ గవచమును, సాలెవాండ్రు మొదలగు వారిచేఁ బలు రకముల బట్టలును, దివాచీలు, అంగీలు మొదలగు వానిని జేయింపవలయుననియు, 'స్వయమాగచ్ఛంతీనాం వా సూత్రశాలాం ప్రత్యుషసి భాండవేతన వినిమయం కారయేత్' అనునట్లుఁ బ్రతిదిన ముదయమున సూత్రశాలకుఁ బోయి యచ్చటికి నూత్రములఁ దెచ్చిన వారికి వేతనముల నొసఁగి వారి సూత్ర భాండములఁ బుచ్చుకొనవలెననియు, 'సూత్ర పరీక్షార్థ మాత్రః ప్రదీపః' 'స్త్రియాముఖ సందర్శనే ఽన్య కార్య సంభాషాయాంవా పూర్వసాహస దండః' అనునట్లు సూత్ర పరిశీలనకు వలయు వెలుతురును మాత్రము నిలుపవలయుననియు, సూత్రవ్యాజమున ఘోషా స్త్రీల ముఖముఁ జూచినను, అన్య కార్యములను గూర్చి వారితో మాటాడినను బూర్వ సాహస దండమునకుఁ బాత్రుఁడగుననియు, వడికిన నూలుకుఁ దరుణములో ద్రవ్యమీయకున్నను వడుకనిదే ద్రవ్యమిచ్చినను మధ్యమ సాహస దండన కర్హుఁడగుననియు, నూలుయొక్క మృదుత్వము, గట్టితనముల ననుసరించి జీతముల నీయవలెననియు, సంఖ్యా బాహుళ్యమును బట్టి పయి స్త్రీలకుఁ దల చమురును, అంగవిలేపనములు, దయతో నిచ్చుచుండవలయుననియు, విశ్రాంతి సమయములందు నీ స్త్రీలను బహుమానముల మూపమునఁ బ్రోత్సహించి నూలు పనులు జేయింపవలెననియు, సూత్రములు తఱిగిన ద్రవ్యసారమును బట్టి వేతనము గూడఁ దగ్గింపవలెననియు 'క్షౌమదుకూల క్రిమితానరాంకవ కార్పాస సూత్రవాన కర్మాంతాంశ్చప్రయుంజానో గంధమాల్య దానైరన్యైశ్చోపగ్రాహికైరారాధయేత్' అనునట్లు శాలువలు, దోమతెఱలు, తెల్లపట్టు చీరలు, బట్టలు, సన్ననూలును వడుకువారికిని, నేయువారికిని, గంధమాల్యాదులను నితరములను బారితోషికముల నిచ్చి సూత్రాధ్యక్షుఁ డారాధింపవలెననియుఁ, దెలియుచున్నది. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౨౩.) కౌటిల్యుఁడు అర్థశాస్త్రమునందలి ప్రకరణాంతమున నెంత పట్టునకు నెంత దారము, ఎంత దూదికి ఎంత నూలు, ఎంత గోవమున కెంత యూలు వచ్చునో సంక్షిప్తముగ వివరించియున్నాఁడు. అయిదు పలముల ప్రత్తి నుండియుఁ బట్టుకాయల నుండియు నొక పలము దారము వచ్చుననియు

నొక తులము ఉన్ని దారము సాపుచేయుటకు అయిదు పలముల రోమము కావలసి యుండుననియుఁ, సాలెవాండ్రకిచ్చిన దారమును సాపుచేసి పదింటి కొక భాగము పొడవు హెచ్చు చేయవలెననియు, నట్లుఁ జేయని సాలెవాఁడు శిక్షార్హుఁడనియుఁ జెప్పుచున్నాఁడు. ఇట్టి విధులలో వృద్ధులకును, స్త్రీలకును, బాలురకును, బనులఁ గల్పించి క్షామము లేకుండఁ జేసిరి. ఘోషా స్త్రీలయినను దరిద్రులుగ నున్నయెడల వారి ఘోషా మర్యాదకు భంగ మొదవకుండఁగ వడుకు వృత్తియందును, నేతవృత్తి యందును జీవింప ననువగు నేర్పాటులఁ జేసి నాఁటి యభివృద్ధి శాఖామాత్యులను దత్సంబంధీకులను వర్తించిరి. కళింగ, కాశి, వంగ, వత్స, మహిష, మధుర, అపరాంత దేశములు దూదిబట్టలకుఁ బ్రసిద్ధి వడసినవనియు, నవి పరిభుక్త్వకోశమున నుంపఁదగిన రత్నతుల్యములనియు, నర్థశాస్త్రమునందలి యిరువది తొమ్మిదవ ప్రకరణమునఁ జెప్పఁ బడియున్నది. 'స్త్రీలు తమ మగ్గములఁ బఱచినట్లు రాత్రి తన చీఁకటిని వ్యాపింపఁ జేయుచున్న' దని ఋగ్వేదమునఁ గలదు. 'నూలుబట్టల వర్తకములోఁ బ్రసిద్ధివడసిన స్థలములందు భృగుకచ' యును, 'చోళ పాండ్యదేశములును సన్నని వస్త్రములకుఁ బ్రాముఖ్యత నందియున్న' వని 'డలాల్' అను చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. కాంభోజదేశ మహారాజు ఉన్నితోఁ జేయఁబడి యందముగనున్న వస్త్రములను, గన్నములనుండు ఒక రీతి జంతువుల రోమములతోఁ దయారు చేయఁబడిన అమూల్యములగు వస్త్రములను, యుధిష్ఠిరునకుఁ గానుకగ నొసంగినట్లు మహాభారతమునఁ జదువుచున్నాము. కాళిదాస మహాకవి తన శాకుంతల నాటకమునఁ 'జిత్రరంగుల చీరలు'ను, 'ఉల్లిపొరవంటి సున్నితములగు నీలాంబరములు'ను, 'చంద్రకాంతివలెఁ దెల్లనైన చీరలు'ను 'చీనాంశుకములు'ను, బెక్కు లభివర్ణింపఁబడినవి. శ్రీహర్షుని యాస్థాన విద్వాంసుఁడగు 'బాణుఁడు' కాదంబరిని వర్ణించుచు నామె తొడలు ఆమె కట్టుకొనిన స్వచ్ఛమగు వసనము ద్వారమునఁ గనఁబడుచుండెనని కాదంబరి నాటకమున వ్రాయఁబడి యున్నది. శ్రీకృష్ణ దేవరాయల యాస్థాన విద్వత్కవులలో నొకఁడగు అల్లసాని పెద్దనామాత్యుఁడు స్వారోచిషమను సంభవమున 'వరూధిని ధరించిన ఎఱ్ఱని పావడకాంతి ఆమెపైన వైచికొనిన ధవళాంశుకము గుండ నామె కూర్చుండి యున్న పీఠముపయిఁ బ్రసరించి యుండె' నని వ్రాయఁబడి యున్నది. ఈ విషయములఁ బట్టి చాల పురాతనకాలమునుండి స్నిగ్ధములును సున్నితములును నగు వస్త్రములు మన దేశమునఁ దయారు కాఁబడుచుండెననియు, అవి యిప్పటి 'గ్లాస్కో' మల్లుల కన్న వేయి మడుంగు లతిశయములనియుఁ దెలియుచున్నది. శ్రీహర్షుని కాలమున నొక సాలెవాఁడు చిన్న బరిణెలోఁ గొన్ని మూరల పొడవుఁగల వస్త్రము నిమిడ్చి శ్రీహర్షునకుఁ బసదన మిచ్చినట్లు చరిత్రలవలనఁ దెలియుచున్నది.

జైనులకు సంబంధించిన శ్రుతస్కంధము లోని ఉకరి కృతాంగ సూత్రమున 'మగధదేశమున' 'వసంతపుర' మొకటి గలదనియు, నందు భార్యాభర్త లిరువురు



నొకే పర్యాయము తురీయాశ్రమ స్వీకార మొనర్చిరనియుఁ గాని యొండొరులకుఁ గల ప్రేమానురాగములు నశింపలేదనియు, నా కారణమున ఆశ్రమము మాలిన్య మొనర్చుట కిచ్చగింపక యనురులఁ బాసిరనియు, మఱు జన్మమున 'ఆరుద్రపురము' న నొక గొప్ప వ్యాపారుని కుమారుఁడయి పెనిమిటి జనించెననియు, 'వసంతపురము' న నొక వర్తకుని యింట నితని పెండ్లాము జన్మించెననియు, నారుద్ర కుమారుఁడు మఱలఁ దురీయాశ్రమ మవలంబింప నెంచఁగా నతని తండ్రి యిష్టపడక యతనిఁ బారిపోకుండఁ జూచుటకయి యైదువందల రాజకుమారుల నుంచెననియుఁ గాని వాహ్యాళి కరుగు నెపమున నతఁడు అశ్వారోహణ మొనర్చి యశరీరవాణి వలదని వారించినను వినక సన్న్యాసి యయ్యెననియు, నతఁడా రూపమున నచ్చటచ్చటఁ దిరుగుచు నొక నాఁడు 'వసంతపురము' నందలి తన భార్యను జూచి గుర్తించి యా వేషమును మార్చి యామెను బరిణయం బాడి యొక పుత్రుఁడు జన్మించిన పిదప నతఁడు తన భార్యతో 'సాంప్రతం తే పుత్రో ద్వితీయో భూన్నిర్వాహకః, అహంచ స్వకార్య మనుతిష్ఠామి' యని చెప్పెననియు, నామె కీ మాట రుచింపక 'తయానుతవృత్యుత్పాద నార్థం కార్పాసకర్తన మారబ్ధం' వడుకుట ప్రారంభించెననియుఁ, గుమారుఁడు తల్లిని 'నీవేమి చేయుచున్నా' వని ప్రశ్నింప నామె, 'మీ తండ్రి మనలను విడువ నుంకించుట వలన మనము మర్యాదగ జీవయాత్ర సాగించుకొనుటకయి నూలును వడుకుచున్నా' నని యతనికిఁ జెప్పెననియుఁ, బిల్లవాఁడును విషయములను దెలిసికొని తల్లి వడికిన నూలుతోఁ దండ్రిని గట్టివైచి 'యీ పోగును ద్రెంపివైచి పోఁగలవా ?' యని ప్రశ్నించెననియు, తండ్రి యతని నూలుపోగునఁ గట్టువడి పండ్రెండు సంవత్సరము లుండెననియుఁ, బిదపఁ దురీయాశ్రమ మవలంబించి మతబోధకుఁ డయ్యెననియుఁ జెప్పఁబడినది. కదురునుండి వెలువడిన సన్నని నూలుపోగుకుఁ గట్టువడి సంసార సముద్రమును దాటలేక యుండుట గమనింపఁదగిన విషయము.

పూర్వము మన ఆర్యులలోఁ గుటుంబమునకుఁ దండ్రి పెద్ద. కుటుంబమును బోషించుట యతని ధర్మమయి యుండెను. బిడ్డలను జూచుచు గృహసంబంధ కార్యములఁ జూచుట తల్లి విధి. పెండ్లి చేసికొనుట జరుగుచుండెను. ఆర్యులు గ్రామములను బట్టణములను గట్టుకొనుచు నిండ్లను ఏర్పఱచుకొనిరి. రథ్యలును, బడవలును నిర్మించికొనిరి. పూర్వుల నాగరకత యంతయు హిందూమతమంతయు నిమిడియున్నది. ఆ కాలమున హిందువులు అతిథిని దేవతుల్యునిగఁ దలంచి పూజించుచుండిరి. 'బాలో వా యది వృద్ధో యువా వా గృహమాగతః, తస్య పూజా విధాతవ్యా సర్వదేవ మయోఽతిథిః' అని చాణక్య నీతిశాస్త్రమునఁ జెప్పఁబడినది. ఆ యుద్దేశము నేఁడు మంటఁ గలిసినది. వసిష్ఠుఁడు ౭, ౮, ౮-౩ లో నీ విధముగఁ జెప్పియున్నాఁడు. 'నేను, వరుణుఁడు,—ఇతఃపురము పడవను దీసికొని సముద్రమున జనినప్పుడు నీటిపయిఁ దేలుచున్న పడవలో సుఖముగను, ఆనందముతోను నుంటిని' అని చెప్పినాఁడు. అప్పటి వారికి

బార్లీ, గోధుమలు ముఖ్యమైన ఆహారము. వీటిని దంపి రొట్టెలఁ జేసికొనుచుండిరి. ఋగ్వేదము నందలి మొదటి మండలములోని ౧౬౨ వ ఋక్కు నందు 'అశ్వమేధ' మును గూర్చి వ్రాయఁబడి యున్నది. నేత పరిశ్రమ మన పూర్వులకు బాగుగఁ దెలియును. ప్రతి యూరు నందును ఇప్పటివలె మంగలి యుండెను. అడవు లగ్నితోఁ గాల్చెడివారు. రథములును బండ్లును గట్టిరి. బంగారము, ఇనుము,—మొదలగు లోహముల నుపయోగించిరి. ౫ వ మండలమునఁ గమ్మరిని గూర్చియు, ౬ వ మండలమునఁ గమసాలి బంగారమును గరిగించుటను గూర్చియుఁ, గత్తులు, విల్లమ్ములు, గిరీటములు, రథములు,—మొదలగువాని ప్రశంస ఋగ్వేదమునఁ గానవచ్చుచున్నది. ప్రతి యింటి యందును అగ్నిహోత్రముండెడిది. స్త్రీలుగూడ చదువుకొని యుండిరి. 'విశ్వవర' యను స్త్రీ కొన్ని కీర్తనల రచించియున్నది. వివాహముకాని బాలికలు తండ్రి యింటియందే యుండి యతని తలూకు ఆస్తిని బొందుచున్నట్లు ఋగ్వేదమునఁ జెప్పఁబడినది. (౨, ౧౭, ౭.) విశ్వామిత్రుఁడు మూఁడవ మండలమును, ఆంగిరసుఁడు తొమ్మిదవ మండలమును, వామదేవుఁడు నాలవ మండలమును, భారద్వాజుఁడు ఆఱవ మండలమును, గణ్వుఁడు ౮ వ మండలమును, అత్రిమహర్షి ౫ వ మండలమును వ్రాసినటులఁ జరిత్రకారులు వ్రాయుచున్నారు. యాజ్ఞవల్క్య వాజసనేయుఁడు యజుర్వేదమును రచించుటచేత 'వాజసనేయ సంహిత' యని గూడ దీని నందురు. యజుర్వేదమునకుఁ దైత్తిరీయ బ్రాహ్మణమును, ఋగ్వేదమునకు ఐతరేయ, కౌషితకి, అను రెండు బ్రాహ్మణములును, సామవేదమునకుఁ బంచవింశ, షడ్వింశ, మంత్ర అను బ్రాహ్మణములును గలవు. కృత యుగమునఁ గులములు లేవనియుఁ, బిదప బ్రహ్మదేవుఁడు వారి వారి వృత్తులను బట్టి కులములుగ నేర్పాటు చేసెననియు వాయు పురాణమున వ్రాయఁబడియున్నది. శాంతి పర్వము ౧౮౮ లోఁ గూడ నిట్లె యున్నది. యజుర్వేదము ౧౬, ౩౦ లో అనేక విధముల వృత్తులు చేర్కొనఁబడినవి కాని యవి ప్రత్యేక కులములు గావు. జ్ఞానముగల వారిని గౌరవ ప్రపత్తితోఁ జూచెడివారు. యాజ్ఞవల్క్యునికిఁ దెలియని విషయములను జనక మహారాజు తెలుపుటవలన నతని బ్రాహ్మణునిగఁ బరిగణించిరని శతపథ బ్రాహ్మణము ౧౧, ౬, ౨, ౧ నందు వ్రాయఁబడి యున్నది. ఇలూషుని కుమారుఁడయిన కవషుఁడు జ్ఞాని యగుటవలన ఋషిగఁ జూచుచుండిరని యైతరేయ బ్రాహ్మణము ౧౧, ౧౯ లోఁ జెప్పఁబడినది. సత్యకామ జబలుని కథ వినిన ఈ విషయము తెలియఁగలదు. (ఛాందోగ్యోపనిషత్తు, ౪, ౪.) జ్ఞాన సముపార్జనమున కిప్పటి విశ్వవిద్యాలయములంబలెఁ బరిషత్తు లుండెడివి. విద్య నభ్యసించుటకయి పాంచాలుర పరిషత్తుకు శ్వేతకేతు అను బాలుఁడు వెళ్ళినట్లు బృహదారణ్యకోపనిషత్తు, ౬, ౨, లో వ్రాయఁబడియున్నది. ఇట్టి పరిషత్తులే కాక ప్రత్యేకముగఁ గొన్ని ప్రాంతముల యుపాధ్యాయులే శిష్యులకుఁ బాఠములఁ జెప్పెడివారు. భారతవర్షమున నుపనిషత్తులు, బ్రహ్మసూత్రములు,—మొదలగునవి యారణ్యకములందుండు ఋషివరేణ్యులు శిష్యులకు నేర్పుచుండిరి. ఇట్టి యుత్తమ



సాహిత్యములోని భావమంతయు రాజయోగ శిక్షణ మందుండి ధ్యానము గలిగియుండినఁ గాని చక్కఁగా బోధపడదని యింద్రుఁడు, దేవతలు, అసురులను సంబంధించిన కథ వలనఁ దెలియుచున్నది. అట్టి శిక్షణముండిన విద్యార్థి మేధాశక్తి వికసించి యందలి భావమును గుర్తింపఁగల్గును. విద్యార్థుల కేవేని సందియములు దోఁచిన గురువులు వెంటనే తీర్చక విద్యార్థుల బుద్ధినైశిత్యము నధికముఁ జేసి వారంతట వారే తమ సందియములఁ దీర్చుకొనునట్లుఁ జేయుచుండెడివారు. భారతదేశ విశ్వవిద్యాలయము లెప్పుడును బ్రకృతి సౌందర్యము విలసిల్లు ఆరామముల మధ్యను, బర్ణశాలికల మధ్యను నేర్పడుచుండెడివి. నాగార్జునుఁడు ఆర్యదేవునితోఁ బాటలీపుత్రమునకు దక్షిణమునున్న యొక గ్రామమును జూచి యచ్చటి ప్రకృతి శోభ కచ్చెరువందెను. నాలుగవ శతాబ్దమున నార్యదేవుఁడా ప్రదేశమున 'నలంద' విహారము నేర్పఱిచెను. కావున నప్పటి మన వారు ప్రకృతి సౌందర్యము బుద్ధి వికాసమునకుఁ దోడ్పడునని గ్రహించిరి. విక్రమశీలుని విహారమునందుఁ బ్రాకార మధ్యమున నెనిమిది వేల విద్యార్థులుండెడు వసతి గృహము లుండెను. పదివేల విద్యార్థులకు భోజన మొసఁగూర్చి విద్యఁ జెప్పెడి వానికిఁ గులపతి యని పేరు. కాళిదాస మహాకవి శాకుంతల నాటకమునఁ గణ్వమహర్షిని 'కులపతి' యని సంబోధించుచు వ్రాసెను. 'మిథిల' విశ్వవిద్యాలయమునందు న్యాయశాస్త్రము రచించిన యొక విద్వాంసుఁడుండెను. ఇతఁడు తన గ్రంథము నొరుల కీయకుండెను. 'నాడియా' విశ్వవిద్యాలయమున కాచార్యుఁడుగనుండిన పండిత వాసుదేవ సార్వభౌముఁడు మిథిలకుఁ బోయి యతని యొద్ద శిష్యుఁడుగనుండి న్యాయశాస్త్రమంతయు వల్లెవైచి యింటికి వచ్చి యొక యున్నత విద్యాలయ మేర్పఱిచెనఁట!

మధుర యందు మూఁడు విద్యాసంస్థ లుండెననియుఁ, బ్రథమ సంస్థ పదునాఱు వేల నూటనలువది తొమ్మిది యేండ్లును, ద్వితీయ సంస్థ పదునెనిమిది వేల యేడునూరుల యేండ్లును, మూఁడవ సంస్థ పదునెనిమిది వందల యేబది యేండ్లును నిలచియుండెననియు మద్రాసు విశ్వవిద్యాలయ పండితులగు ఎస్. కృష్ణస్వామయ్యంగారు తెల్పుచున్నారు. అగస్త్య మహర్షి కాశి యందలి విద్యా పరిషత్తున సభ్యుఁడుగ నుండినప్పుడు తోడి సభ్యులతోఁ దగవు సంప్రాప్తించి యప్పటినుండి బయలుదేరి మధురను వచ్చెననియు, నందలి ప్రథమ సంస్థయందును, రెండవ సంస్థయందును, సభ్యత్వము వహించి యొక వ్యాకరణమును వ్రాసెననియుఁ దెలియుచున్నది.

కలకత్తా పట్టణమున కిరువది క్రోశముల దూరమున భాగీరథీ తటమున ౧౦౬౩ సంవత్సరమున నవద్వీప పట్టణమును, గళాశాలయు నిర్మింపఁ బడియెను. ౧౨ వ శతాబ్దమున మహమ్మదీయులు దండెత్తి నవద్వీపమును స్వాధీనముఁ జేసికొనిరి. కాని పట్టణమునకుఁ గాని, యందలి విద్యాలయమునకుఁ గాని నష్టిఁ గలుఁగలేదు. వేద వేదాంగ షడ్దర్శనములును, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస, తర్కములును, సంస్కృత

ము, బూర్ణముగ నిచ్చోట నేర్పఁబడుచుండెను. ఈ నవద్వీపమునఁ గల వీధుల యందేమి, స్నాన ప్రదేశములందేమి, యెచ్చటఁ జూచినను విద్యా విషయములఁ జర్చించుకొనుచుండు విద్యార్థిగణ ముండెడిదని శిశిర కుమార ఘోషుగారు తెలుపుచున్నారు. ఉత్తర దేశమందుండిన 'తక్షశిల' మహా విద్యాలయమును గూర్చి జనమేజయ మహారాజు సర్పయాగ సందర్భమునఁ జెప్పినటులు మహాభారతమున జెప్పఁబడినది. తక్షశిల విశ్వ విద్యాలయ పట్టణముగఁ బ్రఖ్యాతిఁ జెందినట్లును, 'చెక్కు కళలను శాస్త్రములను నెలవయినట్లును, బౌద్ధజాతక కథలలోఁ వ్రాయఁబడియున్నది. క్రీ. పూ. ౩౨౬ లో నీ పట్టణమునకు 'అంభి' యను నతఁడు ఏలికగ నుండి యలగ్జాండరునకు లోఁబడియెను. ఈ పట్టణము సింధునది నుండి హైడాస్పను వఱకు విస్తరిల్లి యుండెను. ప్రొఫెసరు రాధాకుముద ముఖర్జీగారు బౌద్ధ జాతక కథలనుండి ౫౫౦ జాతకములను సముద్ధరించుచు నిట్లు వ్రాయుచున్నారు. 'పూర్వము కాశీపట్నమేలెడి బ్రహ్మదత్తునకు బ్రహ్మదత్తుఁడను నొక కుమారుఁడుండెను. నాఁటి ప్రభువులు తమ పట్టణములలోఁ బ్రసిద్ధివడసిన పండితులున్నను జదువు పూర్తి యగుటకుఁ దమ కుమారుల నితర ప్రాంతముల కంపుచుండెడివారు. అట్లుఁ జేసినంగాని లోకానుభవమును, గష్టసుఖములలోని శోభయును, దెలిసికొనెడివారు కారైరి. ఆ విధముగనే యీ బ్రహ్మదత్తుఁడును దన కుమారుని తక్షశిలకుఁ బోవలసినదనియు, నే నిచ్చు వేయి నిష్కములను, ఛాత పత్రమును, నొకే యట్టయున్న పాదరక్షలను దీసికొని యచ్చటఁ జదువుకొనుమనియుఁ జెప్పి పంపెను. ఆ పిల్లవాఁడును నతని యాశీర్వాదముం బడసి 'తక్షశిల' కరిగి గురువును జూచి పాదరక్షల విడచి, యాతపత్రము ముడిచి, వినయమున నమస్కరించి నిలుచుండెను. పిల్లవాఁడు శ్రమఁ జెంది యున్నాఁడని దెలిసికొని భోజనము చేసి విశ్రమింపుఁడని చెప్పెను. బ్రహ్మదత్తుఁడును నట్లే యొనర్చెను. పిదపఁ గొంత సేపటికి గురువు నొద్దకుఁ బోయి యెట్టయెదుట నిలుచుండి యుండ నతఁడిట్లు పృచ్ఛించెను.

ప్ర—నీ వెచ్చటినుండి వచ్చితివి ?

కాశినుండి.

ప్ర—ఎవరి కుమారుఁడవు ?

కాశిరాజు కుమారుఁడను.

ప్ర—ఎందుకు వచ్చితివి ?

చదువుకొనుటకు వచ్చితిని.

ప్ర—గురుదక్షిణ తెచ్చితివా ? లేక నాకు సేవఁజేసెదవా ?

నేను వేయి నిష్కములఁ దెచ్చితి' నని యతఁడు గురువు పాదముల కడ నుంచెను.

అచ్చట నుండు విద్యార్థులు దివమున గురుశుశ్రూషయును, రేయి పాఠముఁ జెప్పికొనుటయుఁ జేయుచుండిరి గాని గురుదక్షిణ నిచ్చిన విద్యార్థులు మాత్రము గృహమునఁ బెద్ద కుమారులవలె నుండి విద్య నభ్యసించుచుండిరి. ఆ విధముగనే యితనికి విద్య నేర్పుచుండెను. బ్రాహ్మణ, క్షత్రియ, జాతులవారు తక్షశిల యందలి 'పంచ మహావిఖ్యాత' యను నుపాధ్యాయు నొద్దఁ గళల నభ్యసించుచుండిరి. ఒక మహోపాధ్యాయుఁడు ఎవరు కనిపించినను నైతిక ధర్మముల నేర్పెడివాఁడు. కాశి నుండి వచ్చిన 'జన్హా' యను యువరాజు ఒకని తలపయిఁ గొట్టి భిక్షాపాత్ర పగులఁ గొట్టెను. అతఁడు లేచి యన్నమునకుఁ బైకమీయవలసినదని యడుగ 'నే నిప్పుడీయఁ జాలను. పట్టాభిషిక్తుఁడనయి రాజ్యమేలు నప్పు డిచ్చెద' నని చెప్పెను. దీనిని బట్టి యప్పటి విద్యార్థుల యొద్దఁ గాసయిన నధనముగ నుండెడిది గాదని తెలియుచున్నది. తక్షశిల విద్యాలయమునఁ గోసల దేశాధీశుఁడును, భిషగ్వరుఁడగు జీవకుఁడును విద్య నభ్యసించిరని విమలచరణలా గారు వ్రాయుచున్నారు. విశ్వవిద్యాలయమున నభ్యసించు ప్రతి విద్యార్థికిని పదునాఱు వత్సరముల వయసుండవలయును. రమేశ చంద్రదత్తుగారు 'బౌద్ధమతము సనాతన హిందూమతము నెన్నఁడును దండెత్తలేదనియు, నవి రెండును నేకీభవించి యుండెడివనియుఁ, బ్రభువు లీ రెండు మతములను బ్రోత్సహించుచుండిరనియు, నొక ప్రభువు బౌద్ధుఁడయి యుండ నతని కుమారుఁడు హిందువుఁడుగ నుండెననియు, విక్రమాదిత్యుఁడు మొదలుగాఁ గల ప్రభు సభలయందు రెండు మతముల పండితులు నుండెడి వారనియు,' వ్రాయుచున్నాఁడు. బౌద్ధ యుగమున వైద్య శాస్త్రము మిగుల అభివృద్ధిఁ జెందెను. దేశమంతను వైద్యాలయములు లేర్పఱుపఁబడియెను. ఈ యుగమున చరక, సుశ్రుత, శాస్త్రముల రచయితలు జీవించి యుండిరి. శరీరము భేదించి పరిశోధించు శాస్త్రము (అనాటమీ) మిగుల వృద్ధిఁ జెందెను. విక్రమశిల విహారము ౮ వ శతాబ్దమున 'ధర్మపాలుఁడు' నెలకొల్పెను. ఇందలి పండితుఁడు చదువుకొనుటకయి వచ్చెడి విద్యార్థిని ద్వారము నొద్దఁ బృచ్ఛించును. తగిన ప్రత్యుత్తర మీయఁ గల్గిన లోనికిఁ బోనిచ్చును. లేకున్నఁ బోనీయఁడు. మగధ రాజ్యములోని గంగాతీరమునఁ బర్వతాగ్రమున నీ విహారమున్నది. నాలుగు శతాబ్దముల వఱకు మిగుల వైభవముతో విలసిల్లి ఓదంతపురి, నలంద, విహారములతోఁ బాటు క్షీణించెను. విక్రమశిల, ఓదంతపురి, నలంద విహారములు ౧౧౯౯ వ సం॥ రమున మహమ్మదీయులు దండెత్తి వచ్చి నాశము చేసిరి. ౧౨ వ శతాబ్దమున 'రామపాలుఁ' డను వంగదేశ ప్రభువు 'జగదాల' యందు మఠ మొకటి నెలకొల్పఁగా నొక శతాబ్దము వఱకుండి ౧౨౦౩ సం॥ రమున మహమ్మదీయుల దృష్టియందుఁ బడి రూపుమాసెను. పుష్కరిణి యొద్దునఁ గల 'తాహ్రలిపి' యందు విద్యార్థి వసతి గృహములును, ఇరువది రెండు విహారములును ఉండినవి. బౌద్ధులును, బ్రాహ్మణులును, ఇందు వసించుచుండిరి. మహమ్మద్ గజని వంటివాఁడును దన రాష్ట్రమున విద్యకుఁ బ్రోత్సాహ మొసఁగుచుండెను. గాని యతనికి విగ్రహారాధన యన సహ్యము లేకుండుటవలన దేవాలయ

ములతో సంబంధించి యున్న విద్యాలయములం గూడ నిర్మూలము చేసెను. సుల్తాన్ మహమ్మద్ గజని యనువాడు విశ్వవిద్యాలయమును స్థాపించి చక్కని గ్రంథ నిలయ మొకటియుం బ్రదర్శన శాలయు నేర్పఱచి యుండెను. ఇతని యాస్థానమున 'ఫిర్దౌసీ' కవీశ్వరుం డుండెను. గజనీ యనంతరము 'మహమ్మద్ గోరీ' యను నతఁడు ౧౧౯౩ సంవత్సరమున ఢిల్లీయందు వసించుచున్నపుడు తన యాస్థానమునకు వచ్చిన విద్వాంసుల సేవలను సమ్మానించి గౌరవించెను. ఇతని యనుచరుఁడు 'విక్రమశిల' విహారమును రూపు మాపెను. 'అల్తమషు' అను సుల్తాను ౧౨౧౦ సం॥ రమున ఢిల్లీయందు మహమ్మదీయకళాశాలలను స్థాపించెను. అతని కుమార్తె 'రజియా' యను నామె పరిపాలించినప్పుడు 'విద్యాభిమాని' యని పేర్వాసెను. ఈ విధముగ భారతదేశ మందంతను విద్యాభివృద్ధి జరుగుచుండెను. విద్యాసంస్థలయందు విద్యార్థులు పదిపండ్రెండు వత్సరములు విద్య నభ్యసించి యిండ్లకుం జని వివాహముం జేసికొని గార్హస్థ్యము స్వీకరించెడివారు.

నగరముల చుట్టును గుడ్యము లుండెడివి. నగర మధ్యమునం బ్రభుత్వ భవన ముండెడిది. ప్రతి యింటిలోను అగ్నిహోత్రము వెలుంగుచుండెను. విద్యాభ్యాసము చేయు తరుణమునం బ్రతి పిల్లవాఁడును దప్పక విద్య నభ్యసించుచుండెను. పరశ్రము లనేకములున్నను దాత తండ్రుల నాటి వృత్తులే యవలంబింపం బడుచుండెను. గ్రామ సంఘములే వివాదలను బరిష్కరించుచుండెను. ఆఁడు వాండ్రు మర్యాదతో నుండిరి. భర్తలతో గూడ వీరు మతవిషయములందుం బని చేసిరని తెలియుచున్నది. యాజ్ఞవల్క్యుఁడు కాననమున కరుగు సమయమున నతని భార్య యగు మైత్రేయికిని,— యాజ్ఞవల్క్యునకును, జరిగిన సంభాషణము బరికించిన నాఁడువాండ్రు కెట్టి స్థాన ముండెనో తెలియఁగలదు. (బృహదారణ్యకోపనిషత్తు) మద్యపానము, చౌర్యము, వ్యభిచారము, చంపుట,— ఇవి ఘోరాపరాధములుగం బరిగణింపంబడుచుండెను. ఇండ్లయందు జాతకర్మాది ఉపనయనములు జరుగుచుండెను. వివాహ సందర్భములలోం గన్యాశుల్కమును మనువు గర్హించుచున్నాఁడు. (మనుధర్మ శాస్త్రము, ౩, ౫౪.) సంసారమునను సంఘమునను నాఁడువాండ్రు మంచి స్థితియందున్నారు. హిందూ సంఘము ఆఁడువాండ్రకే కెట్టి స్వాతంత్ర్యమును నీయదనియు, సాంసారిక ధర్మముల నెఱవేర్చుటకుం దప్ప నింక దేనికిని బనికిరారని కొందఱు సంస్కరణ ప్రియులు వ్యర్థాలాపము లాడుచుందురు. అట్టి వారు మనుధర్మశాస్త్రము ౨, ౧౪౫ లోను, ౩, ౫౫-౫౬ శ్లోకములందును గల భావమును గ్రహింతురు గాక! బౌద్ధ యుగమునం బతంజలి 'మహాభాష్యము' ను రచియించెను. గుప్త వంశపురాజు సముద్రగుప్తుఁ డను వాఁడు 'కవిరా' జను బిరుదమును బొందెను. బ్రహ్మగుప్తుఁడనువాఁడు 'స్ఫుట బ్రహ్మ సిద్ధాంత' మను గ్రంథమును వ్రాసెను. ఈ కాలమునందే 'సూర్య సిద్ధాంత' మను గ్రంథము వ్రాయఁబడినది గాని యెవరు వ్రాసినది తెలియదు.



అనఁగాం గ్రీస్తునకుం బూర్వము ౨౦౫౦ —వ సంవత్సరమున నీ గ్రంథము రచింపం బడెనని డేవిస్ అను నతఁడు సిరీకరించుచున్నాఁడు. కాని, 'అల్పావశిష్టే తు కృతే... గ్రహాణాం చరితం ప్రాదాన్మయాయ సవితా స్వయమ్' అను శ్లోకము ననుసరించి కృతయుగము కొంచెము మిగిలియుండ సూర్యభగవానుఁడు మయునకు గ్రహ చారిత్రము బ్రబోధించెనని తెలియుచున్నది. కావున 'సూర్య సిద్ధాంత' మిప్పటికిం గనీస మిరువది లక్షల యేండ్ల క్రితము వ్రాయఁబడియుండవలయునని యర్థమగుచున్నది. కాని యిందలి జ్యోతిషాంగముల ననుసరించి పరిశీలించినచోం గ్రీస్తునకుం బూర్వము ౩౧౦౨ సంవత్సరములు ప్రత్యక్షముగ మన జ్యోతిషికులు తదంగములను బరిశీలించి వ్రాసియుండిరేమో యని సందియ మేర్పడుచున్నది. క్రీ. శ. వేయి సంవత్సరముల నాఁడు వ్రాయఁబడియుండెననియు నప్పటి గ్రహముల యునికినుండి వెనుకకు గుణించుకొనుచుం బోఁగా గలియుగ ప్రారంభమునకు గ్రహము లేకస్థానమున నుండెనని తెలిసినదేమో యనియు, నధునాతన శాస్త్రజ్ఞులు తలంచుచున్నారు. అతి ప్రాచీన కాలముననే యిప్పటివారి కనోపల మగునట్లుం బరిశోధించి గ్రంథముల వ్రాసి మిగుల నాగరకము వహించిరని చెప్పక తప్పదు. తక్షశిలా విద్యాలయమునం జీవకుఁడు కాయచికిత్సా ప్రధానంబగు అష్టాంగ వైద్య విషయములను బోధించెను. అలగ్జాండరునకుం బూర్వము పాణిన్యాచార్యులవారు వ్యాకరణ మిచ్చోటి రచియించెను. పాటలీపుత్రమునం గ్రీ. శ. ౪౭౬-వ సంవత్సరమునం బుట్టిన ఆర్యభట్టాచార్యుఁడు 'ఆర్యభట్టీయ' మను గ్రంథమును వ్రాసెను. బీజగణిత విశ్లేషణము (Algberaical analysis) గల్పించిన దార్యభట్టే యని చాలమంది యభిప్రాయము. క్రీ. శ. ౬౨౮ సం॥ రను బ్రహ్మగుప్తాచార్యుఁడు వ్యక్త వర్గ సమీకరణమును గుఱించిన గ్రంథ మొకటి వ్రాసినాఁడు. ఇతని సమకాలికుఁడగు మహావీరాచార్యుఁడు సామాన్య గణిత వ్యాపారములు నిరూపించు 'గణితసార సంగ్రహము' అను గ్రంథమును రచియించెను. క్రీ. శ. ౮౫౦-వ సం॥ రమున వరాహమిహిరుఁడు 'భారతీయుల ఖగోళశాస్త్ర ప్రకరణమునకు గ్రీకుల ఖగోళ శాస్త్రము లుపయుక్తమైన' వని యంగీకరించుచున్నాఁడు. అంక గణితోత్పత్తికిం గారణభూతములగు విషయములను గ్రీస్తునకుం బూర్వము ౬-వ శతాబ్దము నుండియు భారతీయులే స్థాపించిరనియు, నుపయోగించిరనియుం, గ్రీ. శ. ౨౫౬-వ సం॥ రపు అశోకుని పర్వత శాసనములవలనం దెలియుచున్నది. క్రీ. శ. ౧౯ వ శతాబ్దమునం దక్షశిల యందుం గనిపించిన లిఖితాంక గణితములోని శ్లోక రచనా విధానమును బట్టి క్రీ. శ. ౩ వ శతాబ్దముననో లేక నాలుగవ శతాబ్దముననో యీ గణితము వ్రాయఁబడినదని తెలియుచున్నది. బుద్ధుని కాలమున సింహళద్వీపమున 'అనవమదర్శి' యను బౌద్ధమతస్థుఁడు జ్యోతిషికుఁడుగ బ్రసిద్ధి వడసి, 'దైవజ్ఞ కామధేను' వను జ్యోతిష గ్రంథమును రచియించెను. జహంగీరు చక్రవర్తి యొద్ద నున్న 'కృష్ణదైవజ్ఞుఁ' డను జ్యోతిషుఁడు భాస్కరీయ బీజగణితము (Algebra) నకు 'నవాంకుర' మను వ్యాఖ్యను వ్రాసినాఁడు, పాఠ

హాను చక్రవర్తి కుమారుఁడగు 'షుజా' యనువాని యొద్ద బలభద్రుఁడను జ్యోతిషికుఁడుండి 'హోరారత్నమును, హాయనరత్నము' ను రచియించెను. క్రీ. పూ. ౧౧-వ శతాబ్ద ప్రాంతమున 'సూర్యప్రజ్ఞప్తి' యను జ్యోతిర్గ్రంథము వెలువడెను. జయసింగు అను వాఁడు క్రీ. శ. ౧౭౨౦ లో డిల్లీ పట్టణమున 'జంతర్ మంతర్' అను జ్యోతిశ్శాలలను, క్రీ. శ. ౧౭౩౪-వ సం॥ రమున జయపురమునందు నక్షత్ర పరిశీలనశాలలను, అవంతి పురమున సిప్రానదీ తటమున 'జయసింగు పుర' మను ప్రదేశమున నక్షత్ర శాలలను నిర్మించెను. ఇందు జయపురములోని నక్షత్రపరిశీలనశాల జ్యోతిశ్శాస్త్రమున కాదిపీఠము. ౧౭-వ శతాబ్దమున నంబర పురాధిపుఁడగు మానసింగు కాశీ పట్టణమున మణికర్ణికా ఘట్టమున 'మాన్ మందిర్' అను జ్యోతిశ్శాలను నిర్మించెను. ఫిరోజిషా యను మహమ్మదీయ చక్రవర్తి యొద్ద నున్న 'మహేంద్రసూరి' యను నతఁడు 'యంత్రరాజ' మను యంత్ర శాస్త్రమును రచియించెను. యవనాచార్యుఁడు 'వృద్ధ యవన జాతకము' అను గ్రంథమును, 'యవనతాజక' మను గ్రంథమును వ్రాసెను. క్రీ. శ. ౯౭౦ సం॥ రమున విజయార్య భట్టుఁడును, ఇతని సమకాలికుఁడగు నుత్పలుఁడును, క్రీ. శ. ౪౪౯-వ సం॥ రము వాఁడగు లాటుఁడు, లల్లుభట్టు ప్రభృతులును, స్ఫుట సిద్ధాంతాది గ్రంథములలోని ఫలితములను మార్పుఁ జేసి క్లుప్తముగఁ బ్రకటించియున్నారు. క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతమున నున్న న్యాయతార్కిక శిరోమణి యగు వాచస్పతి యను నతఁడు (Co-ordinate solid geometry.) మూలకందములను బూర్వాస్వాదన మొనర్చెను. ఆర్యభట్టాచార్యుఁడును బ్రహ్మగుప్తుఁడును 'దశాంశ సమితి' నెఱుంగుదురని తెలియుచున్నది. మొట్టమొదట బోధాయనాపస్తంబ శుల్వ సూత్రములలో హైందవ రేఖా గణితము కనిపించుచున్నది. వైదిక సారస్వతమునకు సంబంధించిన ఈ సూత్రములలో గణితజ్ఞాన ముపలబ్ధించి చేయు నైమిత్తికములు, బలిపీఠ నిర్మాణములు,—మొదలగునవి తెలుపఁబడినవి. 'కుమార శ్రీ సింగే జలధిరశనాం శాసతి మహీమ్' అను రీతి కుమారసింగ భూపతి యాస్థానమున బొమ్మకంటి యప్పయాచార్యులను నతఁడు 'అమరకోశము' నకు వ్యాఖ్య విరచించెను. క్రీ. శ. ౧౪౧౭ లో మామిడిసింగ మంత్రి 'సోమసిద్ధాంతము' నకు వ్యాఖ్యను వ్రాసెను. ఆనందపాలుఁడను ప్రభువునకు 'ఉగ్రభూతి' యను వాఁడు గురువు. ఇతఁడు తనకుఁ బ్రభువు శిష్యుఁడగుటఁ బండితుల కావించి పారితోషికముల నిప్పించి తాను వ్రాసిన వ్యాకరణమును బరివ్యాప్తి చేయించెనని 'అల్బరూనీ' యను చరిత్రకారుఁడు వ్రాసినాఁడు. క్రీ. శ. ౯ వ శతాబ్దమున భల్లటుఁడు భర్తృనీతి శతకముం బోలు నొక గ్రంథమును, 'భల్లట' శతకమును రచియించెను. మంఖుఁడను వాఁడు 'మంఖకోశ' మను నిఘంటు వొకటి వ్రాసినాఁడు. ౧౧-వ శతాబ్దమున మమ్మటుఁడు 'కావ్యప్రకాశ' మను గ్రంథమును రచియించెను. మమ్మటునకుఁ బూర్వుఁడగు రుయ్యకుఁడు 'అలంకార సర్వస్వము' అను గ్రంథమును, 'సహృదయరీతి' యను గ్రంథమును వ్రాసెను. ౧౧-వ శతాబ్దపు వాఁడగు జయరథుఁడను నతఁడు రుయ్యకుని 'సహృ



దయరీతి' కిఁ జక్కని వ్యాఖ్యను వ్రాసెను. ౧౬-వ శతాబ్ద ప్రారంభమున 'ఆనకర్ణుఁ' డను రాజాశ్రయ మవలంభించిన గంగానందుఁడను వాఁడు 'కర్ణభూషణ' మను గావ్యరచనా విషయక గ్రంథమును రచించెను. జయాదిత్యుఁడును, వామనుఁడును 'కాశికావృత్తి' యను వ్యాకరణమును రచియించిరి. ప్రత్యేకముగ వామనుఁడు 'కావ్యాలంకార సూత్ర వృత్తి' యను గ్రంథమును వ్రాసెను. క్రీ శ. ౬౨౮ సంవత్సరమున బ్రహ్మగుప్తుఁడు 'బ్రహ్మస్ఫుట సిద్ధాంత' మను గ్రంథమును రచియించెను. క్రీ. శ. ౧౧౫౦ సం॥ రమున భాస్కరాచార్యుఁడు వ్రాసిన 'సిద్ధాంత శిరోమణి' యను గ్రంథము బ్రహ్మగుప్తుని 'స్ఫుటసిద్ధాంతము' కన్నఁ బ్రసిద్ధి వడసినది. ఈ భాస్కరాచార్యుఁడు ఉజ్జయినీ శాలాగారాధ్యక్షుఁడయి యుండెను. తర్క సంగ్రహము పయి గోవర్ధన పండితుఁడను వాఁడు 'న్యాయబోధిని' యను వ్యాఖ్యను, పట్టాభిరామ పండితుఁడను వాఁడు 'పట్టాభిరామ టిప్పణిని' మేరు శాస్త్రి యను నతఁడు 'వాక్యవృత్తి' ని విరచించిరి. క్రీ. శ. ౧౧౪౮-౪౯ సం॥ రములలోఁ గల్హణ పండితుఁడు రాజతరంగిణి యను గ్రంథమును వ్రాసెను. కల్హణునకు ముందు బిల్హణుఁడను వాఁడు 'విక్రమాంకదేవ చరిత్ర' మును, బిల్హణుని సమకాలీనుఁడగు మంఖకవి 'శ్రీకంఠ చరిత్రము' ను వ్రాసియున్నారు. కల్హణుఁడు రాజతరంగిణిని వ్రాసిన పిదప జోనరాజ శ్రీవీర ప్రాజ్యభట్టులను వారు కాశ్మీరపు తరువాతి చారిత్రమును జక్కఁగ వ్రాసిరి. కాశ్మీర దేశాధీశుఁడగు అవంతి వర్మ యాస్థానమున (౮౫౫, ౮౮౪) నున్న ఆనంద వర్ధనుఁడను నతఁడు 'ధ్వన్యాలోకము' అను గ్రంథమును రచియించెను. ౮౫౦-౯౦౦ సం॥ రముల మధ్యనున్న భట్టారక వామకుఁడను నతఁడు గొప్ప అలంకారికుఁడని భోజప్రతిహారేందు రాజు చెప్పియున్నాఁడు. ఇతని తనయుఁడగు రుద్రట శతానందుఁడు 'కావ్యాలంకార' మను గ్రంథమును రచియించెను. ౧౬౫౯ సం॥ రమున నేమినాథుఁడు 'కావ్యాలంకార' మునకు వ్యాఖ్యను వ్రాసెను. క్రీ. శ. ౫-వ శతాబ్దమున 'భామహుఁడు' కావ్యాలంకార సూత్రములను గ్రంథమును వ్రాసి యలంకార శాస్త్రమున కాదిభిక్ష యిడెను. క్షేమేంద్రుఁడు 'ఔచిత్య విచార చర్చా' యను గ్రంథమును, 'సువృత్త తిలక' మను ఛందో గ్రంథమును వ్రాసి లక్ష్య లక్షణముల నిరూపించెను. కయ్యటుఁడు 'మహాభాష్య ప్రదీప' మను గ్రంథమును రచియించెననియు, మమ్మటుఁడు, కయ్యటుఁడు, ఔవటుఁడు అను వాండ్రు ముగ్గురు నన్నదమ్ములనియుఁ, గయ్యటునకు మమ్మటుఁ డన్న యనియుఁ, గయ్యటుఁడు మహేశ్వరుని ఛాత్రుఁడనియు, నుపాధ్యాయ జయ్యటుని కుమారుఁడనియు, భీమసేనుఁడు వ్రాసిన 'కావ్య ప్రకాశ వ్యాఖ్య' యందు వ్రాయఁబడినది.

కాఁబట్టి భారతీయు లేవిషయమునను వెనుదివియక పాశ్చాత్యులు మొదలుగాఁ దెలియనపుడే సంపూర్ణ పరిజ్ఞానమున శోభిల్లిరి. చతుష్షష్టి కళలును దదితర కళలును భారతదేశమునఁ బాదుకొనియుండెను. యథార్థ పరిజ్ఞానమునకును ధర్మ ప్రవర్తనమున

కును దావలమై యిట్టి భారతీయుల కళానైపుణ్యమునకుఁ బ్రాతిపదికయై యొప్పినది. వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షుల నుండి రామ ప్రసాద, రామకృష్ణుల వఱకును గల ఋషివర్గమును, పాణిని చాణక్యాది విద్వత్ప్రకాండుల నుండి చంద్రకాంత, తర్కాలంకారుని వఱకును గల విదుషులను, మైత్రేయి గార్గి మొదలగు విదుషీమణులనుండి యహల్యాబాయి, రాణీభవానుల వఱకునుగల స్త్రీ రత్నములను, చంద్రగుప్త శివాజీల వంటి చక్రవర్తులను జన్మింపఁజేసి యార్యనాగరిక మవిచ్ఛిన్నముగ నేఁడును గానఁబడఁ జేయఁ గల్గిన ప్రాక్తన విద్యావిధానము మరల నుపలబ్ధించి మనదేశము బూర్వపు టౌన్నత్యమునకుఁ దీసికొని వచ్చునుగాక !

౩౩౯-౪౧౪ సం॥ రములలో హిందూదేశమును సందర్శింప వచ్చిన ‘ఫాహియాన్’ అను నతని ద్వారమున బౌద్ధ గ్రంథముల సారాంశము లన్నియుఁ జీనాదేశమునకుఁ జేర్పఁబడినవి. ‘ధర్మపాద’ మన్నగు బౌద్ధ మత మందలి యుద్గ్రంథము లప్పటినుండి భారత మాతృకల నుండియే భాషాంతరీకరింపఁ బడినవి. కుమార జీవుఁడను భారతీయ బౌద్ధ సన్న్యాసి చీనాదేశమునఁ బది సంవత్సరముల వఱకును బ్రబోధ మొనర్చెను. ఇతని బుద్ధి వైశద్యమును గాంచి యనేక చీనాదేశీయు లతనికి శిష్యులయిరి. ఇతఁడు చీనాభాషయందు ‘సద్ధర్మ పుండరీక’ మొదలగు గ్రంథము లనువదింపఁ బడినవి. అవి యిప్పటికిని చీనావారిచేఁ గొనియాడఁ బడుచున్నవి. చీనాయోధుల వలన నితఁడు నిర్బంధింపఁబడి యచ్చటికిఁ గొంపోఁ బడియెను. ఈ కాలముననే ‘బుద్ధభద్రుఁ’డను సన్న్యాసి చీనా దేశమునకు వచ్చెను. ఇతని బుద్ధి వైభవమును, గవితా శక్తియు, జీనాదేశీయుల నెందఱనో యాకర్షించెను. ఇతఁడు ధ్యాన సిద్ధాంతము నుద్బోధించి తద్దేశీయుల వేదాంతమును గవిత్వమును నూతనముగఁ గొని క్రీ. వెనుక ‘హ్వాయయన్’ జ్ఞాపక చిహ్నముగ ‘లూషాన్’ పర్వతమున నెలకొల్పఁ బడియున్న ఆశ్రమమును దన యుండగఁ జేసికొనియెను. రాజసన్న్యాసి యను గుణవర్మ యను నతఁడు కాశ్మీర సింహాసన మధిష్ఠింపక పరిత్యజించి చీనాదేశమున కరిగెను. క్రీ. వెనుక ౪ వ శతాబ్దమున నితఁడు సింహళము చేర యచ్చటినుండి ‘జావా’ కుఁ బోయి ‘జావా’ దేశ ప్రభువును ప్రభ్విని బౌద్ధమతమునఁ జేర్చి ‘బౌద్ధాశ్రమ’ మొందు నెలకొల్పెను. ‘నాంకిను’ నందు నీతఁడు బౌద్ధ విహారముల నంటిని నెలకొల్పి భారత బౌద్ధ ధర్మముల నూతనముగఁ గొని వినయ సిద్ధాంత మతమును నడుపుచుఁ బ్రథమమునఁ గొంత మందిని చీనా సన్న్యాసినులఁ దయారు చేసెను. క్రీ. వెనుక ౪౩౧ లో నితఁడు చనిపోయెను. ఆఱవ శతాబ్దమున భారతదేశము నుండి చీనా దేశమున కొక నూతన మార్గము కనుఁగొనఁ బడినది. క్రీ. వె. ౫౨౦ లో ‘బోధిధర్మ’ యను నతఁడు దక్షిణ చీనాదేశము చేరన ‘మలయార్చిపెలిగో’ మార్గమున నౌకలన్నియుఁ బోనారంభించినవి. ఇతఁడును బుద్ధభద్రుని వలెనే చీనా దేశీయులకు బౌద్ధమతమును బ్రబోధించెను. చీనాదేశమునఁ దొమ్మిది సంవత్సరము లుండి పిదప సముద్రయానమునఁ



గావించి ‘బౌద్ధ వేదాంతి’ జీవిత చారిత్రమును వ్రాసెను. క్రీ. వె. ౫౪౬ సం॥ మునఁ జీనాకుఁ బోయి యచ్చటి నుండి క్రీ. వె. ౫౪౭ వ సం॥ రమున ‘నాన్కింగు’ కు రప్పింపఁబడి ‘అసంగ, వసుబంధు, విజ్ఞాను’ల గ్రంథము లనువదించి ‘హుయాసాను’కు ముందుగ యోగాచార సిద్ధాంతమును బరివ్యాప్తి యొనర్చెను. క్రీ. వె. ౩౭౪ సం॥ రమున ‘మతానందుఁ’డను భారతీయ బౌద్ధ మతస్థుఁడు శిష్యుల గొందఱను వెంటఁ దీసికొని ‘మధ్య కొరియా’ కు వచ్చి దేశమంతను మతవ్యాప్తిఁ గావించెను. పిదపఁ ‘గృష్ణవర్మ విదేశి’ యను సన్న్యాసి ‘సిల్లా’ ప్రభువు కుమార్తెకుఁ గల గొప్ప వ్యాధిని కుదిర్చి త్రిరత్న సిద్ధాంతమును బోధింపఁ బ్రారంభించెను. క్రీ. వె. ౫౨౭ సం॥ రమున ‘సిల్లా’ రాజ్యమంతయు బౌద్ధమతముతో నిండిపోయెను. పదియవ శతాబ్దమువఱకును గొరియా రాజ్య మేలుచుండిన ప్రభువులు బుద్ధమతావలంబులు అయి యుండుటవలన దేశమంతయు నా మతము వ్యాప్తిఁ జెందెను. ‘చంపా’ నగరమునుండి ౭౩౬ సంవత్సరమున ‘బోధిసేన’ యను బుద్ధమతావలంబుఁడు జపాను దేశమునకుం జని బౌద్ధమత వ్యాప్తికిఁ బ్రధానాచార్యుఁడుగఁ బని చేసి ౭౬౦ సం॥ రమునఁ జనిపోయెను. ఇతఁడు భారద్వాజ గోత్రుఁడు. ‘బ్రాహ్మణాచార్య’ యను బిరుదమునంది విఖ్యాతిఁ జెందెను. భారతీయ విజ్ఞానమును బ్రసరింపఁ జేయుటలో భిక్షువులును, పరిచారకులును మిగుల శ్రద్ధ వహించిరి. చీనాయందు ‘శుభకర సింహుఁడు’ అమోఘ వజ్రులచేఁ బ్రవేశ పెట్టఁబడిన మంత్ర సిద్ధాంతము ‘జపాను’ నందుఁ బ్రవేశ పెట్టఁబడినది. నేపాళ దేశములోని భారత విదుషీమణిని, చీనాదేశపు స్త్రీని, ౬౩౦-౬౯౮ సం॥ రములలో ‘స్రాంగ్ బసన్ గంపో’ యను ప్రభువు వివాహ మాడెను. ఇతఁడు తన ప్రధానామాత్యుని భారతవర్షమున కంపఁగా ‘దేవనాగర’ లిపిని నేర్చుకొని మరల నచ్చటికిఁ బోయెను. ౭౪౦-౭౮౬ సం॥ రములో రాజ్యమేలిన ‘స్రాంగ్ డి-బ్లాసన్’ ప్రభువు భారతవర్షమునుండి విద్యావంతులఁ గొందఱను రప్పించి వారి తోడ్పాటునఁ దమ భాషకొక లిపిని యేర్పఱచుకొనెను. ౧౦౩౮ సంవత్సరములో ‘దీపంకర శ్రీ జ్ఞాని’ కలకత్తానుండి టిబెట్టు వచ్చినప్పటి కచ్చటఁ గల హిందూ గ్రంథము లెన్నియో యనువదింపఁ బడినవి. టిబెట్టు దేశమున బుద్ధుని కన్నను నాగార్జుననే యెక్కువ పలుకుబడియు, గౌరవమునుగలదు. భారతదేశమునుండియు, నేపాళమునుండియుఁ, గంచు సామగ్రి చీనా దేశములోని మంగోలియా బౌద్ధ ప్రభువులకుఁ బోవుచుండెను. ఈ వస్తువులు చిత్రకళను దెలుపుచుండుటవలన నా ప్రభువులు మెచ్చుకొనుచుండిరి. ఐదవ శతాబ్దమున భారతవర్షము యొక్క విఖ్యాతి హెచ్చినది. చంపా నగరము, కాంబోడియా, బౌద్ధమత ప్రవిష్టము లగుటయే గాక జావా, సుమిత్ర, శయాం, మలే ద్వీపకల్పములందును నివేశము లేర్పఱుపఁ బడినవి. ఈ శతాబ్దముననే ఆర్యభట్టును, వరాహమిహిరుఁడును, గ్రీకు సంబంధమగు శాస్త్రజ్ఞానములవరచికొని తద్వ్యాప్తిఁ గావింప మొదలిడిరి. ‘నాన్కిన్’ నందుఁ జనిపోయిన గుణవర్మ జావా ద్వీపమున బౌద్ధమత వ్యాప్తిఁ గావించెను. భారత నాగరకము బరా

(మనుస్మృతి, ౧౧ అ. ౫౪ శ్లో.) అనఁగా సురాపానము, బ్రహ్మహత్య, చౌర్యము, గురుభార్యా సంగమము,—వీనినిఁ జేయువారి సాంగత్యముఁ జేయుట,—అను నవి మహా పాతకములు. మద్యపాన మదోన్మత్తులతో సంసర్గము కూడదని యీ క్రింది శ్లోకమువలనఁ దెలియుచున్నది. 'మత్తోన్మత్తార్త్యధ్యధీనై ర్బాలేన స్థవిరేణవా, అసంబంధ కృతశ్చైవ వ్యవహారో నసిద్ధ్యతి॥' యని మనుస్మృతి యందు ౧౬౩-వ శ్లోకముగ రూపొందినది. యాజ్ఞవల్క్యుఁడు 'సురాపోఽన్య తమంపీత్వా మరణాత్ శుద్ధి మృచ్ఛతి' యని చెప్పినాఁడు. అనఁగా మరణముచేతనే సురాపానము చేసినవాఁడు శుద్ధిఁ బొందునని యర్థము. వసిష్ఠ మహర్షి 'పతత్యర్ధ శరీరస్య భార్యాయస్య సురాం పిబేత్, పతితార్ధ శరీరస్య నిష్కృతి ర్నవిధీయతే॥' యని నిర్వచించినాఁడు. మహా భారతములోని శాంతిపర్వమున 'వినుసురతోఁ గూడ గడెచ్చిన యెట్టిది యెద్దియును భుజింపరభోజ్య, త్వ నిరూపణ నిపుణత గల మనుజోత్తము లఖిలలోక మాన్యచరిత్రా!' యని చెప్పఁబడినది. (శాంతి పర్వము, ౧ అ. ౩౩ పద్యము.) అనఁగా సురతోఁ గూడిన పదార్థము లంటగూడదని చెప్పిరి. ఇఁక మోసవినవారి మాట యోజింపనేల? 'తస్మాద్బ్రాహ్మణ రాజన్యౌ వైశ్యశ్చ నసురాంపిబేత్' అను శాస్త్రోక్తియు నాసవపానమును నిరోధించుచున్నది. శక్త్యాగాధకులు గూడ ఆసవమును గ్రోలుట విచారముగ నున్నది. మతము పేరిట నిట్టి తొట్రుపాటులు సంభవించుట దురదృష్టము 'పీత్వా పీత్వా పునః పీత్వా యావత్పతతి భూతలే, పునరుత్థాయవై పీత్వా పునర్జన్మ నవిద్యతే॥' యని కాళింది గ్రంథ తంత్రమున వ్రాయఁబడి యున్నది. అనఁగా త్రాఁగి త్రాఁగి, తప్పఁదావి, మత్తిల్లి, నేలఁగలచి, మఱల లేచి, తిరిగి త్రాగినట్టయిన వానికిఁ బుట్టుక లేదని యర్థము. ఇట్టి గ్రంథముల విశ్వసించి చెడిపోవలదని మనవి చేయుచున్నాను. మన మతమునకు బౌద్ధ, జైన, ఇస్లాము మతములందును గల్లుగాని, సారాయిగాని, మఱియే నిషా పదార్థముగాని, మంచిదని వ్రాయఁబడలేదు. కాళిదాస మహాకవి 'నయనాని ఘూర్ణయన్ వచనాని స్థలయన్ పదేపదే, అసతిత్వయివారుణీ మదః ప్రమదా నా మధునా విడంబనా॥' యని చెప్పినాఁడు. కాళిదాస మహాకవి భైక్షుక వృత్తి నవలంబించి భోజమహీపతితో నీదిగువ రీతిని మాటాడెనఁట!

శ్లో. 'భిక్షో మాంస నిషేవణం కిముచితం?' 'కింతేన మద్యం వినా!'
'మద్యంచాపి తవప్రియం?' 'ప్రియమహో వారాంగనాభిస్సహ!'
'వారస్త్రీరతయే కుత స్తవ ధనం?' 'ద్యూతేన చౌర్యేణవా!'
'చౌర్యద్యూత పరిగ్రహోస్తి భవతః?' 'భ్రష్టస్య కా వా గతిః!'

దీనివలనఁ గల్లు, సారాయి మొదలగువానిఁ ద్రావుట వలన మాంస భక్షణము, చౌర్యము, జూదము, వ్యభిచారము,—చివఱకు భ్రష్టుడగుటయుఁ దటస్థించును.



ఇట్టి యాదర్శములతో మన పూర్వులు నాగరకవంతులయి యితరులకు మార్గదర్శులయిరి. కావున విద్యావ్యాప్తి యందేమి, మతవ్యాప్తియందేమి, చేతిపనుల యందేమి, ఆసవపాన నిషేధమందేమి, పరిపాలనయందేమి, యతివిస్తృతమగు దక్షతఁ గలిగి పూర్వము మనవారు పేరెన్నికఁ గాంచిరి. నేఁటి కాలమున వారికిఁ గల దక్షతను గమనించి, పాశ్చాత్య నాగరకమును ద్రోసిపుచ్చి వర్తింతురని కోరుచున్నాను.

---

# ప్రభుత్వాదాయము.

:o:

భారత వర్షేతిహాసము మిగులఁ బ్రాచీనమైనది. సాంఘిక, మత, వ్యవస్థలందును, రాజకీయార్థిక పరిస్థితులందును, భారతదేశ మగ్రస్థాన మధిష్ఠించెను. మన దేశమును సందర్శించిన యన్యదేశీయుల వ్రాఁతల వలనను, మఱి యితర సాధనముల వలనను నాఁటి హిందూదేశ సౌభాగ్యమును గనుఁగొనవచ్చును. దేశచరిత్ర ప్రారంభమగు కాలమునఁ బ్రభుత్వము ప్రజల పోషణ పయినను, స్వశక్తి పయినను, నాధారపడి యుండెను గాని ప్రభుత్వాదాయము మందగించి యుండెను. ఆ కాలమున సుంకముల పద్ధతి సర్వసాధారణముగ నుండెను.

క్రీ. పూ. నాల్గవ శతాబ్దమునఁ బ్రభుత్వాదాయము మిగుల వృద్ధిఁ జెందినదని బ్రాహ్మణ, బౌద్ధ మత గ్రంథములలోను, చాణక్యుని యర్థశాస్త్రమునందును, జెప్పఁబడినది. ఈ యాదాయ మనేక యాధారముల మూలమున వచ్చుచుండెను. ఇంతకు ముందు దినములలోఁ బన్నులు చాల తేలికగనుండెను. కాని ప్రభుత్వ విధానము మార్పుఁ బొందిన కొలఁది, పన్నుల క్రమమును మార్పుబొందుచుఁ దుదకు భారముగాఁ బొచ్చెను. పూర్వ న్యాయశాస్త్ర నిర్మాతలలో నొకఁడగు గౌతముఁడు 'వ్యవసాయదారులు దమ పంటయం దాఱవవంతుగాని, యెనిమిదవవంతుగాని, పదియవవంతుగాని, రాజునకుఁ బన్నుక్రిందఁ జెల్లింపవలయు' నని చెప్పినాఁడు. హిందూ ప్రభువులు హిందూ ధర్మశాస్త్రముల ననుసరించియే పన్నులను విధించువారు. కావున ఈ శాస్త్రములను జూచిన యెడల వ్యవసాయదారుల యాదాయమున నెంత భాగము భూమి పన్నుగ గ్రహించుచుండినదియుఁ దేటఁ గలదు. భూసారమును బట్టి తరము విధింపఁబడినట్లుఁ గనిపించుచున్నది. సారవంతమైన భూములకు ఊషర క్షేత్రములకన్నఁ జాల హెచ్చుగఁ బన్నులు విధింపఁబడెడివి. 'పశువుల సంఖ్యయందు ౫౦-వ భాగమును, బంగారమునందు ౫౦-వ భాగమును, వర్తకమున నిరువదియవ భాగమును, బండ్లు, పుష్పములు, తేనె, మాంసము, ఓషధులు, పచ్చిక, కట్టెలు, వేరులు,—వీనిపయి నఱువదియవ భాగమును,

బంటయందాఱవ భాగమునుగాని, యెనిమిదవ భాగమునుగాని, పండ్రెండవ భాగమును గాని, రాజు గ్రహింప’ వచ్చునని గౌతమధర్మ సూత్రములలోఁ జెప్పఁబడినది. (౧౦, ౨౪-౨౭.) విష్ణుపురాణకాలమున సుంకముల ధరలు చాల హెచ్చుగ నుండెనని రెండు శతాబ్దముల క్రితము వ్రాయఁబడినది. ‘ప్రతి పంటయందును మాంసము, పండ్లు, పువ్వులు,—మొదలగు వానిపయి నూటికి రెండు వంతులును, స్థానికముగఁ దయారు కాఁబడిన వస్తువులపయి నూటి కైదు వంతులును, పన్ను విధింపఁబడి యుండెనని విష్ణుపురాణమున మూఁడవ యధ్యాయమునఁ జెప్పఁబడినది. ‘పశువుల సంఖ్యయం దేఁబదియవ భాగమును, బంగారమునం దేఁబదియవ భాగమును, బంటలో నాఱవ భాగముగాని, యెనిమిదవ భాగముగాని, పండ్రెండవ భాగముగాని, రాజు తీసికొనవచ్చునని మనుధర్మ శాస్త్రమునఁ జెప్పఁబడినది. (మనుస్మృతి, ౬, ౧౩౦.) ‘వృక్షములు, తేనె, మాంసము, స్వచ్ఛమగు వెన్న, పరిమళ ద్రవ్యములు, ఓషధులు మధురమగు నాహార పదార్థములు, పుష్పములు, వేళ్లు, పండ్లు, ఆకులు, తోఁటకూరలు, పచ్చిక, చర్మములు, వేము, మృణ్మయ పాత్రలు, రాతి పనిముట్లు,—అన్నిటిపయి నాఱవవంతును పన్నుగ రాజు తీసికొన వచ్చు’ నని మనుస్మృతియందుఁ జెప్పఁబడినది. (౧౩౧, ౧౩౨.)

సామాన్య నియమములందు సుంకముల తీరును గూర్చి మహాభారతము కడు శ్లాఘ్యముగ వర్ణించుచున్నది. ‘మంచి గణన పయిని భూమి పంటయందలి యాఱవ భాగములతోను, నేరస్థుల యొద్దనుండి వసూలు చేయఁబడిన అపరాధములతోను, శాస్త్రీయ పద్ధతిని దిగుమతి కాఁబడిన సరకుల పయిని వర్తకులకును, తత్సంరక్షణ కయి విరాళ మీయఁబడిన వ్యాపార సంవిధానములకును,—విధింపఁబడిన పన్నులతోను, రాజు తన కోశము నింపు’ నని మహాభారతము శాంతి పర్వమున ౭౧-వ యధ్యాయమునఁ బదియవ శ్లోకమున వివరింపఁబడినది. చంద్రగుప్తుని కాలమునఁ గల యార్థిక విధానమును గూర్చి ప్రత్యేక వివరములను రెంటిని చాణక్యుఁడు చూపుచున్నాఁడు. మొదటి వివరమును జూచినచో నేమూలమున నాదాయము వచ్చినదో కనుఁగొన నగును. ౧. పెట్టుబడి, ౨. దేశవిభాగములు, ౩. గనులు, ౪. ప్రభుత్వకార్యములు, ౫. అడవులు, ౬. పచ్చికబీళ్ళు, ౭. వ్యాపార సంవిధానములు, ౮. త్రోవలు అని యెనిమిది శీర్షికల క్రింద మొదటి వివరము విభజింపఁబడినది. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౬.)

క్రీ. శ. ౬ వ శతాబ్దపువాఁడగు కాళిదాస మహాకవి తన శాకుంతల నాటకములో ‘పంటలో నాఱవవంతువలెఁ దపస్సు, ధ్యానములను బరిగణింపవలె’ నని వ్రాసినాఁడు. పెట్టుబడివలన వచ్చు నాదాయమును జక్కఁగా నర్థశాస్త్రమున వివరింపఁబడియెను. ‘స్థానికముగఁ దయారు కాఁబడిన నిర్దుష్టమయిన వస్తువులమీఁది పన్నులును, అట్టివే యగు దూది సరకులు, తైలములు, క్షారము, మద్యము, లోహసామగ్రి,



గిడ్డంగులమీఁది పన్నులు, దేవాలయములు, నగర ద్వారములు, కళానిలయములు,—మొదలగువాని వలన వసూలు చేయఁబడు సుంకములు, జూదముల పయినిఁ బందెముల పయిని విధింపఁబడిన అపరాధములు,’ అని వివరింపఁ బడియెను. (అర్థశాస్త్రము, పుస్తకము ౨.) కాఁబట్టియే ‘క్రయ విక్రయముల ధరలు, బాటయొక్క విస్తీర్ణత, ఆకలిఁ బుట్టించు పదార్థములకును, ఆహారమునకును, అయిన వ్యయములు, ఇన్నూరు చేయు వస్తువుల ధరలు, మొదలగు వానికి వ్యాపారము చేయువారి యొద్ద సుంకము వసూలు చేయుట, రాజుయొక్క ధర్మ’ మని మనువు చెప్పుచున్నాఁడు. (మనుధర్మశాస్త్రము, ౭, ౧౨౭.) నష్టమును బాటింపక విక్రయించిన వర్తకుల విషయమున విధులు నిర్ణయింపఁబడినవని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (అర్థశాస్త్రము, పుస్తకము ౨.) శుక్రనీతి యందు ‘ఉత్పత్తి ధరకు సమముగఁ గాని, యంతకుఁ దక్కువగఁ గాని, యెవరు సరకుల నమ్ముచుందురో అట్టివారి యొద్దనుండి యే విధమగు సుంకములనుగాని రాజు తీసికొనఁగూడదనియుఁ, గాని కొనువానియొద్ద నితఁడు బేరముఁ గావించినట్లయిన రాజు సుంకములను దీసికొనవచ్చుననియు,’ వ్రాయఁబడియున్నది. మహాభారతము ననుసరించి రాజులలోఁ బ్రథముఁడు మనువు. ఇతఁడు ప్రజాభీష్టమును బట్టి పరమేశ్వరునిచేఁ బంపఁబడినవాఁడు. ప్రజా స్వామ్య మొనర్చుట కితఁడు అంగీకరింప నప్పుడు ప్రజలు తమ యాదాయము నుండి యర్థబలమును, దమలో బలశాలురనుండి అంగబలమును ఇచ్చి తోడ్పడెదమని చెప్పినట్లు మహాభారతములోని శాంతి పర్వము ౨ వ యధ్యాయమునఁ గలదు. ‘పంచాశద్భాగ ఆదేయో రాజ్ఞా పశుహిరణ్యయోః ధాన్యానాం అష్టమో భాగః షష్ఠో ద్వాదశ ఏవవా॥ అని మనుస్మృతి యందుఁ జెప్పఁబడినది. అనఁగా వ్యవసాయాది వ్యయములుపోను నికరము ధాన్యాదులలో భూమియొక్క ఉత్కర్ష అపకర్షలను బట్టియుఁ, గగనమందలి మంచి చెడ్డలను బట్టియుఁ, నాఱవ భాగముగాని, యెనిమిదవ భాగముగాని, పండ్రెండవభాగముగాని, పన్నుగా రాజుగ్రహింపవలెనని భావము. చంద్రగుప్త చక్రవర్తి యాస్థానమునఁగల మెగస్తనీసను యవనరాయబారికూడ నీ సుంకము నూటికిఁ బదివంతులని చెప్పుచున్నాఁడు. సుంకములు నూటికిఁ బదివంతుల నుండి యిరువది వంతులవఱకుఁ గలవు. అగ్నిపురాణమున నీ సుంకము నూటికిరువది వంతులని చెప్పఁబడినది. ఈ సరకు హానికరమగు వ్యాపారపు సరకు అయిన యెడల మామూలు సుంకమునకు బదులుగ అపరాధము విధింపఁబడునుగాని సంఘమునకు ప్రత్యేకోపయోగముగ నుండుటకయి లెక్కింపఁబడిన సరకులను, అట్టి విలువఁగల విత్తనములను, సుంకము లేకుండ స్వేచ్ఛగ నుంపఁబడినవి. ఈ విధముగనే దేవపూజా ద్రవ్యములును, వివాహ కార్య వస్తువులును, సుంకము లేకుండఁ జేయఁబడినవి. ఆ సుంకములు క్రమముగ భారముగనే యుండెనుగాని సులువుగనుండలేదు. ‘పంటలందు ప్రదేశమున సరకుల యమ్మకము నిషేధింపఁ బడిన’ దని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౨, అధ్యాయము ౨౨.) ‘సంతలలోఁ గాని, లేక రథ్యలపయిఁగాని, సుంకములు వసూలు చేయఁబడుచుండె’ నని శుక్రనీతియందుఁ జెప్పఁబడినది. (శుక్ర

కొనుటకుఁ దగియుండి పొలములలో గింజల నేరికొను వృత్తివలన సార్జింపఁబడిన ధాన్యములోఁ బ్రభువున కీయవలసిన ఆఱవభాగము పన్ను క్రిందఁ జెల్లించు ధాన్యరూపమున నెలవొందు సైకత స్థలములును, అందలి మీఁ తీర్థ జలములును, నిరపాయములు గదా! యని యర్థము. మఱియొక చోట రఘువంశమునఁ 'ప్రజానామేవ భూత్యర్థమ్, సతాభ్యో బలిమగ్రహీత్ ॥ సహస్రగుణముత్స్రష్టుమాదత్తేహిరసం రవిః' అని చెప్పఁబడినది. అనఁగా సూర్యుఁడు వేయిరెట్లు నీరును మరల నిచ్చుట కయ్యే భూసారమును గ్రహించునటులఁ బ్రజాశ్రేయమున కై రాజు ప్రజలవలన సుంకమును బుచ్చుకొనుచున్నాఁడని భావము. ఏ విధముగనైన నేమి, 'రా' జనువాఁడు ప్రజల ననురంజన చేయుటయే ముఖ్యధర్మము. లేకున్న రాజశబ్ద నిరర్థకము. 'రాజా ప్రకృతి రంజనాత్' అని యభియుక్తోక్తి. ఈ విధానమును బట్టి పాలక పాలితుల కన్యోన్య సంబంధ మొక కుటుంబములోని యన్నదమ్ములకు వలెనో, తండ్రి కుమారులకు వలెనో యుండినటుల దెలియుచున్నది. భూమిని పరిగణనముఁ జేసి యింతని నిర్ణయ మొనర్చి భూసారమును బట్టి సుంకమును నిర్ణయింపవలయుననియు, రైతు కే విధముగ నష్టి కాదో అద్దాని యోజించి సుంకమును వసూలు చేయవలెననియు, వృక్షములకు నష్టి లేకుండఁ బుష్పములఁ దోఁటమాలి యెట్లు గోయునో, యట్లే సుంకమును దీసికొనవలయుననియు, భూసారము ననుసరించి వ్యవసాయపు కర్చులు పోఁగాఁ బన్ను గాక రెండింతలు మిగులునట్లుఁ జూడవలయుననియు, లేకున్న వ్యవసాయదారుఁడు దుఃఖించుననియు, శుక్రనీతియందు వ్రాయఁబడియున్నది. వాపీకూప తటాకాదుల వలనఁ బండింపఁ బడిన భూముల పయిని మూఁడవవంతును, వరుణదేవుని పయి నాధారపడియున్న భూముల పయిని నాలుగవ వంతును, ఆనకట్టల వలన ఫలించిన భూముల పయిని నర్ధ భాగమును, సుంకము వసూలు చేయవలయుననియు, నూషర క్షేత్రములనుండియు, జాతిభూమి నుండియు, నాఱవవంతు దీ[illegible]నవలయుననియు, వ్యవసాయదారుని వలన నూఱు రూప్యములు సుంకము వసూలైన యెడల నూటికైదు రూపాయల వంతున వ్యవసాయదారునకు మురరా నీయవలయుననియు, ఫలసాయము హెచ్చుటకు వాపీకూప తటాకాదులు భూములలోనికిఁ ద్రవ్వుకొనినను, గ్రొత్త భూమిలో వ్యవసాయము చేసినను అందుల కగు వ్యయమునకు రెండింతలు లాభము వ్యవసాయదారుఁడు పొందువఱకు నా భూముల పయి సుంకమును విధింపరాదనియు, శుక్రనీతియందు వ్రాయఁబడియున్నది. (శుక్రనీతిసారము, ౪ వ యధ్యాయము, ౨ వ ప్రకరణము.)

గ్రామ సమీపమున నది గాని, సరస్సు గాని, సముద్రము గాని యున్న యెడల నందుఁ జేపలఁ బట్టువారు ఆఱవ భాగము పన్ను నీయవలయుననియు, వర్తకము చేయువారు రేవులలోఁ బన్నుల నీయవలయుననియు, నదులను గాలువలను దాటువారు నియమిత స్థలములందుఁ ప్రభుత్వమువారి పడవలపయిని దాటి యందుకు నియామకమైన సుంకమును జెల్లింపవలయుననియుఁ, జిన్ని జంతువులను దాటింపవలసిన నొక మాష



(ఐదు గురివిందల యెత్తు నాణెమును, గోవుమీఁదఁగాని, యశ్వముమీఁదఁగాని, శిరముపయిఁగాని, భుజములపయిఁగాని, బరువులను దాటింపవలసిన రెండు మాషలును, చిన్ని బండ్లకు ౫ మాషలును, పెద్ద బండికి ౭ మాషలును, సాధారణ యెడ్ల బండికి ౬ మాషలును, మహిషమును, ఉష్ట్రమును, దాటింపవలసిన ౪ మాషలును, పన్ను చెల్లింపవలయుననియుఁ, గౌటిల్యుని యర్థశాస్త్రమున విచారింపఁబడియెను. ముత్యముల నేరుటకును, శంఖములఁ బోగు చేయుటకును, ప్రభువుయొక్క నౌకలే యద్దెకీయఁబడుననియుఁ, తుపానువలన భంగపడిన నావలు రేవు చేరినపుడా నావలను నౌకాధ్యక్షుఁడు తండ్రి బిడ్డను జూచు రీతిఁ జూడవలసియుండెననియుఁ, తుపానువలనఁ జెడిపోయి చెమ్మగిలిన నావలపయి సుంకము నర్ధభాగము వసూలు చేసిరియో, పొత్తుగా వసూలు చేయుకనో, తరుణము వచ్చినప్పుడు పోవుట కనుజ్ఞ నిచ్చుచుండెననియు, వ్యాపారము చేయువారి సరకులను దీసికొనిపోవు ప్రభుత్వమువారి నౌకలు నీటమునిఁగినప్పుడా నష్టి ప్రభుత్వ కోశమునుండి నౌకాధ్యక్షుఁడు ఇచ్చుచుండెననియు, శత్రు దేశములకుఁ బోవు నౌకలను, బన్నులఁ జెల్లింపని యోడలను, నౌకాధ్యక్షుఁడు తీవ్రముగ శిక్షించుచుండెననియు, నీ విధముగఁ బ్రభుత్వ కోశమును అతఁడు నింపుచుండెననియు, నర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది.

ప్రభుత్వకార్యముల వలని ఫలితములు; వృక్షములు, పండ్లు, పబ్లిక తోఁటలలోఁ బెరుగు కూరగాయలు, జాలరీవృత్తుల ప్రతిఫలము,— మొదలగునవి. వేఁట మూలమునను, ఏనుఁగులు మొదలగు జంతువుల మూలమునను, అరణ్యక భూముల యొడంబడిక వలన అడవి పన్ను వసూలగును. బంజరు భూములలోఁ బసులను మేపుచున్నందులకుఁ బ్రభుత్వమువారికిఁ జెల్లింపఁబడు సుంకములతోఁ గూడి పచ్చికబీళ్ళవలన రాఁబడియు, బాటలపయిఁ జెల్లింపబడు సుంకములును, ప్రభుత్వాదాయమునకు దోహదముగ నుండెను. చాణక్యునివలన లభ్యమయిన మఱియొక రివెన్యూ విభాగముగూడ ముఖ్యమయి యున్నది. ఈ విభాగమును కొద్దిపాటి మార్పులతోఁ గ్రొత్త మార్గమునఁ జొన్పింపవచ్చును. ఈ విభజన ననుసరించి ప్రభుత్వాదాయము Revenue Tax అనియు, Non Revenue Tax అనియు, రెండు విధములుగ నున్నది. మొదటి దాని క్రింద నిర్ణయమైన పన్నులు పిండకర (నిర్ణయమైన సుంకములు), షడ్భాగ (పంటలో నాఱవభాగము,) సేనాభక్త (సైన్యమునకుఁ బనిపాటలసరఫరా), బలి (మత విషయక సుంకములు), కర (సామంత ప్రభువుల యుపాయనములు), ఉత్సంగ (నైర్బంధిక దాక్షిణ్యములు), పార్శ్వ (కప్పములు), పారిహీనిక (నష్టమునకుఁ బ్రతిఫలములు), ఔపాయనిక (బహుమతులు), కౌస్తేయక (పబ్లిక్ బిల్డింగుల బాడుగలు), గలవు. రెండవదాని క్రింద ౧. సారవంతములయిన భూములలోని ఫలసాయము. ౨. గింజల యమ్మకమువలన వచ్చు ద్రవ్యము. ౩. భైత్తుక వృత్తి వలన వచ్చు గింజలు. ౪. వర్తక వ్యాపారముల కగత్యమగు ధాన్యము. ౫. పెట్టుబడిమీఁద వడ్డి. ౬. ప్రభు

త్వాధీనమున నున్న చేతి పనుల లాభములు,—మొదలగునవి గలవు. ఇవి గాక వారసు లేకుండుటవలనఁ బ్రభుత్వమువారికిఁ జెందిన సొత్తులు, అపరాధములు, జప్తులు, దొంగిలింపఁ బడి పయిఁ గొద్దిపాటి యాదాయము, తిరుగుబాటుఁ జేయువారి యాస్థుల నష్టములు గలవు. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౧౫) ఏ మూలమునఁ బ్రభుత్వమువారికి ఆదాయము రాఁగలదో తద్విషయమును గూర్చి శుక్రనీతి యందలి రెండవ యధ్యాయములోని 33౫-వ శ్లోకమునఁ జెప్పఁ బడినది. ద్రవ్యరూపమునఁ గాని, వస్తురూపమునఁ గాని, లేక కొంత ద్రవ్యరూపమునను గొంత వస్తురూపమునను బన్నులు చెల్లింపఁ బడుచున్నవి. కౌటిల్యుఁడు రొక్క పూర్వకముగ వసూలు చేయఁబడు పన్నులను గూర్చి చక్కఁగా దెలియఁజెప్పుచున్నాఁడు. శూద్రులు, కర్మకరులు, ఇంక నితరులు, అనఁగాఁ గాయకష్టముచేత జీవించువారు (కర్మజీవనులు) మాసమున కొక దినము వారు చెల్లింపవలసిన పన్నులకు బదులు తమచే నగు పనిని సర్కారువారికిఁ జేయుదురు. (విష్ణుపురాణముఁ, జాలీకృత సంస్కృత పఠనీయ గ్రంథము. అధ్యాయము 3.) శిల్పులు గాని, పాటకపుఁ బ్రజగాని, స్వకాయ కష్టమున బ్రదుకు శూద్రులకుం బలె ప్రతి నెల యొక దినము సర్కారువారికిఁ బని చేయవలసినదని రాజ శాసన ముండెను. (మనుధర్మశాస్త్రము, ౭, ౧౩౮.) కాని యెవ్వరేని శాసనాబలమువలన నిర్బంధింపఁ బడలేదు. ఐచ్ఛికమే. మెగస్తనీసు అను గ్రీకురాయబారి భారత దేశైశ్వర్యమును, ఔన్నత్యమును గర్ణ్వపేయముగ నభివర్ణించి యున్నాఁడు. 'హిందూదేశమున దాస్య మనునది లేదు. స్త్రీల పాతివ్రత్యమును బురుషుల ధైర్య స్థైర్యములును బ్రశంసనీయములు. పరాక్రమమునందు భారతీయు లితర ఆశియాదేశీయుల కన్న మిన్నగ నుండిరి. వారి కవాటములకుఁ దాళము లక్కఱలేదు. అనృతమాడువార లెందునకేని లేకుండిరి. భారతీయు లెల్లరును గుశాగ్ర బుద్ధులును నిపుణులును నయి యుండిరి. వారెన్నఁడును వ్యాజ్యములలో దిగక స్వదేశ రాజుల క్రింద శాంతముగ నుండిరి. మనుధర్మ శాస్త్రమునఁ జెప్పఁబడినట్లుగనే పరిపాలనము సాగింపఁబడుచుండెను. గ్రామపు కట్టుబాట్లు బాగుండెను. ప్రతి గ్రామమును బ్రజాస్వామ్య మనుభవించుచుండెనని చెప్పినాఁడు. హుయానుత్సాంగు అను నతఁడు కుటుంబములు 'రిజిష్టరు' పయిఁ జేర్పఁబడి యుండలేదు. అస్వాభావిక కార్యములకును, ప్రకృతి విరుద్ధములయిన పనులకును బ్రజలు వశులు గాకుండిరి.' అని చెప్పినాఁడు. (బౌద్ధ గ్రంథములు, పుస్తకము ౧.) పనివాండ్రు తమకు నిర్ణయమైన పనులఁ జేయువారే! వారు చెయు పనులకుఁ బ్రతిఫలము నిక్కరగ నుండెడిది. (బౌద్ధ వ్రాఁతలు, పుస్తకము ౧.) బ్రాహ్మణులు తమ భూములకుఁ జెల్లింపవలసిన పన్నులఁ జెల్లింప నక్కఱలేకుండఁ జేసిరనియు, నీ యేర్పాటు బాగుగఁ జదువుకొనిన బ్రాహ్మణులకే గావున దిగువ జాతులు వెలువఁ బని లేదనియు, ఆఁడువాండ్రు, విద్యార్థులు, బధిరపంగ్వంధులు, వ్యాధితులు, అప్రాప్త వ్యవహార దశయందున్నవారు (మైనరులు), అలభ్యమగు నాస్తి నెవరికొఱకు నార్జించిరో యట్టివారు, పన్ను



లను జెల్లింపనక్కఱలేదని విధాయింపఁ బడిరనియు, ఆపస్తంబుఁడు చెప్పుచున్నాఁడు. (ఆపస్తంబ సూత్రములు, ౨, ౧౦, ౨౬, ౧౪-౧౭.) వసిష్ఠవిష్ణుపురాణములును, మనుస్మృతియు నిట్టి యభిప్రాయముల నొసంగినవి. కౌటిల్యుఁ డీ రీతినిఁ జెప్పుచున్నాఁడు. ఆర్థిక బలము హెచ్చుగ నున్న కాలమునఁ బ్రభువు శాస్త్రవిధి ననుసరించి కాక యితర విధములుగఁ దనకు న్యాయమని తోఁచినట్లుగ ద్రవ్య సమీకరణమునకుఁ దలపెట్టి యుండెను. పంటలో నాలుగవ వంతు గాని, లేక మూఁడవ వంతు గాని, యితరవాని పయి నూటికింత యని నిర్ణయమైన గొప్ప సంఖ్యను గాని రాజడుగవచ్చును. ప్రభుత్వోద్యోగులు గూడ రాజకోశము నింపుటకుఁ గాను బ్రజలను బైరులు వేయుటకై నిర్బంధింపవచ్చును. వలయునంత ద్రవ్యము సమకూర్చుటకీ విధానము పనికిరాకపోయెను. పన్నులు మొదలగునవి వసూలు చేయు గొప్పయుద్యోగస్థుఁడు 'సమాహర్త' యను వాఁడు. ప్రభుత్వావసరముల కయి ప్రజల నడుగువాఁడు సమాహర్త. వదాన్యుల విరాళములును, గౌరవచిహ్నము లగు దుస్తులును, అలంకారములును, హెచ్చుగ నుండెను. ఆర్థిక దురవస్థల యందును, ఇతర విధములగు పెక్కు విషయములలోను, ఉపాయములలోను, ప్రభుత్వనిధులకు (State Funds) తోడ్పడ నిర్బంధింపఁ బడుచుండెను. మతసంస్థలు గూడ,(Religious Institutions) తోడ్పడవలసియుండెను. ఇది వారికిఁ గంటకప్రాయముగ నుండలేదు. 'ఈ నిర్బంధ మయినను నొక పర్యాయమే గాని అంతకు మించి కాదు' అని చాణక్యుఁడు తెలుపుచున్నాఁడు. 'మధ్యరకపు భూములను సాగు చేయువారిని, లేక సామాన్య రకపు భూములను సాగుచేయువారిని, కోటలఁ గట్టుట యందేమి, వ్యవసాయ కార్యములందేమి, వ్యాపార సంవిధాన మందేమి, యూషర క్షేత్రములలోఁ గాపురము సేర్పఱచుకొని ఆ భూములను ఆక్రమించుట యందేమి, గనులలోఁ బనిచేయుట యందేమి, యరణ్యములఁ గాపాడుటయందేమి, ప్రభుత్వమునకు గొప్ప సాహాయ్యము చేయువారిని ప్రభుత్వోద్యోగులు నిర్బంధింపకుండ్రు' అని కౌటిల్యుఁడు చెప్పుచున్నాఁడు. (అర్థశాస్త్రము, పుస్తకము ౫, అధ్యాయము ౨. శుక్రనీతి, ౪-౨-౧౦) పూర్వమే రాజుగాని దుర్నీతుఁడయి తన ప్రజలను బాధించిన యెడలఁ బ్రజ లాతనిపయిఁ దిరుగఁబడి యతని ప్రభుత్వమును నాశము చేయువారు. ఈ భయము వలన నైనను బూర్వము రాజులు పన్నులను వసూలు చేయుటయందేమి, పరిపాలనా విషయమందేమి, సరళతఁ దాల్చియుండిరి. మొగలాయి ప్రభుత్వమున భూమి పన్ను క్రింద రొక్కమే గాకుండఁ బంటలో నొక భాగము గైకొనుటవలనఁ బ్రజకు ధరల హెచ్చుతగ్గులవలనఁ గాని, క్షామ సమయమునఁ జెల్లింపవలసిన రొక్క పూర్వకముగు పన్ను చెల్లించుటవలనఁ గాని, బాధ లేకుండెను. ఆ నాఁటి ప్రభువులు సరళతఁ దాల్చి యుండుటవలనఁ బ్రజలు తమకు విధింపఁబడిన పన్నులను బూర్ణముగఁ జెల్లింప కుండినను బాధగాని, హానిగాని, లేకుండెను. ప్రభుత్వాదాయము లన్నిఁటి యందును భూమి శిస్తు మిగులఁ బ్రాముఖ్యమయి యుండెను. ఏ విధముననైననేమి భూమిఖామందుగ రాజు ఎన్నఁడును బరిగణింపఁ బడలేదు. అతఁ డెప్పుడును బ్రజల భూస్వా

వ్యము తనదని భావించిగాని, వాదించిగాని యుండలేదు. అతని దృక్పథము పంటలోఁ దనకు రావలసిన భాగమునందే నిలచియుండెను. అతఁడు రాజ్యమునకును, దద్ద్వారా ప్రజలకును జేయునట్టి సేవకుఁగాను వేతనముగా పంటలో రాజుకు నిర్ణయింపఁబడిన భాగము పరిగణింపఁబడినది. (బోధాయనుని ధర్మ సూత్రములు, అధ్యాయము ౭.) (క్రీ. పూ. ౧౨-వ శతాబ్దపు వాఁడగు పూర్వమీమాంస సూత్రకర్తయగు జైమిని ‘నభూమిస్స్యాత్సర్వాన్ప్రత్యవిశిష్టత్వాత్’ అని చెప్పినాఁడు. (జైమినీ సూత్రము, ౬వ యధ్యాయము, ౭ వ పాదము, ౩ వ సూత్రము.) అనఁగాఁ బ్రజకు భూమి విశేషించి స్వాధీనమైనది గాన రాజునకు భూమిని దానము చేయు నధికారము లేదు, ‘తత్రైవమూహ భూమిర్దేయా న వేతి సంశయే సార్వభౌమస్య విద్యమాన స్వత్వత్యాగ సంభవాద్దేయేతి బహిః పూర్వపక్షే సిద్ధాంత మహ నేతి స్పష్టార్థః’ అని పూర్వమీమాంస గ్రంథరచయితలలోఁ జిగురువాఁడగు రామేశ్వరసూరి యను నతఁడు వ్రాసినాఁడు. సార్వభౌమత్వము అనుభవ యోగ్యమేగాని యస్వాక్రాంతము సేయు శక్తి నీయదు. సేద్యగాండ్రు పండించిన దానిని విరోధులు తీసికొని పోకుండఁ గాపాడుటయుఁ, బంటయందతనికి రావలసిన భాగమునకు మాత్రము రాజున కధికారమున్నది గాని భూమిపయి నే విధమగు నధికారమును లేకుండెను. భూమి రాజు సొత్తు కాదనియుఁ, బ్రజకు దానియందు స్వత్వము గలదనియుఁ దేలినది. వ్యవహారమయూఖకారుఁడయిన నీలకంఠుఁడు సైతము మీమాంసయందలి యభిప్రాయమును నంగీకరించుచున్నాఁడు. కావున రాజున కేవిధముగఁ జూచినను బ్రజల భూమిపయి నట్టి హక్కును లేకుండెను. రాజు తన స్వీయోపయోగమునకయి యుంచికొనిన భూములు (Cultivated Lands for the use of the king), గృహములు, కోటలు, రాచనగరులు,—మొదలగువాని పయి నెట్టి యధికారియుఁ గాఁడు. బంజరు భూములను బాగుపఱిచిన వాఁడును, భూమిని రాజు దగ్గఱఁ దీసికొన్న వాఁడును, రాజధర్మముల ననుసరించి నియమితమైన పన్నులను రాజునకుఁ జెల్లింపవలయును. అట్టి వాఁడు భూస్వామ్య మమ్ముకొనవచ్చును. లేదా అద్దెకొసవచ్చును. రాజునకా భూమి ధరతో సంబంధము లేదు. భూమినిఁ గొన్న వాఁడే ప్రభువునకుఁ బన్నులఁ జెల్లింపవలయును. ఎవరు చెల్లించినను ప్రభువుకు రావలసిన పన్నులకు మాత్రము బాధ్యులని తెలియుచున్నది. విజ్ఞాన సర్వస్వమునందు మాధవాచార్యుల వారు, ‘దేశ ప్రభువుకు దేశముపయిఁగాని, మండలాధికారికి మండలముపయిఁ గాని, పూర్ణమైన హక్కు లేదు. దుష్టశిక్షణము, శిష్టరక్షణము చేయుటకుఁ బ్రభువ కంతవఱకు నధికార మున్నదిగాని ప్రజల భూములఁ గైకొనుటకుఁ గాదు. అట్లుఁ గాని యెడలఁ బ్రజలు వసించు గృహములును, వారి భూములును బ్రభునివే కావలసి యుండును. సుంకము పుచ్చుకొను నధికారము మాత్ర మితనికిఁ గలదు’ అని వ్రాసియున్నాఁడు. (విజ్ఞాన సర్వస్వము, ౧౩౧౫-పుట.) (క్రీ. శ. ౯ వ శతాబ్దమునందలి ‘పార్థసారథి మిశ్ర’ కృత శాస్త్ర దీపికా వ్యాఖ్యయందు దుష్టుల దండించి అపరాధములను విధించుటయును, దదపరాధముల వసూలు చేయుటయును, రాజ్యములో నప



ద్రవములు సంభవింపకుండఁ గాపాడుటయును, సేద్యగాండ్ర నుండి పన్నులఁ బుచ్చుకొనుట రాజు విధియనియు, భూమియందుఁ బ్రభువున కధికారము లేదనియు, నా కారణమున సార్వభౌమునకు భూమి నస్వాక్రాంత మొనర్చుటకుఁగాని, మండలాధిపతులు మండలముల నస్వాక్రాంతము చేయుటకుఁ గాని యర్హులు గారనియు, నధికారము లేదనియుఁ గలదు. కావున నిందలి విపరీత భావము విడువవచ్చును.

‘ప్రజలపయిఁ బన్నులు తేలికగ నున్నవి. రాజుకుఁ బ్రజలు సేయు సేవ బహు స్వల్పము. ప్రతివాఁడును దన వస్తువులను జాగ్రతగ నుంచికొనును. రాజుగారి భూములను సేద్యము సేయువారు వ్యాపారములను జేయుటకయి వచ్చుచుఁ బోవుచు నుందురు. రేవుస్థలముల యొద్దను, రాచబాటల ఘాటీల యొద్దను, వారు స్వల్పముగ సుంకములను జెల్లింపవలయును. రాజ్యాంగ నిర్మాణములలోను సంస్థలలోను అవసరము వచ్చినప్పు డందఱును దోడ్పడుట విస్పష్టమయి యుండెను. ఈ విధముగఁ దోడ్పడిన యెడలఁ దగిన ప్రతిఫలము పొందుదురు.’ అని విదేశ రాయబారి యగు హుయాన్‌త్సాంగు వ్రాసెను. సుంకముల విధించుటలోని ఆదర్శములు సక్రమములును దృఢములును నైయున్నవి. ఆధునిక రాజనీతి శాస్త్ర వ్యాపనకుఁ గొలఁది సామర్థ్యమును, ద్యాగమును మాత్రమే యని ప్రాచీనార్థిక శాస్త్రజ్ఞుల యుద్దేశములు. ‘రాజు పన్నులను వసూలు చేయుటయందు ఆ త్రోవనే యనుసరింపవలయును. రాజుయొక్క పరిస్థితులు ఆశాబంధనమున, వాంఛాబంధనమున నడ్డుఁ దగిలి యుండకూడ’దని మహా భారతము చెప్పుచున్నది. (శాంతి పర్వము, అధ్యాయము ౭౧, శ్లో ౧౩.) ప్రథమ ధర్మశాస్త్రజ్ఞుఁడగు వసిష్ఠుఁడు ‘రాజు తన రాష్ట్ర ప్రజలనుండి స్వోపయోగమునకయి వారి యాస్తిని దీసికొనఁగూడదు.’ అని చెప్పినాఁడు. (వసిష్ఠ ధర్మ సూత్రములు, ౧౦-౧౮.) ఇంకను ‘ధర్మశాస్త్రము ననుసరించి పరిపాలనము సేయు రాజు ప్రజల ద్రవ్యమున నాఱవ భాగము పుచ్చుకొనవచ్చు’నని వసిష్ఠుఁడు చెప్పుచున్నాఁడు. (వసిష్ఠ ధర్మ సూత్రములు, ౧-౪౨.) ‘అత్యాశతోను, అన్యాయ బుద్ధితోను నీ కోశము నింపుటకుఁ బోఁగవల’దని మహా భారతములో రాజుకు బుద్ధిఁ గఱపఁబడినది. నిర్బంధము చేసి వసూలు చేయ నెంచిన రాజుయొక్క యుద్దేశమునకు భిన్నముగ నిట్టి గ్రంథముల రాజునకు బుద్ధి చెప్పఁబడినది. అవివేకముతో శాస్త్ర విధి నతిక్రమించి పన్నులను వసూలు చేయఁదలఁచి తన రాజ్యములోని ప్రజలను బాధించు లుబ్ధుఁడగు ప్రభువు తన నాశమును దానే తెచ్చుకొనునని యాపస్తంబ ధర్మ సూత్రములలోఁ జెప్పఁబడినది. (ఆపస్తంబ ధర్మ సూత్రములు, ౨, ౧౦, ౨౬, ౯.) ‘ధర్మ్యం శుల్కం అవహారయేత్’ అని సూత్రము. కౌటిల్యుఁ డీక్రింది వాక్యములలో మూఢులగు రివిన్యూ అధికారుల ప్రవర్తనమును విమర్శించెను. ‘ఎప్పు డొక యధికారి మామూలు రివిన్యూ మొత్తమును ద్విగుణముగ ననుభవించునో అట్టి యధికారి ప్రజల జీవరక్తమును పీల్చుచున్నాఁడన్న మాట! అట్టి యధికారిని రాజు పదచ్యుతుని జేయవచ్చును. ఇవియే యా

దర్పములు. న్యాయబుద్ధి కలిగి తెలివితోఁ బన్నులను వసూలు చేయుటయందుఁ దోడ్పడినవారు పెక్కుమంది యుండిరి. ప్రజలను దోఁచుకొనుట వలన రాజకోశమును నింపుటకుఁ బ్రేరేపించువారును నుండిరి. బలహీన రాజ్యములలోని ప్రభుత్వోద్యోగులు ప్రజల యొక్కయుఁ బ్రభుత్వము యొక్కయు వ్యయమువలన ద్రవ్యవంతులగుచుండిరి. ప్రజల వలన వసూలగు పన్నులలోఁ బ్రజాశ్రేయము లీనమై యుండెను. భారతదేశ మహాకవులలో నగ్రగణ్యుఁడగు కాళిదాస మహాకవి 'సూర్యుఁడు భూమిపయినిఁ జెమ్మ నెట్లు తన కిరణముల ద్వారమున గ్రహించి మరల వేయిరెట్లుగ నిచ్చుచున్నాఁడో అట్లే రాజు ప్రజల శ్రేయస్సు నిమిత్తము వ్యయపఱచుట కయి పన్నులు వసూలు చేయుచుండు' నని చెప్పినాఁడు. 'యాగములు, పూర్వుల ఆరాధనము, దానము, రాజు సొంత వ్యయములు, ప్రభుత్వ భవన వ్యయము, సివిల్ శాఖల వ్యయములు, విదేశాంగ కార్యములకు సంబంధించిన వ్యయములు, సైనిక వ్యయములు, సేనను సమకూర్చు వ్యయములు, ప్రభుత్వ కార్యముల వ్యయములు, అడవుల సంరక్షణమునకగు వ్యయములు,' అని ప్రభుత్వవ్యయమును గౌటిల్యుఁడు వర్ణించినాఁడు. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౬.) శుక్రనీతియందుఁ గ్రింది యాఱు విధములగు పరిపాలనా కార్యములకయి రివెన్యూ యందలి యర్థభాగము వ్యయపఱుపఁ బడునట్లు వ్రాయఁబడి యున్నది. ౧. ఉన్నతోద్యోగుల వేతనములకు ౧/౧౨ భాగమును, ౨. సైన్యమునకు ౩/౧౨ భాగమును, ౩. ధర్మములకు ౧/౨౪ భాగమును, ౪. ప్రజోపయోగ కార్యములకు ౧/౨౪ భాగమును, ౫. అధికారుల వేతనములకు, ౧/౨౪ భాగమును, ౬. రాజుయొక్కయు, రాజగృహముయొక్కయు సొంత వ్యయములకు ౧/౨౪ భాగమును వ్యయపఱచినట్లుఁ దెలియుచున్నది. (శుక్రనీతి, అధ్యాయము ౧, శ్లో. ౩౧౬-౩౧౭.) ప్రభుత్వ కోశమున నిరువది నాలుగు సం॥రముల వఱకుఁ బ్రభుత్వమువారి పనులు నెఱవేరుటకుఁ జాలినంత ద్రవ్య ముండెడిదని శుక్రనీతి యందుఁ జెప్పఁబడినది. (శుక్రనీతి, ౪, ౨, ౧౩.) రాజ్యమున కంతకును బ్రభుత్వాదాయమే (Public Finance) ప్రాముఖ్యముగ గణింపఁ బడియెను. కౌటిల్యుఁడు చెప్పిన ప్రకారము వారసత్వము వలనఁగాని, లేక స్వార్జితము వలనఁగాని, న్యాయముగ సంపాదింపఁబడిన బంగారము, వెండి, ముత్యములు, పలు రకముల రత్నములు మున్నగు వానితో నింపఁబడిన చక్కని కోశముండె నని తెలియుచున్నది. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౧.) ఈ విషయమునఁ గౌటిల్యుని యభిప్రాయము లతిగూఢముగను, ద్వైవిధ్యముగను నున్నవి. ప్రజాశ్రేయము పుణ్యకార్యముల నిమిత్తము అధికారుల సన్మానములు, తస్కరుల దండనము, ప్రభుత్వోద్యోగుల లంచగొండితనమును సడ్డు బెట్టుట, సస్య విస్తరణము, వర్తక వ్యాపారముల లాభము, విపత్తుల నుండియుఁ గష్టములనుండియు విముక్తి, అంతములేని పన్నులు, సువర్ణరూపమున రేదు,—ఇవి యన్నియుఁ గోశము నింపుటకు అనుకూలముగ నున్నవి.



ప్రభుత్వాదాయ శాఖానిర్వహణము 'సమాహర్త', 'సన్నిధాత' అను నిరువురు స్థిరోద్యోగుల యధీనమున నుండెను. వీరి నాంగ్లమున Collector-General అనియు, Treasurer-General అనియుఁ బిలుతురు. సమాహర్త యను నతఁడు పన్నులను వసూలు చేయుచుండెను. 'సన్నిధాత' యను నతఁడు ఆదాయములను జాగరూకతతోఁ జూచుచుండెను. పన్నులు సక్రమముగ వసూలు చేయుచున్నారా లేదా యను విషయమున నతి జాగరూకత వహించుచుండెను. 'సమాహర్త' యను వాఁడు పన్నులు వసూలగుటకు సులువుగ నుండునని దేశమంతను పెక్కు మండలములుగ విభజించెను. పన్నులీయ నక్కఱలేదని విడాయింపఁబడిన వారిని బట్టియు, సుంకములకు బర్యాయముగ దేశ సంరక్షణకయి సిపాయీలను జేకూర్చుటయు, వారి సుంకములు సువర్ణ నాణెముల రూపమునఁ జెల్లించుటయు, ధాన్యరూపమునను, వస్తురూపమునను, బన్నులఁ జెల్లించుటయు ననఁగా ధాన్యము, పశువులు, అపక్వ పదార్థములు, పాలు, పెరుగు,—మొదలగునవి ఉచితముగఁ బరిశ్రమ చేసి ప్రభుత్వమున కేమూలమునఁ దోడ్పడుటయు నని గ్రామములను విభాగించిరి. (అర్థశాస్త్రము, పుస్తకము ౨, అధ్యాయము ౭. రాజ్యాంగ విధానములను బరిశీలించువాఁడగు 'సన్నిధాత' సరియగు నాదాయ వ్యయ నిరూపణ పట్టికలను (Budget) దయారు చేయఁగల శక్తి గలిగియుండెను. ప్రభువులు ప్రజావ్రియమును గోరక వారి శ్రేయము నే మది నెంచి యేలుచుండిరి. అశోకుఁడు ప్రజోపయోగముకయి మార్గముల ప్రక్కను జెట్లను వేయించియుఁ, గ్రోశమునకు రెండు వంతున బావులఁ ద్రవ్వించియు, సత్రములఁ గట్టించియు, వ్యాధితులకు జీవ జంతువులకును, మానవులకును,—నుపయోగించునట్లు ధర్మ చికిత్సాలయముల నేర్పఱచియు, రసాల సాలములతోఁ గూడిన తోఁపులను వేయించియుఁ, బ్రజల యైహికాముష్మిక జీవనమును సర్వ విధముల బాగొనర్చెను. హర్షుని యనంతరము ఆర్యావర్తము చిన్నచిన్ని తునకల క్రిందఁ జీలిపోయెను. ఇట్టి స్థితియందైనను బ్రజల యార్థిక జీవనౌన్నత్యము సంతృప్తికరముగనే యున్నదనవచ్చును. పారిశ్రామిక, వ్యవసాయికాది విషయములందుఁ బ్రజలు ద్రవ్యవంతులు కాఁజొచ్చిరి. చక్రవర్తులు మారినను, సంగర రంగమ్ములఁ రక్తవాహినులు స్రవించి వ్యాకుల పెట్టినను, ఆర్థికముగఁ బ్రజలు పరితపింపకుండిరి. ప్రజ లిట్టి స్థితియందుండుట చేతనే యీ సంక్లిష్ట సమయమున సైతము కళాభివృద్ధి జరిగెను.

కావున నే దేశమందయినను బ్రజల యార్థిక సంపత్తి పరిపాలనా పద్ధతిని బట్టి యుండును. ప్రజాభిప్రాయమును బట్టి ప్రజా శ్రేయోభి వృద్ధులనే మనసునందుంచి ప్రభువు పరిపాలనముఁ జేసిన యెడలఁ బ్రజలు సమస్త భోగభాగ్యముల విలసిల్లుదురు. ప్రజలనుండి వసూలు చేయు ద్రవ్యము తత్ప్రజల యభివృద్ధికయ్యే శ్రేయస్సు నిమిత్తమే వ్యయపెట్టుట ప్రభువుయొక్క ధర్మము. ఒక దేశమున వసూలు చేసిన ద్రవ్యము అన్యదేశ ప్రజల యభ్యుదయముకయి వ్యయపఱచుట ధర్మము కాదు. ఈ విషయమును

గమనించియే రాజనీతి విశారదు లనేకులు ప్రజా ప్రాతినిధ్యము లేనిదే పన్నులు వసూలు చేయరాదని చెప్పిరి. (No taxation without representation) అని యాంగ్ల సూత్రము.

---

## రాజు.

---

స్వతస్సిద్ధమగు మానవ చరిత్ర వికసించుట కయి ధర్మశాస్త్రము లేర్పడినవి. ప్రజా ధర్మములఁ బరిరక్షించుచును వారిని ధర్మ మార్గమున నడచునట్లు చేయుట రాజ ధర్మము. మత్స్య పురాణమున 'స్వే స్వే ధర్మే వ్యవస్థానాం, వర్ణానాం పృథివీపతేః। పరో ధర్మః స్సదా ప్రోక్త, స్త్రైయ్యన్నః పరో భవేత్। స్వధర్మ ప్రచ్యుతాన్ రాజా, స్వధర్మే వినియోజయేత్॥' అని చెప్పఁబడినది. అనఁగాఁ బ్రభువయినవాఁడు వర్ణ వ్యవస్థలఁ బాటించి తద్ధర్మములఁ బరిరక్షించుటకు నిరంతరము సిద్ధముగ నుండవలయునని భావము. మనుస్మృతి యందును, విష్ణు పురాణమునందును వర్ణాశ్రమ ధర్మ రక్షణమే రాజధర్మమని చెప్పఁబడి యున్నది. ప్రజ లధర్మగతు లయిన దేశమున నియమము చెడి, యశాంతి బ్రబలి, ప్రజలు కర్తవ్యతా విమూఢులయి స్వేచ్ఛాచారులగుదురు. ఆ కారణమున దేశమునకుఁ గీడు సంభవించును. జాతి ధర్మగత జీవియై విలసిల్లిన స్వాభావికముగ జాతీయేచ్ఛ సన్నగిలును. ప్రజలు స్వధర్మ పరాయణులగుటకయి శాసింపుచు, రాజు స్వధర్మ పరాయణుఁడయి వర్తింపవలయును. భయమును దీర్చినవాఁడును, అన్నమును బెట్టినవాఁడును, దండ్రితో సములని పెద్దలు నిర్వచన మొనర్చిరి. కావున రాజు భయమును దీర్చు రూపమునఁ దండ్రి సముఁడు. ఈ సూత్రమును బట్టి రాజును బ్రజయుఁ బరస్పరము తోడ్పడుచు రాజ్యాంగ శకటమును నడపుచుందురు. భారతీయుల మానసిక కుహరమునుండి పొంగి పొరలిన రాజనీతిధార జాతీయ జీవనము శోభిల్లఁజేసి మానవ వికాసమునకు దోహద మొనర్చుచుండెను. ప్రభువయినవాఁడు స్వధర్మ రక్షకుఁడును, బోషకుఁడును నగుట 'నాదండో నామ రాజ్ఞంతి' యను సూత్ర విధానమున వర్తించుచుండవలయును. ప్రభుత్వమును సంఘములోని యొక ముఖ్య భాగమువోలెఁ బరిగణింతురు. స్వామి, అమాత్య, సుహృత్, కోశ, రాజ్య, దుర్గ, బలము లేడును రాజ్యాంగములు. ఈ యభిప్రాయము కామందకి, మహావంశము, శుక్రనీతి యందును, మహాభారతము, అర్థశాస్త్రములలోను ధృవపఱుపఁ బడినది. ప్రజలు రాజు నెన్నికొను సందర్భమును, బట్టాభిషిక్తుఁ జేయు విషయమును గట్టిగఁ జెప్పినటులు మహాభారతమునఁ జెప్పఁబడినది. 'దేశమున రాజు లేనిదే త్యాగము లేదు.' అని శాంతి పర్వమునఁ జెప్పఁబడి యున్నది. 'రాజు పరిపాలింపకున్నఁ బ్రజలు ముందు కడుగిడుటకే తెలియక సూర్యచంద్రులు ప్రకాశింప నప్పుడు సృష్టియంతయు నంధకార బంధురమగునట్లు ఆటమటింతురు. రాజు లేకున్నఁ బసులకాపరి లేని పసులమందవలెఁ బ్రజలుందురు. రాజు తన ధర్మమును



చేయకున్న యెడల దౌర్బల్య సూచక పరిస్థితులను దెచ్చికొనును. ఆస్తియు, భార్యా బిడ్డలును నశింతురు. దేశమంతయుఁ దస్కరులచేఁ గొల్లఁగొట్టఁబడును. వివాహమును గూర్చిన నియమములన్నియు పడలును. వ్యవసాయము, వర్తకము, లోటుపాటుఁ జెందును. నీతి నశించును. వేదము లదృశ్యములగును. యజ్ఞములు బహుకాలము జరుగవు. సంఘము చిందఱ వందఱ యగును. దేశమును క్షామము పీల్చివేయును. అన్ని రకముల యన్యాయము పొడసూపు' నని శాంతి పర్వమునఁ జెప్పఁబడినది. వైదిక యుగమున నెన్నిక మూలమున రాజేర్పడినట్లుఁ దెలియుచున్నది. 'రాజా వై రాజసూయే నేష్ట్వా భవతి సమ్రాట్, వాజపేయే నావరం హి రాజ్యం పరం। సామ్రాజ్యం కామయేత వై రాజా సమ్రాట్ భవితు మవరం హి రాజ్యం పరం సామ్రాజ్యం' అని శతపథ బ్రాహ్మణమునఁ జెప్పఁ బడినది. అనఁగా రాజసూయమువలన రాజును, వాజపేయమువలన సమ్రాట్టును, అగుననియు, రాజు పదవి తక్కువ సమ్రాట్పదవి హెచ్చును నగుట రాజయినవాఁడు సమ్రాట్టు కాఁగోరును గాని సమ్రాట్టులు రాజులు కాఁగోరరని యర్థము. 'యం బ్రాహ్మణో రాజానశ్చ పురస్కుర్వీరన్ స వాజపేయే నయజేత' యని లాట్యాయనుఁడు నుడువుచున్నాఁడు. అనఁగా నెవనిని రాజన్యులును బ్రాహ్మణులును దమపయి నేలికగ నుంచికొందురో యతఁడు వాజపేయము నాచరింపవచ్చునని భావము. 'రాష్ట్రస్యకకు దిశాశ్రయస్వ' అని సింహాసనమును రాష్ట్రమనెడి యుత్తమ స్థానముఁ జిత్రముగ నథర్వ వేదమున నభివర్ణింపఁబడినది. శతపథ బ్రాహ్మణమున 'నీ రాజ్యము నీయది. నీ వధిపతివి. ప్రజాక్షేమము కొఱకు నీ రాజ్య మీయఁబడినది.' అని యున్నది. ఈ వాక్యములు రాజ ధర్మమును దెలుపుచున్నవి.

రాజు అరిషడ్వర్గమును జయించి [illegible] సంయోగమువలనఁ బ్రజ్ఞను సంపాదించుచు, శాసనాబలమునఁ బ్రజలలో స్వ[illegible]స్థాపనముఁ జేయించి, నిరంతరోత్థానమునఁ దన యోగక్షేమముల ననుసంధించికొని, విద్యాబోధవలన వినయముగలవాఁడయి వర్తింపవలయునని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. ఇంద్రియముల వశపఱచుకొనని రాజు ఎంత గొప్పవాఁడైనను ద్వరలోనే నాశమగును. దాండక్యుఁడను భోజుఁడు బ్రాహ్మణ స్త్రీనిఁ గామించి బంధురాష్ట్ర హితుఁడయి నశించెననియు, వైదేహుఁడైన కరాళుఁడుగూడ నిట్లే నశించెననియు, బ్రాహ్మణులపయి నలిగి జనమేజయుఁడును, భృగులపయిఁ గోపించి తాళజంఘుఁడును, లోభమున సౌవీర రాష్ట్రాధిపతి యగు అజబిందును, ఐలయుఁ, బరదారను విడచుట కిచ్చగింపని దురభిమానముచేత రావణుఁడును, భాగమీయక దురభిమానము గలిగియున్న దుర్యోధనుఁడును, ప్రజల నవమానించెడి మదమున దంభోద్భవుఁడును, హైహయుఁడైన యర్జునుఁడును, అగస్త్యునిఁ జంపు సంతోషమున వాతాపియు, ద్వైపాయనునిఁ జంపు యత్నమున వృష్ణి సంఘమును, నీవిధముగనే నశించెననియు, నర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౧, అధ్యా

గమనించిరి. రాజనీతి విశారదు లనేకులు ప్రజా ప్రాతినిధ్యము లేనిదే పన్నులు వసూలు చేయరాదని చెప్పిరి. (No taxation without representation), అని యాంగ్ల సూత్రము.

---

## రాజు.

---

స్వతస్సిద్ధమగు మానవ చరిత్ర వికసించుటకయి ధర్మశాస్త్రము లేర్పడినవి. ప్రజా ధర్మములఁ బరిరక్షించుచును వారిని ధర్మ మార్గమున నడచునట్లుఁ జేయుట రాజ ధర్మము. మత్స్య పురాణమున, 'స్వే స్వే ధర్మే వ్యవస్థానాం, వర్ణానాం పృథివీపతేః । పరో ధర్మః స్సదా ప్రోక్త, స్త్రయ్యా యస్మిః పరో భవేత్ । స్వధర్మప్రచ్యుతాన్ రాజా, స్వధర్మే వినియోజయేత్ ॥' అని చెప్పఁబడినది. అనఁగాఁ ప్రభువయినవాఁడు వర్ణ వ్యవస్థలఁ బాటించి తద్ధర్మములఁ బరిరక్షించుటకు నిరంతరము సిద్ధముగ నుండవలయునని భావము. మనుస్మృతి యందును, విష్ణు పురాణమునందును వర్ణాశ్రమ ధర్మ రక్షణమే రాజధర్మమని చెప్పఁబడి యున్నది. ప్రజ లధర్మరతులయిన దేశమున నియమము చెడి, యశాంతి బ్రబలి, ప్రజలు కర్తవ్యతా విమూఢులయి స్వేచ్ఛాచారులగుదురు. ఆ కారణమున దేశమునకుఁ గీడు సంభవించును. జాతి ధర్మగత జీవియై విలసిల్లిన స్వాభావికముగ జాతీయేచ్ఛ సన్నగిలును. ప్రజలు స్వధర్మ పరాయణులగుటకయి శాసించుచు, రాజు స్వధర్మ పరాయణుఁడయి వర్తింపవలయును. భయమును దీర్చినవాఁడును, అన్నమును బెట్టినవాఁడును, దండ్రితో సములని పెద్దలు నిర్వచన మొనర్చిరి. కావున రాజు భయమును దీర్చు రూపమునఁ దండ్రి సముఁడు. ఈ సూత్రమును బట్టి రాజును బ్రజయుఁ బరస్పరము తోడ్పడుచు రాజ్యాంగ శకటమును నడపుచుందురు. భారతీయుల మానసిక కుహరమునుండి పొంగి పొరలిన రాజనీతిధార జాతీయ జీవనము శోభిల్లఁజేసి మానవ వికాసమునకు దోహద మొనర్చుచుండెను. ప్రభువయినవాఁడు స్వధర్మ రక్షకుఁడును, పోషకుఁడును నగుట, 'నాదండో నామ రాజ్ఞంతి' యను సూత్ర విధానమున వర్తించుచుండవలయును. ప్రభుత్వమును సంఘములోని యొక ముఖ్యభాగమువలెఁ బరిగణింతురు. స్వామి, అమాత్య, సుహృత్, కోశ, రాజ్య, దుర్గ, బలము లేడును రాజ్యాంగములు. ఈ యభిప్రాయము కామందకి, మహావంశము, శుక్రనీతి యందును, మహాభారతము, అర్థశాస్త్రములలోను ధృవపఱుపఁ బడినది. ప్రజలు రాజు నెన్నికొను సందర్భమును, బట్టాభిషిక్తుఁ జేయు విషయమును గట్టిగఁ జెప్పినటులు మహాభారతమునఁ జెప్పఁబడినది. 'దేశమున రాజు లేనిదే త్యాగము లేదు.' అని శాంతి పర్వమునఁ జెప్పఁబడి యున్నది. 'రాజు పరిపాలింపకున్నఁ బ్రజలు ముందు కనుగొనుటకే తెలియక సూర్యచంద్రులు ప్రకాశింప నప్పుడు సృష్టియంతయు నంధకార బంధురమగునట్లు అటమటింతురు. రాజు లేకున్నఁ బసులకాపరి లేని పసులమందవలెఁ బ్రజలుందురు. రాజు తన ధర్మమును



చేయకున్న యెడల దౌర్బల్య సూచక పరిస్థితులను దెచ్చికొనును. ఆస్తియు, భార్యా బిడ్డలును నశింతురు. దేశమంతయుఁ దస్కరులచేఁ గొల్లఁగొట్టఁబడును. వివాహమును గూర్చిన నియమములన్నియు సడలును. వ్యవసాయము, వర్తకము, తోటలు పాటుఁ జెందును. నీతి నశించును. వేదము లదృశ్యములగును. యజ్ఞములు బహుకాలము జరుగవు. సంఘము చిందరవందర యగును. దేశమును క్షామము పీల్చివేయును. అన్ని రకముల యన్యాయము పొడసూపు' నని శాంతి పర్వమునఁ జెప్పఁబడినది. వైదిక యుగమున నెన్నిక మూలమున రాజేర్పడినట్లుఁ దెలియుచున్నది. 'రాజా వై రాజసూయే నేష్ట్వా భవతి సమ్రాట్, వాజపేయే నావరంహి రాజ్యం పరం । సామ్రాజ్యం కామయేత వై రాజా సమ్రాట్ భవితు మవరం. హి రాజ్యం పరం సామ్రాజ్యం' అని శతపథ బ్రాహ్మణమునఁ జెప్పఁ బడినది. అనఁగా రాజసూయమువలన రాజును, వాజపేయమువలన సమ్రాట్టును, అగుననియు, రాజు పదవి తక్కువ సమ్రాట్పదవి హెచ్చును నగుట రాజయినవాఁడు సమ్రాట్టు కాఁగోరును గాని సమ్రాట్టులు రాజులు కాఁగోరరని యర్థము. 'యం బ్రాహ్మణో రాజానశ్చ పురస్కుర్వీరన్ సవాజపేయేన యజేత' యని లాట్యాయనుఁడు నుడువుచున్నాఁడు. అనఁగా నెవనిని రాజన్యులును బ్రాహ్మణులును దమపయి నేలికగ నుంచికొందురో యతఁడు వాజపేయము నాచరింపవచ్చు నని భావము. 'రాష్ట్రస్యకకుదిశ్రయస్వ' అని సింహాసనమును రాష్ట్రమనెడి యుత్తమ స్థానమునుఁ జిత్రముగ నథర్వ వేదమున నభివర్ణింపఁబడినది. శతపథ బ్రాహ్మణమున 'నీ రాజ్యము నీయది. నీ వధిపతివి. ప్రజాక్షేమము కొఱకు నీ రాజ్య మీయఁబడినది.' అని యున్నది. ఈ వాక్యములు రాజ ధర్మమును దెలుపుచున్నవి.

రాజు అరిషడ్వర్గమును జయించి వృద్ధ సంయోగమువలనఁ బ్రజ్ఞను సంపాదించుచు, శాసనాబలమునఁ బ్రజలలో స్వధర్మస్థాపనముఁ జేయించి, నిరంతరోత్థానమునఁ దన యోగక్షేమముల ననుసంధించికొని, విద్యాబోధవలన వినయముగలవాఁడయి వర్తింపవలయునని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. ఇంద్రియముల వశపఱచుకొనని రాజు ఎంత గొప్పవాఁడైనను ద్వరలోనే నాశమగును. దాండక్యుఁడను భోజుఁడు బ్రాహ్మణ స్త్రీనిఁ గామించి బంధురాష్ట్ర హితుఁడయి నశించెననియు, వైదేహుఁడైన కరాళుఁడుగూడ నిట్లే నశించెననియు, బ్రాహ్మణులపయి నలిగి జనమేజయుఁడును, భృగులపయిఁ గోపించి తాళజంఘుఁడును, లోభమున సౌవీర రాష్ట్రాధిపతి యగు అజబిందును, ఐలయుఁ, బరదారను విడచుట కిచ్చగింపని దురభిమానముచేత రావణుఁడును, భాగమీయక దురభిమానము గలిగియున్న దుర్యోధనుఁడును, ప్రజల నవమానించెడి మదమున దంభోద్భవుఁడును, హైహయుఁడైన యర్జునుఁడును, అగస్త్యునిఁ జంపు సంతోషమున వాతాపియు, ద్వైపాయనునిఁ జంపు యత్నమున వృష్ణి సంఘమును, నీవిధముగనే నశించెననియు, నర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౧, అధ్యా

యము ౬.) ధర్మార్థములకు వైరుధ్యము లేకుండఁ గామమును సేవింపవలయును. బ్రభు వెన్నఁడును సౌఖ్యము లేకుండ బ్రదుకరాదు. ధర్మము కన్నను, గామము కన్నను అర్థము ప్రధానమని కౌటిల్యుని యభిప్రాయము. ప్రభుత్వ నిర్వహణమునకుఁ బహుల తోడ్పాటు అవసరము. ఒంటి చక్రి మెప్పుడును నడువదు. కావున రాజు మంత్రుల నేర్పఱచి వారి యభిప్రాయముల మన్నించుచుండవలయును. అమాత్యులలో నొక్కనికి అంతఃపుర పరిచారిక యొకర్తుక పరివ్రాజక వేషమును ధరియించి 'పట్టమహిషి నిన్నుఁ గామించి శయ్య నేర్పఱచినది. అందువలన నధికముగ ద్రవ్యము చేకూఱఁగలదు.' అని బోధించునట్లుఁ జేయవలయుననియు, ఆంతరంగిక సభ చేసి మంత్రుల నందఱను బంధించి వారిలో నొకనిచే ఇతఁడు మంచి నడవడి గలవాఁడు కాఁడు. ఇతని వధించి వేఱొకని రాజుగా నియమించుట శ్రేయము. ఇందు కేమనెదవు' అని ప్రబోధింపఁ జేయవలెననియు, నిట్టి వక్రమార్గములకు లొంగని వారిని మంత్రి పదవులయందునిచి రాజు పని చేయవలెనని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౧, అధ్యాయము ౭.) రాజ్యాభివృద్ధి కయి యెల్లప్పుడును సామమును, దండమును నుపయోగములని విద్వాంసులు స్తుతింతురు. రాజు నిత్యమును బదునెనిమిది తీర్థములందు వేవేఱుగ విచారింపవలయును. రాజుయొక్క వృత్తమును బట్టి యుగములుగ నెన్నఁబడును. మంచి వృత్తమయిన మంచి యుగమును, చెడు వృత్తమయిన చెడు యుగమును నగును. అజ్ఞానాలస్యాది దోషములవలన నిష్ప్రవృత్తుఁడైన రాజు కలియుగము. యథాశాస్త్రముగఁ జేయువాఁడు కృత యుగమనియుఁ, దనకు నిర్ణయమైన కర్మలలో నిమగ్నుఁడయిన వాఁడు త్రేతాయుగమనియుఁ, దెలిసినవాఁడయ్యును బ్రవర్తింపని యతఁడు ద్వాపరమనియు, మనుస్మృతియందు వివరింపఁబడినది.

దత్తాత్రేయ మహర్షి నుపాసించి కార్తవీర్యార్జునుఁడు వరములఁ బడసి రాజ్యమును బాగుగ నేలెను. ఇతని రాజ్యమున ద్రవ్యాపహరణము జరుగలేదు. కావున నితఁ డెనుబదియైదువేల సంవత్సరములు రాజ్యమేలెను. రాజు అధర్మ రతుఁడయిన నతనిఁ దొలఁగించి వేఱొకని నియమించు వాడుక గలదు. మృత్యువను వాని జ్యేష్ఠపుత్రిక 'సునీథ' యను నామెకు వేనుఁడు జన్మించెను. మాతామహుని తప్పిదమువలన దుష్టుఁడయి హోమములు, దానములు,—మొదలగునవి తన్ను గూర్చి చేయవలెననియుఁ, దానే యజ్ఞకర్తననియుఁ, జాటింపఁగా ఋషిసత్తము లెల్లరు గుమిగూడి యితని యొద్దకుఁ బోయి 'యజ్ఞమువలన యజ్ఞపురుషుఁడగు విష్ణుదేవుఁడు సంప్రీతుఁడయి రాజ్యమును సుఖపెట్టును. హరిని మాత్రము మేమారాధింతుము.' అని చెప్పఁగా 'నాకన్న నధికుఁడును, బూజ్యుఁడును లేఁడు. నా యాజ్ఞాపాలనమే మీకును సంభావ్యము!' అని పలికెను. ఋషులెంత చెప్పినను విననందున మంత్రపూతములయిన దర్భలచే వానిం జంపిరి. వేనుఁడు చంపఁబడినందున రాజ్య మరాజకమై యుండుటఁ జూచి మహర్షులు వేనునితొడ నొకదాని మథింప నందుండి పురుషుఁడు జన్మించెననియు, నతని



కనేకులు జన్మించి వింధ్యపర్వత ప్రాంతములందుండిరనియు నితనికి 'నిషాదుఁ'డని పేరనియు, వీరి మూలమున వేనుని పాపము అతని దేహమునుండి నిర్గతమయ్యెననియు, మహర్షులప్పుడు వేనుని కుడిహస్తమును మథింపఁగాఁ 'బృథుఁ'డను నతఁడుద్భవించెననియు, నీతని రాజ్యమున నభిషేకింపఁగాఁ బ్రజాను రంజనముగ బాలన మొనర్చి 'రాజరా' జనిపించికొని ప్రజాస్వామ్యము నిర్వహించినాఁడనియు, విష్ణు పురాణమునఁ జెప్పబడినది. (ప్రథ; ౧౩, అధ్యాయము; ౧౧, ౪౯ శ్లో.) 'వయం పాండవ జ్యేష్ఠం అభిశింకామ' అని మహాభారతములోని యాదిపర్వమునఁ జెప్పఁబడినది. (శ్లో. ౨౭.) ధృతరాష్ట్రునితో దుర్యోధనుఁడు 'భీష్ముని మిమ్ములను విడచి యుధిష్ఠిరుని దమ ప్రభువుగ నుండవలయునని ప్రజలు గోరుచున్నా' రని చెప్పినట్లుల నాదిపర్వమునఁ జెప్పఁబడినది. (శ్లో. ౩౨.) అశోక చక్రవర్తి బిందుసారుని జ్యేష్ఠకుమారుఁడు గాఁడని మహావంశమను గ్రంథమువలనఁ దెలియుచున్నది. అయితే శౌర్యధైర్య గాంభీర్యముల వలనను, తేజస్సువలనను, సామర్థ్యమును శక్తియుఁ గలిగి తక్కిన యన్నదమ్ములకన్న మిన్నగ నుండుటవలన నితఁడే సింహాసనమున కర్హుడైనాఁడు. (మహావంశము, అధ్యాయము ౫.) సముద్రగుప్తుఁడు తన శౌర్యమును బట్టియుఁ, బరిపాలనాసామర్థ్యమును బట్టియుఁ, దన తండ్రియగు చంద్రగుప్తునిచే నియమింపఁబడి సింహాసనాసీనుఁ డయ్యెను. (గుప్త శాసనములు). చర్మవ్యాధివలన సింహాసనాసీనుఁడగుటకు అర్హత లేదని 'దేవాపి' యనువానిఁ దొలఁగించి శంతనుని రాజుగ నేర్పఱచిరి. ఆపద్ధర్మములలోఁ దక్క నితరములలో జ్యేష్ఠకుమారునకే రాజ్యాధికారముండునని యర్థశాస్త్రమునను, బృహద్దేవత, ౮, ౧. యందును, మహాభారతములోను జెప్పఁబడినది. కొన్ని సమయములందు మంత్రులే ఈ పని జేయుచుండిరని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౫, అధ్యాయము ౬.) పుండ్రమహీపతిచే రాజ్యవర్ధనుఁడు దుర్మార్గముగను మోసముగను జంపఁబడిన పిదప నతని ప్రధానామాత్యుఁడయిన 'భండి' యను నతఁడు మంత్రివర్గమువారి యనుమతిని ప్రజా సమ్మతిని బొంది హర్షవర్ధనుని సింహాసనాసీను నొనర్చెను. వివాదాంశముల నిర్ణయ మొనర్చుటకెప్పుడేని పశుబలము మధ్యవర్తిగ నుండెడిది. రాజ్య విభాగమున బలము నుపయోగపడెడిది. కాని శుక్రాచార్యులు 'రాజ్య విభజనవలన మంచి చేకూఱదు. విభజనవలన రాజ్యములు చిన్నవియగుటయు, శాత్రవులు పయిఁబడి కొల్లఁగొట్టుటయు, సంభవించు' నని చెప్పుచున్నాఁడు. (అధ్యాయము ౧, శ్లో. ౩౮౬.) ఈ విషయము కౌరవులకును బాండవులకును జరిగిన యుద్ధమువలన ధ్రువపడుచున్నది. థానూరు కుటుంబముతో సమకాలికముగా విష్ణుని కుటుంబము ఏలినట్లుఁ దెలియుచున్నది. కాశ్మీరమునకు 'జద్దా' యను నామెయు, సింహళమునకు లీలావతియుఁ బ్రభ్వీణులయి యేలిరని రాజతరంగిణియందుఁ జెప్పఁబడినది. (పుస్తకము ౬.) కాశ్మీరమునకు 'సుగంధా' యను నామె యేలికగ నున్నట్లుఁ దెలియుచున్నది. వీరు మాత్రము మార్యావర్తమున నుండిన యేలికలు. మహావంశమున సింహళమునకు 'అనులా, శివలి, కల్యాణవతి,' అను మువ్వురు రాజు

యుండినటులఁ జెప్పఁబడినది. కాశ్మీరదేశ ప్రభువు ‘అనంతుఁ’ డను వాఁడు ప్రభువుగ నుండినప్పుడే యతని భార్య ‘సూర్యమతి’ సమ్మార్గముతో రాజ్యమేలినట్లు దెలియుచున్నది. మెగస్తనీసను యవనరాయబారి ‘పాండ్యులు ఆఁడువాండ్రచేఁ బాలింపఁబడిన జాతి’ యని చెప్పుచున్నాఁడు. సామాన్యముగ రాజులెల్లయు క్షత్రియ వంశ్యులే యని తెలియవలయును. నందవంశస్థాపకుఁడైన ‘మహాపద్మనందుఁడు’ శూద్రస్త్రీకిని శిశునాగునకును జన్మించినవాఁడు. చంద్రగుప్తుఁడు కూడ ఆ వంశము శూద్రస్త్రీమూలమున మగధరాజకుటుంబమునుండి యేర్పడినదని గోదించెను. శుంగ, కణ్వ రాజులు ప్రాయశః బ్రాహ్మణులు. చాణక్యుఁడు ఎల్లప్పుడును జంద్రగుప్తుని ‘వృషల’ యని సంబోధించుననియు, ‘వృషల’ యనఁగా శూద్రుఁడనియు, నంద రాజులు ప్రధానామాత్యుఁడయిన ‘రాక్షసుఁడు’ ‘రక్తనాళములందుఁ జిక్కని రక్తము స్రవించుచున్న ముఖ్యుఁడు లేఁడా యని నీ సామ్రాజ్యాధికారమును నిర్వహింపఁగల స్థిరచిత్తుఁడు లేఁడా?’ యని రాజ్యోపాస్యదేవతను బ్రశ్నించినటులను, ముద్రారాక్షసములోని రెండవ యంకమున వ్రాయఁబడి యున్నది. గాంధార రాజులు షాహియాను వచ్చి చూచునప్పటికి బ్రాహ్మణ వంశ్యులైయుండిరి. మతిపురపురాజు (King of Matipura) శూద్రుఁడని హుయానుత్సాంగు చెప్పుచున్నాఁడు. మగధదేశ గుప్తరాజులు వైశ్య జాతివారని డాక్టరు ఫ్లీటుగారు సూచించుచున్నారు. కాని యతని వాదన సరియైన స్థితిలో లేదు. (గుప్త శాసనములు.) శతపథ బ్రాహ్మణమునఁ బ్రాహ్మణునకు దొరతనము తగదని చెప్పబడినది. మహాభారతమున ‘రాజు ఎల్లప్పుడును క్షత్రియుఁడనియే’ వర్ణింపఁబడినది. కాని బ్రాహ్మణుఁడైన ద్రోణుఁడు రాజుగా నుండెనని తెలిసికొనుచున్నాము. పారంపర్య దొరతనము ఏర్పడిన పిదప సంస్థయొక్క దైవిక స్థాపన వృద్ధి యయ్యెను. ఇటీవలి వైదికవాఙ్మయమున నీ యభిప్రాయము సూచింపఁబడినది. తరువాత సంహితలలోను, స్మృతులలోను, పురాణములలోను విస్తృతము కాఁబడినది. అథర్వవేదమునందును, కొన్ని బ్రాహ్మణములలోను, నీ యభిప్రాయ బీజము లుదాహృతము లయినవి. అది త్వరితముగ రాజకీయ సూత్రవైఖరికి మాఱినది. రాజు దేవత కాదనియు, నరదేవత యనియుఁ, దెలియుఁడు. సాత్త్విక, రాజసిక, తామసిక అని రాజులు ముత్తెఱంగులనియుఁ, దనధర్మముల గుర్తెఱిఁగి, తనను సంబంధించిన విషయములఁ గాపాడుచు, యజ్ఞములఁ జేయించుచుఁ, దన శత్రువులకు వ్యతిరేకముగఁ దన సైన్యమును నడిపించుచు, ధైర్య స్థైర్యములు గలిగి, ప్రపంచ వ్యవహారములతో సంబంధము లేక, దాతృత్వము గలిగియుండు రాజు సాత్త్వికుఁడనియుఁ, గారుణ్యమును, జాలియు లేక అహంకారము, అసూయ, అనృతము గలిగి యుండు రాజు తామసికుఁడనియు, నితఁడు నరకము చెందుననియుఁ, దిండిపోతును, గర్వియు, శాస్త్రాదర్శముల నిరోధించువాఁడును, మాటలకును అభిప్రాయములకును వ్యతిరేక కార్యములఁ జేయువాఁడును, జగడమాడువాఁడును,



నీచులతోను, మోసగాండ్రతోను, దంత్రజ్ఞులతోను, బరిచయము గలవాఁడును, నమ్మక ద్రోహియు నగు రాజు రాజసుఁడనియు, నట్టివాఁడు మరణానంతరము నీచ జన్మ మెత్తుననియు, శుక్రనీతియందు వ్రాయఁబడినవి. (అధ్యాయము ౧, శ్లో. 30-3౮.) దైవిక హక్కునకును, హిందూ రాజస్వత్వమునకును, జాల భేదమున్నది. భారతదేశమున దొరతన మొక కార్యాలయముగ నుండెను, గాని అదృష్టవ్యక్తి యొక్క అధికారమండలముగ మాత్రము లేదు. రాజు జాతియొక్క ముఖ్యవ్యక్తిగ నుండెను గాని పరిపాలనాంతము వఱకు రాజ్య క్షేమమందుగ నుండలేదు. రాజ్యము ప్రజా శ్రేయమునకు దోహద మొనర్చుచుండెను. ఆ కారణమున రాజ్యమునకు ముఖ్యాధికారిగఁ బరిగణింపఁ బడుచుండెను. ఎచ్చట పౌరజన రక్షణమును, రాజ్యాభివృద్ధియు నుండునో అచ్చట రాజు సక్రమముగఁ బాలించుచుండెననియుఁ, బై [illegible] సూత్రము [illegible] హించుటయే రాజుయొక్క ధర్మమనియు, మహాభారతము [illegible] శాంతిపర్వమునఁ జెప్పబడినది. ఋగ్వేదమున రాజు ప్రజా సంరక్షకుఁడుగ నభివర్ణితుఁడయ్యెను. ఇందుకు ప్రతిఫలముగ రాజు ప్రజల విధేయతయు, రాజ్య నిర్వహణమునకయి యిచ్చు విరాళములను బుచ్చుకొనుచుండెను. ‘రాజాజ్ఞ యెవరివలనను తిరస్కరింపఁ బడదే’ దని నీతివాక్యామృతము చెప్పుచున్నది. (అధ్యాయము ౧౭.) ప్రాచీన భారత వర్షమున ‘రాజు రాజ్యమునకు సేవకుఁడ’ ని రాజకీయాభిప్రాయము ముఖ్య సూత్రముగఁ బరిగణింపఁ బడెను. బోధాయనుఁడు ‘ప్రజలయొద్దనుండి పంటలో నాఱవభాగమును పుచ్చుకొను సుంకము వారిని రక్షించు నిమిత్తము వేతనమువలె రాజు తీసికొనవలయు’ నని చెప్పుచున్నాఁడు. (బోధాయనుని ధర్మసూత్రములు, ౧, ౧౦-౧.) చాణక్యుఁడు కూడ ‘ప్రజలవలనఁ బ్రతిఫలమును బొంది ప్రభువులు రాజ్యాభివృద్ధికయి సూత్రముల నన్వేషించి పని చేయవలయు’ నని చెప్పుచున్నాఁడు. (అర్థశాస్త్రము, పుస్తకము ౨.) ‘షడ్భాగ భృతో రాజా రక్షతు ప్రజామ్.’ అని సూత్రము గలదు. ‘ప్రజలకు సేవఁ జేయుటకుఁ గాను బ్రహ్మ రాజును సృష్టించెననియు, ఆ రాజు పంటలో నొక భాగము ప్రతిఫలముగఁ బొందుచుండెననియు,’ శుక్రనీతి తెలుపుచున్నది. ఎప్పుడు రాజు తన కార్యాలయ విధులను మఱచి, సంఘలాభములను నష్టపఱచి పనిచేయునో, అప్పుడు ప్రజలు తమ వాగ్దానములనుండి విముక్తిఁ జెందవచ్చును. ‘ఏ రాజు ప్రజారక్షణ కుపయోగింపఁడో, అతఁడు నిష్ప్రయోజకుఁడనియు, రాజు తన ధర్మములఁ జేయుటలోఁ గుంటుపడిన ఏ కులమునకుఁ జెందిన వ్యక్తి యైనను ప్రభుత్వము యొక్క రాజదండమును ద్రిప్పవచ్చుననియు,’ మహాభారతమునఁ జెప్పఁబడినది. (శాంతి పర్వము, శ్లో. 3౬.) ‘నీతియందును, దాక్షిణ్యమునందును, అధికారమునందును, అధర్మ ప్రవర్తనము గలిగి యుండిన అట్టి రాజును రాజ్యనాశకుఁడుగ నెంచి తొలఁగింపవలయుననియుఁ, బ్రజాంగీకారముఁ బడసి యుత్తమాచార్యుఁడగు పురోహితుని రాజకుటుంబములోని సభ్యునివలె నతని స్థానమున నుంపవలెననియు, సామాన్యముగఁ బురోహితుఁడు దయార్ద్ర హృదయుఁడయి నీతిమంతుఁడయి యుండును గనుక తగినవాఁడనియు,’ శుక్రనీతి

సలహా నిచ్చుచున్నది. (శుక్రనీతి, అధ్యాయము ౨, శ్లో. ౭౩౪-౭౩౫.) రాజు యొక్క అధికారములు మిగుల సంకుచితములు. స్వతంత్ర ప్రభువుయొక్క అభిప్రాయము భారతీయ హృదయమునకుఁ జాలినంత అనుకూలముగ లేదు. రాజెప్పుడును ధర్మశాస్త్రమునకు మించిన వ్యక్తి కాఁడు. నీతిశాస్త్రములో ‘రాజు నీతిశాస్త్రను సరణముగ వర్తింపవలయుననియుఁ, దన దేశమున కవతలి దేశమునకు సంబంధించి రాజు తనకు విరోధియనియు, ఆ విరోధి కవతలి దేశమువాఁడు అనఁగా నేకాంతరితుఁడు తనకు మిత్రుఁడగుననియుఁ, జెప్పఁబడినది. కాని యేదేని కారణమును బురస్కరించికొని విరోధులు స్నేహితులగుటయు, స్నేహితులు విరోధులగుటయు జరుగుచుండును. ‘బలవంతునితో దుర్బలుఁడు సంధి కంగీకరింపవలయును. ఇట్టు లంగీకరించుటకుఁ గల కారణము తేజము. ఈ తేజమే ప్రపంచమున సంధాన కారణ మగుచున్నది. బలముగలవాఁడు లేనివానితో డీకొనవలయునే గాని, యధిక బలవంతునితోఁ గాని, సమునితోఁ గాని డీకొనరాదు. తనకంటె నధికునితోఁ బోరు సల్పుట గజపాదయుద్ధమును బోలును.’ అని చాణక్య సూత్రములలోఁ గలదు. (౪౯-౫౯.) రాజు ఎంత దౌర్బల్యుఁడైనను బరిభవింప నర్హుఁడు గాఁడు. దండమునందు వృత్తి ప్రాదుర్భవించును, వృత్తి మూలమున నర్థమును, నర్థము ద్వారమున ధర్మ కామములును బ్రాపించును. గావునఁ బ్రతి కార్యమును అర్థమూలమనియే యెఱుంగునది. దీని మూలమునఁ గొంచెము యత్నించిన గార్యసిద్ధి యగును. గార్యార్థులకు ఉపాయ మవశ్యము. దైవానుకూలము లేనిది ప్రయత్న మెంతయైనను వృథయే. వ్యవస్థయు నేర్పాటును లేనివానికి వృత్తి నిలువదు. కాఁబట్టి మున్ముందు సాధకబాధకములఁ బర్యాలోచించి నిర్ణయించుకొని పిదపఁ గార్యమారంభింపఁదగును. ప్రారంభించిన తర్వాత అలసత్వము కూడదు. కాలమును గుర్తెఱిఁగి కార్యమును బ్రారంభింపవలయును. దండనీతి నధిష్ఠించువాఁడు ప్రజలను బరిరక్షింపఁగలఁడు. దండనీతి రాజులకు ముఖ్యము.’ అని చాణక్య సూత్రములలోఁ జెప్పఁబడినది. ఐతరేయ బ్రాహ్మణమున రాజునకీ క్రింది ప్రమాణము నిర్ణయించుచున్నది. ‘నా జీవితమున నేమంచి కార్య మొనర్చినను మరణాంతమున నా స్థితియు, నా జీవితమును, నా సంతతియు, మిమ్ము బాధించినట్లయిన నా నుండి తీసికొను’ నని చెప్పఁబడినది. (ఐతరేయ బ్రాహ్మణము, ౮, ౪, ౧, ౧౩.) మహాభారతమున రాజున కిట్లుపదేశింపఁబడినది. ‘మనూవాక్యాయములందుఁ బ్రమాణము తీసికొని నామకః’ నే నెల్లప్పుడును దేశశ్రేయము నుపలక్షించుచు ధర్మశాస్త్రము, నీతిశాస్త్రము, రాజకీయశాస్త్రము, ఏ న్యాయములను సూచించునో వానికి బద్ధుఁడనై యున్నఁడును స్వతంత్రిత విహింపక నుండు’ నని ప్రమాణ మొనర్చినఁ జాలు’ నని శాంతి పర్వమునఁ జెప్పఁబడినది. ‘మంత్రివర్గ్యులకు వ్యతిరేకముగఁ గాని, లేక వారు లేకుండఁ గాని, కార్యములఁ జేయఁగడంగిన యతఁడు రాజు కాఁ’ డని సోమదేవసూరి నీతివాక్యామృతము చెప్పుచున్నది. (అధ్యాయము ౧౦.) ‘నఖల్వసౌ రాజాయో మంత్రిణో౽తిక్రమ్య వర్తతే’ యని సూత్రము. శుక్రనీతి ‘మంత్రుల సలహాను బుచ్చు



కొనక త్రోసిరాజనినవాఁడు ప్రభువు కాఁడనియు, దొంగయనియు, నతనిఁ బ్రజల యైశ్వర్యమున కొక అపహారకుఁడనియు, స్వతంత్రించి రాజు వర్తించినఁ దన యంతటఁ దాను ముప్పుఁ దెచ్చికొనుననియు, నట్లుఁ గాక శాస్త్రవిధి ననుసరించి యాత్మరక్షణఁ గావించికొనిన ఈ లోకమునందును, బరలోకమునందును సుఖముగ నుండుననియుఁ,’ జెప్పుచున్నది. రామాయణము నందలి సుందరాకాండ యందుఁ ‘బోరు సల్పుట రాజుకు విధ్యుక్త ధర్మము. విజయమునకుఁ బ్రయత్నింపవలయు’ నని చెప్పఁబడినది. యుద్ధము క్షత్రియ ధర్మము. కాని పరుగువారుట అధర్మము. ఆత్మార్థమును దేశార్థమును ‘ఆత్మానం సతతం రక్షేత్ దారైరపి ధనైరపి’ అనునట్లు యుద్ధమునుండి వెనుదివియవచ్చును, సేనానాయకుఁడు లేనిచో సైన్యము శ్రేణీభంగమగుననియు, నా కారణమున సైన్యాధిపతి దారాపుత్రుల విడనాడియైనను జీవిత భూరుహము కూలకుండఁ జూచుకొనుట తప్పిదము కానేరదనియు, నిదియే హైందవ విధాయకమనియు, బలహీనుఁడగు కాపురుషుఁడు దేశమును శాసింపఁజాలఁడనియుఁ దెలియవలయును. ఒక జర్మనీదేశ సైన్యాధిపతి చెప్పినట్లు ‘జీవింపవలయునన్న రణ మగత్య’ మనియు, ‘విషస్య విషమౌషధం’ అను సూత్రము చికిత్సా శాస్త్రమున కెట్లు లుపాదేయమో అట్లే జాతీయ విజ్ఞానమునకు సంగ్రామ ముపాదేయమనియు, ‘సంగ్రామేష్వనివర్తిత్వం ప్రజానాంచైవ పాలనమ్, శుశ్రూషా బ్రాహ్మణానాంచ రాజ్ఞాం శ్రేయస్కరం పరమ్’ అని మనువు చెప్పినట్లు రాజున కెప్పుడును సంగ్రామ యజ్ఞ మొనర్చుట ధర్మమనియు, విరక్తి కలుగఁగూడదనియుఁ దెలియవలయును. స్వర్గాపేక్షయే యజ్ఞనిర్వహణమునకుఁ గారణమనియు, సంగ్రామమున మడసిన వారు స్వర్గమున కరుగుదురు గావున లక్షణములు వేఱయినను లక్ష్యమొక్కటియే యనియు నెఱుంగునది. ‘మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా, నిరాశీ నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః’ అని శ్రీకృష్ణ భగవానుల నిర్వచనము. సర్వము నా కర్పించి విచారము, అపేక్ష, మమతలు లేకుండ రణమొనర్పుము అని భగవానులు సెలవిచ్చిరి గనుక కర్తవ్యము తెలియవలయును. ఆపస్తంబుఁడు చెప్పినట్లు రణరంగమున యజ్ఞము లుప్తమయియున్నది. ‘ఈ యజ్ఞమున దేహమూపస్థానమును, హృదయము పశుస్థానమును, అందు లభ్యమగు ద్రవ్యము ఋత్విక్కుల కిచ్చు దక్షిణలును,’ అని యాపస్తంబుఁడు చెప్పినాఁడు. ‘ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదకౌ, పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖే హతః’ అనినట్లు యోగాభ్యాస మొనర్చుచున్న సన్న్యాసియు, రణమున నిహతుఁ డయిన శూరుఁడును, భానుమండలము భేదించుకొని పోవుదురు.

ప్రతి ప్రాతఃకాలమునను శాసన సభాశాలను మరమ్మతు చేయించుటయును ప్రజల కష్ట సుఖములను విచారించుటయును రాజునకు విధియై యుండెను. అజంతా చిత్రములలో రాజు సింహాసన మధిష్ఠించి యుండఁగా నతని ప్రధానామాత్యుఁడు ఎట్టెదుట చిన్ని ముక్కాలిపీఁట పయి నధివసించి యుండినట్లును, రాజు వెనుక స్త్రీ

పరిచారికలున్నట్టును, ప్రజాసమూహ మొకరిపయి నొకరికిఁ గొండెములఁ జెప్పి దోష వివాదాంశములఁ బరిష్కరింపుఁడని రాజును వేఁడుచున్నట్టును, జిత్రింపఁబడినవి. ‘రాజులు స్త్రీ సేవకులవలనఁ బరిరక్షింపఁబడుచు’ న్నటుల ముద్రా రాక్షసమున నభివర్ణింపఁబడినవి. మంచివాఁడును, వివేకవంతుఁడును నగు రాజు నిర్ణయమైన కాలనిర్ణయ పత్త్రిక ననుసరించి దైనికచర్య జగుపుచుండవలయును. చాణక్యుఁడు దివారాత్రములను విభజించి యొక్కొకటి యెనిది భాగములుగ నిర్ణయించెను. (అర్థశాస్త్రము పుస్తకము ౧, అధ్యాయము ౧౯.) శుక్రనీతి యందు దివారాత్రములు ఇరువది నాలుగు గంటల కాలము ముప్పది ముహూర్తముల క్రింద విభజింపఁ బడినది. ఆదాయ వ్యయముల ఆలోచనకు రెండు ముహూర్తములును, స్నానమున కొక ముహూర్తమును, మత విషయములకు రెండు ముహూర్తములును, వ్యాయామ బల ప్రదర్శనమున కొక ముహూర్తమును, బహుమతుల బంచిపెట్టుటకు ఒక ముహూర్తమును, ప్రభుత్వోద్యోగుల నుండి లెక్కలఁ బుచ్చుకొనుటకు నాల్గు ముహూర్తములును, భోజనమున కొక ముహూర్తమును, గ్రొత్త ప్రాత పరిస్థితుల కొక ముహూర్తమును, న్యాయాధిపతులతో సంప్రదించుట కొక ముహూర్తమును, మృగయా వినోదమునకు రెండు ముహూర్తములును, సైనికుల కవాతు కొక ముహూర్తమును, మతవిషయిక ఆలోచనలకు ఒక ముహూర్తమును, సాయంకాల భోజనమున కొక ముహూర్తమును, వేగులవారితోఁ బనికి ఒక ముహూర్తమును, నిద్రకు ౮ ముహూర్తములును,—అని దైనికచర్య విభాగింపఁబడినది. ‘అవసర కార్యము లన్నిఁటిని వెంటనే పరిశీలింపవలయును. వాయిదాలు వేయఁగూడదు.’ అనియు శాస్త్రమునఁ జెప్పఁబడినది. (పుస్తకము ౧, అధ్యాయము ౧౯.) హర్షవర్ధనుఁడు దినమును మూఁడు భాగములుగ విభజించి మొదటి భాగమునఁ బ్రభుత్వ కార్యములందు నిమగ్నుఁడగుటయు, రెండవ భాగమున అడ్డు లేకుండ మత విషయములలో నభ్యసించుటయుఁ, జేయుచుండె’ నని హుయానుత్సాంగు చెప్పుచున్నాఁడు. (బౌద్ధ వ్రాఁతలు, బీల్ వ్రాసినది, పుస్తకము ౪, పుట ౨౧౬.) రాజకీయ తత్త్వజ్ఞుఁడగు ప్లేటో ‘వేదాంతులు రాజులనియు, ఈ లోకములోని రాజులును, యువరాజులును,—వేదాంత శక్తియు, నుత్సాహమును, రాజకీయ గొప్పఁదనమును, బరిజ్ఞానమును గలిగి యుండిరనియుఁ’ జెప్పినాఁడు. (ప్లేటో విరచిత ‘రిపబ్లిక్’ గ్రంథము, ౫.) కాళిదాస మహాకవి దిలీపుఁడు గొప్ప వివేకముగల రాజనియు, నెల్లప్పుడును ప్రజాసౌఖ్యమును దన సౌఖ్యముగఁ బరిగణించుననియుఁ’ జెప్పినాఁడు. (రఘువంశము.) అశోకుఁడు సింహాసనముపయి నొక సన్న్యాసివలె నుండెను. దైవభక్తి సూత్రమున రక్షణము చేయవలెనను ప్రభుత్వాదర్శమును గలిగి ఆ సూత్రము వలన నానందమును, జట్టమును గలిగి వర్తించుచున్న అశోకుని శ్లాఘింపవచ్చును. ‘కామందకీయము గ్రంథమున ‘రాజు ప్రతి విషయమునను రాజ్య శ్రేయస్సు నిమిత్తము శక్తి వంచన లేకుండఁ బ్రయత్నింపవలయు’ నని చెప్పబడినది. (అధ్యాయము ౬. శ్లో. ౩.)



మహాభారతములోని శాంతిపర్వమునందును ఇట్లే చెప్పఁబడినది. అశోకునివలెనే హర్షుఁడును రాజకీయ సన్న్యాసి. హర్షుఁడు స్వయముగఁ దన విస్తార సామ్రాజ్యమునందలి వ్యవహారములన్నియుఁ బరిశీలించుచుండెను. ‘కార్యనిర్వహణ మవసరమైన యెడల హర్షుఁడు వెడలిపోఁగల చారుల నియమించుననియు, నగరములందలి ప్రజల నడవడులలో వక్రత యుండెనేని హర్షుఁడు వారి యొద్దకుఁ బోవుననియు, అతఁ డెచ్చటికిఁ బోయినను దా నుండు కొద్ది కాలము సుఖముగ వసించుటకయి గృహమును గట్టించుననియు, వర్షాకాలమున నతఁ డెచ్చటికిని బ్రయాణము సేయఁడనియు,’ హుయానుత్సాంగు చెప్పుచున్నాఁడు. (బౌద్ధ వ్రాఁతలు, పుస్తకము ౪.) హుయానుత్సాంగు ‘కామరూప’ మును సందర్శింపఁ జనుదెంచినప్పుడు శ్రీహర్షుఁడు దేశములోని వివిధ భాగములను బలకించుచుండుటను జూచినాఁడు. ‘నిశ్శంక మల్ల’ యను రాజు తన రాజ్యములోని వేగులవారి మాటల విశ్వసించియే గాక తాను స్వయముగ సింహళము యొక్క మూఁడు రాజ్యములను బరిశీలించుటకయి వెళ్ళి గ్రామములు, పట్టణములు, నగరములు, రాజనగరులు,—మొదలగునవి నీరు, గుట్టలు, అడవులు, బురద నేలలు,—మొదలగు దుర్ఘట మార్గములలోఁ బ్రయాణ మొనర్చి సందర్శించె’ నని సింహళ శాసనములలో నొకదానివలనఁ దెలియుచున్నది. (Epigraphia Zeylanica, Vol. II, No. 1713.) ‘హర్షుని గుణములును న్యాయపరిజ్ఞానమును స్వర్గమర్త్యములఁ జలింపఁజేసి దేవమానవు లందఱిచే శ్లాఘింపఁబడియుండెను. అతని ప్రజలు అతని సుగుణ సంపత్తిని భక్తి ప్రపత్తితోఁ బూజించుచుండిరి. అతని కీర్తి పరిసరములందంతట వ్యాపించెను. అతఁడు దేశాభిమానమును నీతియుఁ గలవాఁడగుటవలనఁ బ్రజలెల్లరును అతని విరాళములను పాటల మూలమునను, గీర్తనల మూలమునను గీర్తించుచుందురు.’ అని హుయానుత్సాంగు వ్రాయుచున్నాఁడు. (హుయానుత్సాంగు జీవితము, పుట ౨౬౩.) బాణుఁడు హర్షుని గూర్చి చక్కఁగా హర్ష చరిత్రమున రెండవ యధ్యాయమున వివరించినాఁడు. రాజు నగర సంకీర్తనమునకుఁ బోవలసినప్పు డొక యేనుఁగును ఆరోహింపవలయునను సూత్రమున్నది. అజంత గుహలలోఁ జిత్రింపఁబడిన చిత్రలేఖనములలో నొకదాని యందు ‘రాజ పరివారము’ చిత్రింపఁబడినది. ఇచ్చట రాజు యేనుఁగుపయిఁ బోవుచుఁ, దన శిరముపయిఁ బ్రభుత్వ ఛత్రమును, హస్తమున అంకుశమును గలిగి యున్నటుల వర్ణింపఁ బడినది. (Burgess, Buddhist Cave Temples.)

పూర్వకాలమున రాజు స్థితి సులువుగ లేదు. సంస్కృత నాటక మగు ముద్రారాక్షసమున ‘రాజ్యం హి నామ రాజధర్మాన్నవృత్తి పరతంత్రస్య భూమిపతేర్మహదప్రీతి స్థానమ్’ అని వ్రాయఁబడినది. (మూఁడవ యంకము.) మనువు ‘విషమునకు విరుగుడు లయిన ఔషధములతో రాజు ఆహారము మేళవింపఁబడి యెల్లప్పుడును విషహారమైన రత్నమును జాగ్రత్తగ ధరించుచుండవలయు’ నని చెప్పుచున్నాఁడు. (మనుధర్మ

శాస్త్రము, ౭, ౫౧౭.) హుయాన్త్సాంగు 'ప్రయాగలో జరిగిన గొప్ప మత విషయిక పండుగ యనంతరము శ్రీహర్షుని జీవిత సౌఖ్యమును' వర్ణించినాఁడు. (బౌద్ధ భారతము,) పూర్వపుఁ బ్రభువులు తమ సామ్రాజ్య విస్తీర్ణమును బట్టియుఁ, గీర్తిని బట్టియు, వివిధములగు బిరుదములతో శోభిల్లుచుండిరి. 'ఏ ప్రభువు లక్ష గద్యాణంబుల (వెండి కర్షములు) మించి మూఁడు లక్షల గద్యాణంబుల వఱకు సుంకముల గ్రహించుచుఁ దన ప్రజల బాధింపకుండ నుండునో, యతఁడు సామంతుఁడనియు, పది లక్షల గద్యాణంబులఁ బసవనముం గొనువాఁడు మాండలికుఁడనియు, నిరువది లక్షల గద్యాణంబులఁ బన్ను గ్రహించువాఁడు రాజనియు, నేబది లక్షల గద్యాణంబులఁ గొనువాఁడు మహారాజనియుఁ, గోటి గద్యాణంబులఁ దీసికొనువాఁడు స్వరాట్టనియు, నేబదికోట్ల గద్యాణంబులఁ బుచ్చుకొనువాఁడు సమ్రాట్టనియు, సర్వసర్వంసహా భూమి నేలువాఁడు సార్వభౌముఁడనియుఁ బేరు. కొన్ని శాసనములలో నితనికి 'మహామండలేశ్వర' యనియు, 'మహాసమ్మత' యనియుఁ బేరుఁ గలదు. యువరాజును జేయు విధానము గమనింపఁ దగినది. దశరథ మహారాజు శ్రీరాముని యౌవరాజ్యాభిషిక్తు నొనర్పఁ బ్రయత్నించినటుల రామాయణమునఁ గలదు. యుధిష్ఠిరుని యువరాజు జేసినట్లు మహాభారతము నందును గలదు. అప్రాప్త వ్యవహార దశ వదలి యౌవరాజ్యమున కర్హుఁడయి యున్నవానికీ యభిషేక ముండెడిది. తాను రాజ్యమునకు వచ్చినప్పుడు సక్రమముగ వ్యవహారముల నడిపించుటకయి యువరాజు శిక్షణ పొందవలసి యుండెను. అందుకు వలయు రాజనీతిశాస్త్రము నేర్చుకొని యుండవలయును. శుక్రనీతి ననుసరించి, 'రాజనీతి శాస్త్రజ్ఞానము రాజుకు మిగుల అగత్య' మని తెలియుచున్నది. రాజుయొక్క ప్రాథమిక ధర్మములు ప్రజలఁ గాపాడుటయును, దుష్టులను శిక్షించుటయును నై యున్నది. కాని యివియైనను నీతి శాస్త్ర సహాయ్యము ననుసరించి జరుపవలయును. (శుక్రనీతి, అధ్యాయము ౧, శ్లో. ౧౪-౧౫.) కామందకి యందును నీ యభిప్రాయమే గలదు. కౌటిల్యుఁడు, 'యువరాజు పండితుల వలనను, అనుభవ పరులగు పరిపాలకుల వలనను, నేర్పఁబడవలయును.' అని చెప్పుచున్నాఁడు. (వృత్తి ప్రయోక్తృభ్య) ఈ యభిప్రాయమే యగ్ని పురాణమునను గలదు. యువరాజు శాసన సభయందు ముఖ్య సభ్యుఁడుగ నుండును. తఱచు రాష్ట్రమునకు అధిపతిగనో, సైన్యమునకు అధీశుఁడుగనో నియమింపఁ బడుచుండెను. (అర్థశాస్త్రము, పుస్తకము ౧, అధ్యాయము ౧౭.) అశోక చక్రవర్తి తన తండ్రి కాలములో రెండు రాష్ట్రములకు గవర్నరు చేసి సింహాసన మధిష్ఠించెను. సముద్రగుప్తుఁడు యువరాజుగ నున్నప్పుడే యోధుఁడుగఁ గీర్తిఁ బొందెను. (గుప్తశాసనములు.) రాజ్యవర్ధనుఁడు తన తండ్రి యగు ప్రభాకర వర్ధనువలన హూణులను జయించుటకయి సైన్యమునంపుచు దానికి సేనాధిపతిగఁ బంపఁబడియెను. ఒక్కొకప్పుడు వృద్ధుఁడైన రాజు రాజ్య వ్యవహారముల వలన జుగుప్స గలవాఁడయి రాజ్యమును త్యజించి యువరాజుకుఁ బట్టముఁ గట్టి విపినములకుఁ బోవుటయుఁ గలదు.



రాజయినవాఁడు సమస్త విధములను విద్య నభివృద్ధిఁ జేయుట ముఖ్యము. ఆకారణమున రాజు బ్రాహ్మణులకు మడిమాన్యముల నిచ్చి ధన కనక వస్తు వాహనములతో గౌరవించుచుండిరి. వీరు పాండిత్య మలవఱచికొని ప్రజలయందు వ్యాపింపఁ జేయుచుండెను. మనుధర్మ శాస్త్రకారుఁడు 'వృద్ధులయిన శూద్రుల యొద్ద జ్ఞానశిక్షణ మందవచ్చును. రాజయినవాఁడు శిల్ప శాస్త్రమును గళా విన్యాసమును శూద్రుల యొద్ద నేర్చుకొనవలయు' నని చెప్పినాఁడు. అటుగా నాఁడు శిల్పకళా విన్యాసము లందుఁ గడు ప్రజ్ఞావంతులు శూద్రులనియు, నాపద్ధర్మములంగ నివి నేర్చుకొనవలయు ననియుఁ దెలియవలయును. విదురుఁడు, ధర్మవ్యాధుఁడు, శూద్ర కులమునకుఁ జెందినవారు. వీరియొద్ద నీతియు జ్ఞానమును నేర్చుకొనిన వారెందఱో గలరు. 'శ్రావయేచ్చతురో వర్ణాన్' అని చెప్పఁబడినది. ప్రజా సామాన్యమున శిక్షణ మిచ్చుటకయి బ్రాహ్మణునకుఁ బ్రభుత్వ కోశమునుండి ద్రవ్యమిచ్చుచుండిరి. శిక్షా సూత్రముల నిర్ణయించుట బ్రాహ్మణుని విధియు, నతని కిచ్చెడి ద్రవ్యము సక్రమముగ వినియోగ మగుచున్నదా లేదా యని పరికించుట ప్రభుని విధి యనియుఁ దెలియవలయును. మనువు చెప్పినట్లు, 'బ్రాహ్మణస్య తపోజ్ఞానం తపః క్షత్రస్య రక్షణమ్.' అను సూత్రమును గమనించినట్లయిన బ్రాహ్మణునకుఁ దపోజ్ఞానములును, క్షత్రియునకుఁ దపమును ప్రజారక్షణమును ప్రాముఖ్యము లని తెలియుచున్నది.

కావునఁ బూర్వ రాజన్యు లేరీతిని శాస్త్రవిధి నతిక్రమించక ప్రజాస్వామ్యము నేలిరో, యెట్టి యాదర్శములతోఁ దమ జీవితముల గడపిరో, యిప్పటివారు చక్కఁగాఁ గమనించి వర్తింతురని తలఁచెదము.

---

## శాసన సభలు.

---

ప్రజలకు సంబంధించిన సంపూర్ణ హక్కుగల సభల యభిప్రాయమును బట్టి ప్రజా స్వామ్యము నడచుట అనాది నుండియు నున్నది. శాసన సభ సమితి యనియు, సభయనియు రెండు విధములు. సమితి యనునది సాధారణ ప్రజాసభ. ఈ సభ రాజు ఎన్నికవంటి ప్రాముఖ్య విషయములఁ జర్చించు సమయములఁ దక్క నితర విషయములఁ జర్చించుటకుఁ గూడదు. సభ యనునది ఐచ్ఛికముగఁ గాక సామాన్యముగఁ గూడు నట్టిది. ఇది న్యాయ, సైనిక, కార్య నిర్వాహక వ్యవహారము లన్నిఁటిని నిర్వహించుచుండును. బౌద్ధ యుగపుఁ బ్రాథమిక దినములలోఁ బ్రజాహితైక సభయే సక్రమమైన సంస్థ. అజాత శత్రువు వృజ్జులఁ జంపఁదలఁచి తన ప్రధానామాత్యుఁడగు వర్షకారుని

ద్ధిగిరియొద్దకుఁ బంపఁగా బుద్ధుఁ డాతని ముఖ్య శిష్యుని ఆనందుని 'ఓయీ! వజ్జియనులు (Vajjians) ధారాళమైన శాసన సభల నేర్పాటు చేసికొనియున్న విషయమును వినియుంటివా?' యని పృచ్ఛించినట్లును, ఆనందుఁడు 'ప్రభూ! నే నట్లే వినియుంటి' నని బుద్ధునితో ననినట్లును, బౌద్ధ సూత్రములలోఁ జెప్పఁబడినది. ఈ సభ లేవిధముగఁ గార్యములఁ జేయుచున్నది తెలిసికొనవలసి యున్నది. ఈ శాసన సభల చర్యలు అధిక సంఖ్యాకుల యభిప్రాయముల ననుసరించి జరుగుచుండెడివి. 'బహుజనూచయ' అను రీతి ద్వైధీభావమున్న యెడల గౌరవ ప్రపత్తి గల పెక్కుమంది సభ్యుల నిర్ణయ మనుసరించి పరిష్కార మగుచుండెననియు, సరిహద్దులను గూర్చిన విషయములలో గ్రామసభల పరిష్కరణమునకును, బంచాయతీ నిర్ణయమునకును, జేచాచుటయే గాక యితర శాసన సభల నిర్ణయమునకును సూచింపఁబడునవియు, రాజ శాసన సభా కార్యక్రమమున నధిక సంఖ్యాకుల యభిప్రాయ ప్రాబల్యమును బట్టియే పని జరుగుచుండెననియుఁ, జాణక్యుఁడు చెప్పుచున్నాఁడు. శాసన సభాధ్యక్షుల నెన్నికొనుటలో వయస్సును బట్టియుఁ, బ్రవర్తనమును బట్టియుఁ, దెలివితేటలను బట్టియు జరుగుచుండెనని తెలియుచున్నది. ప్రజా స్వామ్య ముండిన రాజ్యములలోనే గాక యితర రాజ్యములలోఁ గూడ నిట్టి పద్ధతి యుండెననియుఁ, బూర్వము ప్రజాహితైక శాసన సభలు ప్రాముఖ్యముగనుండెననియుఁ దెలియుచున్నది. ఎట్లయిన నేమి క్రమేపి శాసన సభల ప్రతిష్ఠ తఱిగినది. ఇట్లు తఱుగుటకుఁగల కారణము రాజశక్తిఁ యధికమగుటయు, బ్రభుత్వ పరిమాణము వృద్ధియగుటయు, వర్ణ వ్యవస్థ పొడమాపుటయు నయి యున్నది. ప్రజాసభల సమావేశములు సన్నగిలి తుదకు అదృశ్యములైనవి. రాజసభ (సమితి) యును, మంత్రి పరిషత్తును, బ్రాచీన ప్రజా సమావేశములు. మత, వర్ణ సమావేశములు పూగ, శ్రేణుల క్రిందఁ బరిణమించినవి. ప్రతి దినమును రాజ సభ కూడుచుండును. ఈ సభయందుఁ బ్రజలు తమకుఁ గల సాధక బాధకములను గూర్చి పెట్టుకొనిన ప్రార్థన పత్రములను (పిటీషనులు) పుచ్చుకొని విచారింపఁబడును. (శుక్రనీతి, అధ్యాయము ౧, శ్లో. ౩౨.) రాజ్యమందలి Final Court of Appeals. (పర్యవసాన నిర్ణయన్యాయస్థానము) పనులు గూడ 'రాజ సభ' యే నెఱవేర్చుచుండెను. కొన్ని సమయములందీ సభలోఁ బ్రభుత్వ వ్యవహారములు గూడ యోజింపఁబడుచుండెను. (శుక్రనీతి, అధ్యాయము ౧, శ్లో. ౩౫౨.) 'ఈ రాజ సభ' యందు మంత్రులును, యువరాజును, రాజబంధువులును, సామంతరాజులును, గౌరవ ప్రపత్తి యున్నవారును, ఇతర ఉన్నతోద్యోగులును, సభ్యులుగ నుందురు. 'అధికారి కానివాఁడును, సభకుఁ బిలువఁబడని వాఁడును, 'రాజ సభకు రాఁగూడ' దని నీతి వాక్యామృతము చెప్పుచున్నది. (అధ్యాయము, ౨౪.) ధృతరాష్ట్రుఁడు 'రాజసభ' యందుఁ బాండవులతో సంధి చేసికొను విషయమును గూర్చియు, సఖ్యతను పాటించు విషయమును గూర్చియు, నొక తీర్మాన ముంచెననియుఁ, బాండవులు పోఁగొట్టికొనిన రాజ్యమును మరల రాఁబట్టుకొనుటకుఁ బ్రయత్నములఁ జేయుఁడని యుద్బోధించెననియుఁ దెలియుచున్నది. ఈ సభ



యందలి సభ్యులు నీతివర్తనమును, బరిజ్ఞానమును, రాజభక్తియును, స్నేహితుల పట్లను విరోధుల పట్లను నొకే యభిప్రాయమును, భయ, కోప, ఆశలు, కోర్కెలవలనఁ దమ ధర్మమును మైమఱవక చక్కఁగ నిర్వహించు స్వభావమును గలవారుగ నుండవలయునని విష్ణు స్మృతి యందు వ్రాయఁబడినది. (అధ్యాయము ౩.) శాసనసభయందు సభాసదులు, సభాకరులు,—ఉండు స్థానములు ప్రత్యేకింపఁ బడినవని శుక్రనీతియందుఁ జెప్పఁబడియున్నది. (అధ్యాయము ౧, శ్లో. ౩౫౩.) మహా భారతమునందుఁ గుబేరుఁడు, బ్రహ్మ, వరుణుఁడు, యముఁడు, ఇంద్రుఁడు,—మొదలగువారి శాసన సభాశాలలు మిగులఁ జిత్రముగ నభివర్ణింపఁబడి యున్నది. (సభా పర్వము.) సభ్యుల యొడ మర్యాద, సరసములతోఁ గూడిన ప్రవర్తనము ఎదురొడ్డు చుండెను. పరస్పర సంభాషణలు నిషేధింపఁ బడినవి. సభలో నొకఁడు మాటాడు సమయమున అనఁగా నడుమ మఱి యొకఁడు అడ్డు తగులఁగూడదు. 'వాక్యాపక్షేపణం' అని యర్థ శాస్త్రమున సూచింపఁబడినది. (పుస్తకము ౫, అధ్యాయము ౪.) 'సభ్యులు మాటాడవచ్చునని చెప్పినప్పుడును, రాజ్యోపద్రవము సంభవించునని తోఁచినప్పుడును, రాజాజ్ఞ లేకుండనె సభ నుద్దేశించి మాటాడవచ్చును. రాజుకు నుంచి సలహా నిచ్చుటయే శాసన సభ్యుని కర్తవ్యము, ఇతర సభ్యు లంగీకరింతురా లేదా యను సంశయమునకు లోను గాక సభ్యుఁడు ధార్మిక దృక్పథమున మాటాడవలయును.' అని చాణక్యుఁడు చెప్పుచున్నాఁడు. శాసన సభ్యుఁ డెప్పుడును సభ యందలి యితర సభ్యులఁ దూలనాడకను, వారి చర్యల కపార్థమును గల్పించియును, మాటాడగూడదనియు, నతఁ డెల్లప్పుడు రాజ్యాభివృద్ధియే మనసునందుంచికొని మర్యాదతో మాటాడుచుండవలయుననియు, నతఁడు తన పదవికిఁ దగని వివరణములను (Statements) గాని, తాను మాటాడు విషయమునఁ బూర్ణమైన వివరములు దెలిసికొనక గాని, నమ్మరానట్టియు, ననృతములయినట్టియు,—విషయములను గాని, హద్దుమీఱి మాటాడఁగూడదనియు, నర్థశాస్త్రమునఁ జెప్పఁబడి యున్నది. (పుస్తకము ౫, అధ్యాయము ౪.) చాణక్యుని యభిప్రాయమున, 'నితర సభ్యుఁ డెవఁడయినను దన్ను నెదుర్కొనినను, దా నితరుల నెదుర్కొనరా' దని తెలియుచున్నది. 'శాసన సభ్యులు రాజ్యమునకు హితకరములును, బ్రియములును, యథార్థములును, నైన మాటలనే మాటాడవలయు' నని శుక్రనీతి సలహా నిచ్చుచున్నది. (శుక్రనీతి, అధ్యాయము ౧, శ్లో. ౧౨౧-౧౨౨.) ఇతర సభల కార్యక్రమమునకును,—రాజ సభా కార్య ప్రణాళికకును, భేద మెంతయో గలదు. రాజ సభలో 'వోట్లు' తీసికొనుట లేదు. కాని మంత్రుల సలహాలతోను, శాసన సభ యొక్క సాధారణాభిప్రాయముతోను (General Opinion) అన్ని విషయములు రాజే పరిష్కరించుచుండెను. కార్యనిర్వాహక సమయములందు గొప్ప సమావేశములు జరుగుచుండెను యుధిష్ఠిరుఁడు 'ఖాండవప్రస్థ' మను రాజధాని నగరమును గట్టించి యందు గ్రొత్తఁగాఁ బ్రవేశించు నప్పుడు గొప్ప రాజన్యులను, బ్రసిద్ధి వహించిన ఋషిసత్తములను, భారత దేశములోని యున్నతాధికారులను, నాహ్వానించి

యట్టి గొప్ప సభ చేయించెను. (మహాభారతము, శాంతిపర్వము.) మగధ దేశాధిపతి యగు బింబిసారుఁడు సమావేశ మొనర్చిన గొప్ప సభకు నగర విచారణ కర్తలు (Overseers) ఎనుబదివేలమంది హాజరయిరని మహావంశమున వ్రాయఁబడియున్నది. ముఖ్యమైన పరిపాలనా సందర్భములను గూర్చి చర్చింపఁబడు నన్నపుడు ముందుగా మంత్రి పరిషత్తునందుఁ జర్చింపఁబడి నిర్ణయింపఁబడును. (అర్థశాస్త్రము, పుస్తకము ౧, అధ్యాయము ౧౪.) సోమదేవ సూరి తన నీతి వాక్యామృతములో నిదే వాక్యముల నుపయోగించినాఁడు. (అధ్యాయము ౯.) 'కామందకి' యందు శాసన సభకు 'మంత్ర మండల' యను పదము ఉపయోగింపఁబడినది. ఈ 'మంత్రి మండల' యందు ప్రభుత్వపు టున్నతోద్యోగులును అనుద్యోగులయందుఁ గొందఱును నుండిరి. బృహస్పతి శాసన సభలోఁ బదుమూఁడుగు రుండినఁ జాలుననియు, మనువు పండ్రెండుగురుండినఁ జాలుననియుఁ, జాణక్యుఁడు అధిక సంఖ్యాకులుండవలెననియు, యుశనుఁడు (Usanas) ఇరువది మంది యుండినఁ జాలుననియు నభిప్రాయ పడుచున్నారు. 'అక్షుద్ర పరిషత్కః' యని చాణక్యుఁడు రాజు కుండఁదగిన ముఖ్య గుణములలో నొకటిగ వర్ణించినాఁడు. కాని నియమిత సభ్యులు రాజ్యావసరముల పయి నాధారపడి యుండిరి. ఒకని యభిప్రాయ ప్రాబల్య సమీకరణము విజయమునకుఁ దోడ్పడదని విశాలాక్షుఁడు చెప్పుచున్నాఁడు. తెలిసికొనఁ బడినవి, గుణములందుఁ దక్కువయినవి, తెలిసికొనఁ బడనివి,—అని ప్రభుత్వ కార్యములు ముత్తెఱంగులు. ఈ విషయము స్ఫుటముగ నర్థశాస్త్రమునఁ గలదు. (పుస్తకము ౧, అధ్యాయము ౧౫.) సోమదేవసూరి నీతివాక్యామృతమునందును ఈ యభిప్రాయమే వ్యక్తీకరింపఁ బడినది. శాసన సభయందు రాజ్యాభివృద్ధి కనువుపడు విషయములను జర్చింతురు. చాణక్యుఁ డయిదు విషయములను మాత్రము చర్చింతురని చెప్పినాఁడు. సోమదేవసూరి యభిప్రాయమును బట్టి శాసన సభా వ్యవహారములు స్వల్ప వ్యయముతోఁ గూడికొని ఫలిత మధికముగ నిచ్చునవియై యున్నవని తెలియుచున్నది. (నీతివాక్యామృతము, అధ్యాయము ౧౦.) శాసన సభా సమావేశములకు రాజే అధ్యక్షత వహించుచుండెను గాని అతఁడు హాజరు లేనపుడు అతని ప్రధానామాత్యుఁడే యధ్యక్షత వహించుచుండెను. రాజ్యవర్ధనుఁడు చనిపోయినప్పుడు అతని ప్రధానామాత్యుఁడగు భండియనునతఁడు రాజు నేర్పాటు చేసికొను సందర్భమునఁ గూడిన సభకు అధ్యక్షత వహించెనని హర్ష చరిత్రమువలనఁ దెలియుచున్నది. ప్రథమమున నధ్యక్షుఁడు పరిమాణము (Measure) ను బ్రవేశపెట్టును. 'పూర్వమ్ స్వామినా కార్య నివేదనమ్.' అని బృహస్పతి సూత్రములలోఁ గలదు. (౪-౩౭.) తరువాత ప్రతి సభ్యుని యభిప్రాయమును విందురు. 'యత్పునర్యథా క్రమం యేకైకస్య మతం శ్రోతవ్యం' (బృహస్పతి సూత్రములు, ౪. ౪౦.) పిదప సాధారణ చర్చ తీసికొనఁ బడును. సభ్యులంద ఱేకముగ నుండినఁ జాల మంచిది. లేకున్న నధిక సంఖ్యాకుల నిర్ణయము నెగ్గును. 'యద్భూయిష్ట బ్రూయు స్తత్ర్యాత్' అని యర్థశాస్త్రమున వ్రాయఁబడినది. (పుస్తకము ౧, అధ్యాయము



౧౫.) వివేకులగు సభ్యులచే నాదర్శ ప్రాయముగ నుండునటులు నైకకంఠ్యముగ నిర్ణయింపఁబడు సభ మంచిదనియుఁ, బ్రథమమున భిన్నాభిప్రాయ ముండినను పిదప ఏకగ్రీవముగ నిర్ణయ మొసంగు సభ మధ్యమమనియుఁ గలహించుచు నిందించుచు నొకరు క్రోధముగను వేఱొకరు స్వార్థముగను, నొకవైపు కన్నీరును, మఱియొక వైపు కోపమును గలిగి నిర్ణయించిన సభ నీచమనియు బృహస్పతి చెప్పుచున్నాఁడు. (బృహస్పతి సూత్రములు, ౪. ౩౪-౩౬.) శాసన సభా సమావేశములకు సభ్యులు గాక తక్కినవారు అనుజ్ఞా పత్రములు లేనిదే రానిచ్చుట లేదని నీతివాక్యామృతము చెప్పుచున్నది. కొన్ని సమయములలోఁ జర్చలు దీర్ఘములుగ నుండెడివి. చాణక్యుఁడు 'నదీర్ఘం మంత్రయన్' అని చెప్పినాఁడు. (అర్థశాస్త్రము, పుస్తకము ౧, అధ్యాయము ౧౫.) మంత్రులు తమలోఁ దాము పోరాడుకొనరాదనియుఁ, బరస్పర సంభాషణలలో హద్దుమీఱి మాటాడఁగూడదనియు, నీతివాక్యామృతము చెప్పుచున్నది. (అధ్యాయము, ౧౦.) సభలోఁ దీర్మానింపఁ బడిన పిదప ననుష్ఠించుట కేమాత్రమును ఆలస్య ముండదు. రాజ్యమునకు శాసన సభ ముఖ్య కార్యనిర్వాహక సంస్థయై యుండెను. శాసన సభాభిప్రాయము లేనిదే రాజు ఏ పనియుఁ జేయరాదు. 'మంత్రి సంపదాహి రాజ్యం నీయతే' యని చాణక్య సూత్రములలోఁ గలదు. చట్టము లన్నియు శాసన సభాంగీకారమును బడసినవి. శాసన సభ విశేషాధికారములను, స్వాతంత్ర్యమును గలిగి యుండెను. అసాధారణ వివాదములలో రాజు నెన్నికొను అధికారము గూడ కలిగి యుండెను. దక్షిణ హిందూదేశమందలి కేరళ రాష్ట్రమునఁ గ్రీ. శ. మొదటి రెండు శతాబ్దములలో ౫ శాసనసభ లుండెనని తెలియుచున్నది. ఒక సభ ప్రజాసభ. ఇందు దేశములోని యన్ని ప్రాంతముల ప్రతినిధులును నుందురు. ఈ సభ వారికి రాజును బరిశీలించు విశేషాధికారము గూడఁ గలదు. ఇంకొక సభ ఆచార్యుల సభ (పురోహితుల సభ.) ఇందు మత విషయములకు సంబంధించినవా రుందురు. మఱియొక సభ వైద్యుల సభ. ఇది యొక విధముగ పబ్లిక్ హెల్తు ఆఫ్ బోర్డు వంటిది. వేఱొక సభ జ్యోతిషికుల సభ. ఈ సభ్యుల పని పబ్లిక్ కార్యములు నిర్వహించుట కనుకూలించు ముహూర్తముల నిర్ణయించుట. ఒక సభ మంత్రుల సభ. న్యాయ పరిపాలనము, సుంకము వసూలు చేయుట, వ్యయపఱచుట,—ముఖ్య కృత్యములుగఁ జేయునట్టిది. సింహళ ద్వీపములో నన్ని పరిమాణములును శాసన సభవారిచే నాచరణయందుంపఁబడుననియు, నన్ని యుత్తరువులును శాసన సభవారిచే జారీయగుచుండెననియు, శాసన సభాధికారము వలననే నిర్వహింపఁబడుచుండెననియు, సింహళ శాసనమువలనఁ దెలియుచున్నది. (Epigraphia Zeylanica, Vol. 1. No. 24.) లీలావతి రాణి Slab Inscription లో విజ్ఞానమును, నమ్మకము, ధైర్యము గల యట్టి మంత్రులు గల సభ వలననే యామె యితర రాజ్యముల యుపద్రవము లేకుండఁ దన రాజ్యమును గాపాడుకొనఁ గల్గెనని యున్నది. (Epigraphia Zeylanica, Vol. 1. No. 14.)

కాఁబట్టి సోదరులారా! పూర్వము శాసన సభ కెట్టి యధికారము కలిగి యున్నదో, సభ్యుల కెట్టి గుణసంపత్తి యవసరమో, యెట్టి విషయముల నిర్ణయించెడివో, యే యాదర్శముల ననుసరించి నిర్ణయ మయ్యెడివో, పరిగణన మే విధముగ జరుగుచుండెనో, విజ్ఞాన వంతులగు ఋషివర్యుల అడుగు జాడలయందు రాజ్య మెట్లు నడచుచుండెనో, గమనించి నేఁటి శాసన సభా వ్యవహారములకును, నాఁటి వ్యవహారములకును,—గల భేదమును దెలిసికొని వర్తింతురు గాక!

సంపూర్ణము.

---



# ప్రకటన.

---

## స్త్రీరత్నములు.

(Approved by the Text Book Committee Madras.)

గ్రంథకర్త: "సాహిత్యవిశారద" బిరుదాంచితులగు

బ్రహ్మశ్రీ కోన వేంకటరాయశర్మగారు.

ఇందు అహల్యాబాయి, దుర్గావతి, రామాబాయి, జేబున్నీసా, సావిత్రి, సుకన్య, మొదలగు పదిమంది స్త్రీరత్నముల జీవితములు వ్రాయఁబడినవి. విజయనగర మహారాజావారి కళాశాలలో ఆంగ్ల భాషా అధ్యాపకులును, ఆంధ్రపరిశోధక విశ్వ విద్యాలయ వైసు ఛాన్సలరును, నగు శ్రీ డాక్టరు బుర్రా శేషగిరిరావు పంతులుగారు, ఎం. ఏ; పి. హెచ్. డి; చక్కని పీఠికను వ్రాసిరి.

వెల రు ౦—౧౨—౦ లు.

## స్త్రీరత్నములు.

(రెండవ భాగము.)

ఇదియును సాహిత్య విశారదులచేతనే వ్రాయఁబడినది.

ఇందు దేవహూతి, దమయంతి, నంగనాచి, సరళ, మీరాబాయి, మొదలగు పదిమంది స్త్రీరత్నముల పవిత్రజీవితము లభివర్ణింపఁబడినవి. అచ్చులో నున్నది.

## కన్నడదేశ చరిత్ర.

గ్రంథకర్త:-బ్రహ్మశ్రీ సాహిత్య విశారద కోన వేంకటరాయశర్మగారు.

విఖ్యాత యశస్కులగు శర్మగారు పరిశోధన మొనర్చి కన్నడదేశము యొక్క చరిత్రను సమగ్రముగ వ్రాయుచున్నారు. ఆంధ్రుల ప్రతిభా విశేషములకును గీర్తివల్లికకును దీసిపోవని ప్రాశస్త్యముల వహించికొని ప్రసిద్ధి వడసిన కర్ణాటకుల రూపు సంపదలు దెలిసి

